# ఉపాధ్యాయుని అదనపు సమాచార తీయారి

## 10 వ తరగతి

## పాఠ్యాంశాల వారి లఘు పరీక్షలు

## మరియు ప్రాజెక్టులు

**ఇందులో ...... దీనితో బాటుగా ....... సమకూర్చునవి**

నమూనా కరపత్రములు, నమూనా లేఖలు ,

నమూనా వ్యాసములు, నమూనా సంభాషణలు ,

అపఠిత పద్య భాగములు , అపఠిత గద్య భాగములు

వాచక చిత్రపటములు

ఉపవాచక రామాయణ చిత్రములు పుస్తక సమీక్ష పత్రములు

సంకలనం : కవితాశిరోమణి పంతుల వెంకట రాధాకృష్ణ ( పరాక్రి )

# ACADEMIC MODULE ( సంవత్సరీక ప్రణాళిక )

**తరగతి : X** **తెలుగు**

| క్రమ సంఖ్య | మాసము | బోధించే పాఠము | అవసర మైనకా లాంశము | అవసరమైన వనరులు /సామాగ్రి | నిర్వహించ వలసిన కార్య క్రమములు | ప్రోజెక్టు పనులు |
|---|---|---|---|---|---|---|
| 1 | జూన్ | మాతృభావన అమరావతి | 12 | శబ్దాలంకార ములు | ఉపవాచకం రామాయణం | ప్రముఖ స్త్రీల/ సంస్కర్తల కృషి చిత్ర సేకరణ అమరావతి శిల్ప చిత్ర సేకరణ |
| 2 | జూలై | జానపదునిజాబు పెన్నల | 26 | ఛందో ప్రకరణం | బాలకాండ | అందమైన గ్రామ సిమలు సంకలనం నృసింహ స్వామి గ్రంధ పట్టిక |
| 3 | ఆగష్టు | ధన్యుడు శతక మధురిమ | 23 | ప్రత్యక్ష పరోక్ష కథనం | అయోధ్య కాండ స్వతంత్రదినం | సొంత కథ మీకు నచ్చిన ఐదు శతక పద్యాలు వాటి భావాలు |
| 4 | సెప్టెంబరు | మా ప్రయత్నం | 20 | కర్తరికర్మణి వాక్యాలు | గురు పూజోత్సవం | ప్రసిద్ధ మహిళలు ఫొటోలు మహిళావరనం పుస్తక తియారి |
| 5 | అక్టోబరు | సముద్ర లంఘనము | 20 | సంధి ప్రకరణం | అరణ్య కాండ | హనుమంతుని ఏక పాత్రాభినయనం |
| 6 | నవంబరు | మాణిక్యవీణ | 24 | సమాస ప్రకరణం | కిష్కింధ కాండ | దిన పత్రికలలో కవితలు సేకరణ |
| 7 | డిసెంబర్ | గోరంతదీపాలు | 22 | అలంకార ప్రకరణం | సుందర కాండ | కథల పుస్తకం పై సమీక్ష సంఘటనల క్రమం జాతీయాలు సామెతల వివరణ |
| 8 | జనవరి | భిక్ష | 20 | అలంకార ప్రకరణం | గణతంత్రదిన ం | శ్రీనాధుని సీస పద్యాలు గోడ పత్రిక ప్రదర్శన |
| 9 | ఫిబ్రవరి | చిత్రగ్రీవం | 20 | గ్రాంధికవ్యవ హారబాషలు | యుద్ధ కాండ | అంతర్జాలం ద్వారా ఏపైని రెండు పక్షులు జంతువుల సంక్షిప్త కథ |
| 10 | మార్చి | పునర్విమర్శ | ---- | మాత్రా ఛందస్సు | పునర్విమర్శ | రామాయణ ప్రాసస్త్యం పాత్ర విశ్లేషణలు |
| 11 | ఏప్రిల్ | పునర్విమర్శ | ---- | పునర్విమర్శ | పునర్విమర్శ | -------- |

**Signature of the Teacher** **Signature of the HeadMaster**

| FORMATIVE ASSESSMENT - పాఠ్యాంశ వారిగా లఘు పరీక్ష<br>విద్యార్థి పేరు నెం: 10వ తరగతి సెక్షన్ : | మార్కులు |
|---|---|
| పాఠశాల పేరు - **మాతృభావన** విశాఖజిల్లా. | **20** |

1. **అవగాహన ప్రతిస్పందన – 5M**

   Q. కుటుంబం – సమాజం అభివృద్ధిలో స్త్రీల పాత్రను రాయండి ?

2. **సృజనాత్మకత వ్యక్తీకరణ – 5M**

   Q. సోదేవుని మనస్తత్వాన్ని సొంత మాటలలో రాయండి ?

3. **వ్యాకరణాంశములు – 5M**

   1. అక్షి అర్థం రాయండి ?
   2. రత్నము వికృతి రాయండి ?
   3. పతివ్రత వ్యుత్పత్తిని రాయండి ?
   4. పుణ్యావాసము సంధిని రాయండి ?
   5. పుస్తకాలు సమాసమును రాయుము ?

4. **ఉపవాచక ప్రశ్న రాయండి. 5M**

   Q. రామాయణమును ఎందుకు చదవాలి ?

***ప్రాజెక్టు పని 1 :***

Q. వివిధ రంగాలలో ప్రసిద్ధి గాంచిన స్త్రీల వివరాలను సేకరించి ప్రదర్శించండి ?

# వివిధ రంగాలలో ప్రసిద్ధ స్త్రీలు



**మదర్‌థెరిస్సా** : తన జీవితాన్ని సమాజసేవకే అంకితం చేసిన మహనీయురాలు. 1910 లో యుగోస్లావియా దేశంలోజన్మించారు. తన 18వ ఏట భారతదేశానికి వచ్చి కలకత్తా కేంద్రంగా 'మిషనరీస్ ఆఫ్ ఛారిటీస్' సంస్థను స్థాపించారు.1948లో భారత పౌరసత్వం పొందారు. 1979లో 'నోబెల్ శాంతి పురస్కారం' , 1980లో 'భారతరత్న' పురస్కారం పొందారు. 1997 సెప్టెంబర్ 5న మరణించారు.



**శ్రీమతి ఇందిరాగాంధి :** ప్రథమ భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ఏకైక పుత్రిక శ్రీమతి ఇందిరాగాంధి. నవంబర్ 19న 1971లో అలహాబాదులో జన్మించారు. ఒకటిన్నర దశాబ్దం పాటు భారతదేశానికి ప్రధానిగా ఉండి ప్రపంచఖ్యాతి గాంచిన భారత మహిళ. ఈమె 1984 అక్టోబర్ 31న తన రక్షక సిబ్బంది తుపాకీ గుండుకు గురియై హఠాన్మరణం చెందారు. తల్లి కమలా నెహ్రూ. 1971 లో 'భారతరత్న' పురస్కారమును అందుకున్నారు.



**దుర్గాబాయి దేశ్‌ముఖ్ :** స్వాతంత్ర్య సమరయోధురాలు. మహిళా జనోద్ధరణకై తన జీవితాన్ని అంకితం చేసిన ధన్యజీవి. ఆంధ్రమహిళాసభ స్థాపకురాలు. 1909 జూలై 15న దుర్గాబాయి జన్మించింది. గాంధీజీతో పాటు స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొని అనేక పర్యాయములు జైలు శిక్షలు కూడా అనుభవించారు. స్త్రీల విద్యకు, స్త్రీ జనోద్ధరణకు ఈమె కృషిచేశారు. భారత ప్రభుత్వం 'పద్మవిభూషణ' బిరుదునిచ్చి సత్కరించింది. 1981 మే 9న హైదరాబాదులో దుర్గాబాయి కీర్తి శేషులయ్యారు.



**సునీతా విలియమ్స్ :** భారత సంతతికి చెందిన అమెరికా అంతరిక్ష పరిశోధకురాలు. 1965 సెప్టెంబర్ 19న జన్మించారు. మహిళా అంతరిక్ష ప్రయాణికులలో ఎక్కువసేపు అంతరిక్షయానం చేసినవారుగా ఈమె ప్రపంచరికార్డు సృష్టించారు.



**సరోజినీ నాయుడు :** ప్రముఖ కాంగ్రెస్ నాయకురాలు. ఆంగ్ల కవయిత్రి. 'భారతకోకిల' గా ప్రసిద్ధికెక్కారు. 1897 ఫిబ్రవరి 13న వంగదేశంలో జన్మించారు. 11వ ఏటనే ఇంగ్లీషులో ఆమె కవిత్వం వ్రాయడం ప్రారంభించారు.



**కల్పనా చావ్లా :** భారతదేశంలో హర్యానాలోని కర్నాల్ అనే ఊరులో 1962 మార్చి17న కల్పనా చావ్లా జన్మించారు. ఇండియన్-అమెరికన్ వ్యోమగామి. 2003 ఫిబ్రవరి 1న ఈమె మరణించారు.



**లతామంగేష్కర్ :** ప్రఖ్యాత నేపథ్యగాయని. 20భాషల్లో 50 వేలకు పైగా పాటలు పాడారు. 1929 సెప్టెంబర్ 28 జన్మించారు. భారత ప్రభుత్వం నుండి అన్ని అత్యుత్తమ పురస్కారాలు అందుకున్న అరుదైన గాయకురాలు లతామంగేష్కర్.



**శకుంతలాదేవి :** భారతీయ గణిత శాస్త్రవేత్త. మానవ కంప్యూటర్‌గా ప్రసిద్ధికెక్కారు.

**సైనా నెహ్వాల్ :** ప్రముఖ బ్యాడ్మింటన్ క్రీడాకారిణి.



**సానియా మీర్జా :** గొప్ప టెన్నిస్ క్రీడాకారిణి.

**ఝాన్సీ లక్ష్మీబాయి :** స్వాతంత్ర్య ఉద్యమంలో కత్తిపట్టి బ్రిటిష్ వారితో పోరాడి, దేశం కోసం ప్రాణాలను అర్పించిన వీరవనిత ఝాన్సీ లక్ష్మీబాయి.

# 10వ తరగతి - ప్రాజెక్టు - 1 సంఘుసంస్కర్తలు

| | |
|---|---|
| ఆధునిక భారతదేశ పునాది స్థాపనలో భారతీయ సంఘు సంస్కర్తలు గొప్ప చరిత్రను కలిగి ఉన్నారు. కొన్ని సందర్భాలలో వీరు తమ రాజకీయ మరియు తత్వజ్ఞాన బోధనల ద్వారా ప్రపంచంలోని అన్ని ప్రాంతాలను ప్రభావితం చేశారు. కొంతమంది భారతీయ సంఘు సంస్కర్తలు : | |
| నర్మదా బచావో ఉద్యమంతో పేరు గాంచిన సామాజిక ఉద్యమకారిణి. మేధాపాట్కర్ ముంబయిలో జన్మించారు.ఈమె తల్లిదండ్రులు ఇందు, వసంత్ కనేల్కర్ ఇద్దరూ సామాజిక కార్యకర్తలే. టాటా ఇన్స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్ లో ఎం.ఎ. సోషల్ వర్క్ చేసిన తర్వాత 7 సంవత్సరాలు ముంబయి, గుజరాత్ లలోని స్వచ్ఛంద సంస్థలలో పని చేశారు. మేధాపాట్కర్ నర్మదా బచావో ఉద్యమం ఇప్పటికీ క్రియాశీలకంగా ఉందిఆదివాసిలు, రైతులు, పర్యావరణ ప్రియులు, మానవహక్కుల సంఘం సభ్యులు మొదలైనవారితో కూడిన ఈ ఉద్యమం చాల పొడవైన నర్మదానది పైన కట్టడంలకు సంబంధించింది. గుజరాత్, మధ్యప్రదేశ్ లను దాటుకుంటూ పోయె ఈ నదిపై డాములను నిర్మిచేప్పుడు ఆ నిర్వాసితులను సంప్రదించకుండా, వారికి జరిగే నష్ట కష్టాలను లెక్కించకుండా ప్రభుత్వం చేసిన నిర్ణయాలను ఈ ఉద్యమం ప్రశ్నించింది. ఈ ఉద్యమాన్ని భారతదేశంలోని 30 కి పైగా కేంద్రాలలో జరిపారు. నేషనల్ ఎలియన్స్ ఆఫ్ పీపుల్స్ మూమెంట్స్ అనేది సామాజిక ఆర్థిక న్యాయం, రాజకీయ న్యాయం, అసమానతలకు సంబంధించిన ఉద్యమం. | మేధాపాట్కర్ |
| సావిత్రిబాయి పూలె మహారాష్ట్ర లోని నయిగావ్ గ్రామంలో జన్మించారు.తల్లిదండ్రులు ఖండోజి, లక్ష్మి. సావిత్రిబాయి భారతదేశంలో మొదటి మహిళా పాఠశాల యొక్క మొదటి మహిళా ఉపాధ్యాయురాలు. 1852 లో అస్పృశ్య బాలికల కోసం ఆమె ఒక పాఠశాలను ప్రారంభించారు. 1854 లో కావ్య పూలె అనే పద్య కావ్యాన్ని రచించి చరిత్ర సృష్టించారు. 1856 లో సావిత్రి ఉపన్యాసాలు పేరుతో మరో గ్రంథాన్ని రాశారు. మహారాష్ట్ర "ఆధునిక కవిత్వానికి ఆద్యురాలు" గా ఆమె గుర్తింపు పొందారు. "బాలహత్య ప్రతిబంధక గృహ" స్థాపించి బాలహత్యలను నివారించేందుకు కృషి చేసిన ప్రేమ స్వరూపిణి సావిత్రిబాయి పూలె. ఆజన్మాంతం పేద, స్త్రీలకు, అంటరాని వారి అభ్యున్నతే ధ్యేయంగా సామాజిక అసమానతలను రూపుమాపడమే లక్ష్యంగా సమాజాన్ని 100 సంవత్సరాలు ముందుకు పరుగులు పెట్టించిన ఆధునిక సంఘుసంస్కర్త. 1896-97 లో మహారాష్ట్రలో సంభవించిన ప్లేగు వ్యాధి గురైన వారికి సేవ చేయడంలో నిమగ్నమై చివరికి అదే వ్యాధికి గురై మరణించారు. | సావిత్రిబాయి పూలె |
| రాజా రామ్మోహన్ రాయ్ ( బెంగాలీ: রাজা রামমোহন রায় ) (మే 22, 1772 – సెప్టెంబరు 27, 1833) బ్రహ్మ సమాజ్, భారతదేశము లో మొదటి సామాజిక-మత సంస్కరణ ఉద్యమాలను ప్రారంభించాడు. ఆతని విశేషమైన ప్రభావము రాజకీయ, ప్రభుత్వ నిర్వహణ, విద్యా రంగముల లోనే కాకుండా హిందూ మతము పైన కూడా కనపడుతున్నది. ఇతడు గొప్ప సంఘుసంస్కర్త. బ్రిటిష్ ఇండియా కాలంలో అప్పటి ప్రముఖ సాంఘిక దురాచారమైన సతీసహగమనాన్ని రూపుమాపడానికి చాలా కృషిచేశాడు. వితంతు పునర్వివాహానికి కూడా మద్దతు పలికినాడు. స్త్రీవిద్యకై పాటుపడ్డాడు. బ్రహ్మసమాజాన్ని స్థాపించాడు. ఆంగ్ల విద్యకు అనుకూలంగా ఉండి, దేశంలో ఆంగ్ల విద్యావిధానానికి కృషిచేశాడు.<br>*1828* లో ఇంగ్లాండు కు వెళ్ళక ముందు ద్వారకా నాథ టాగూర్ తో కలసి బ్రహ్మసమాజ్ ను ప్రారంభించెను. బ్రహ్మసమాజ్ ఒక ముఖ్యమైన ఆధ్యాత్మిక, మత సంస్కరణ ఉద్యమముగా మారి బెంగాల్ లో సాంఘిక , వివేచనాత్మక సంస్కరణ లకు దారి తీసింది. వీటన్నిటి వలన రాజా రామ్మోహన్ రాయ్, బెంగాల్ సాంస్కృతిక పునరుజ్జీవనము లో ఒక ముఖ్యుడిగా భావింపబడెను. | రామ్మోహన్ రాయ్ |

**స్వామీ వివేకానంద** (*జనవరి 12, 1863 - జులై 4, 1902*), (బెంగాలీలో 'షామీ బిబేకానందో') ప్రసిద్ధి గాంచిన హిందూ యోగి. ఇతని పూర్వ నామం నరేంద్ర నాథ్ దత్తా. రామకృష్ణ పరమహంస ప్రియ శిష్యుడు. వేదాంత, యోగ తత్త్వ శాస్త్రములలో సమాజముపై అత్యంత ప్రభావము కలిగించిన ఒక ప్రఖ్యాత ఆధ్యాత్మిక నాయకుడు. హిందూ తత్వ చరిత్ర, భారతదేశ చరిత్రలలోనే ఒక ప్రముఖ వ్యక్తి. రామకృష్ణ మఠం వ్యవస్థాపకుడు. భారతదేశాన్ని జాగృతము చెయ్యడమే కాకుండా అమెరికా, ఇంగ్లాండుల లో యోగ, వేదాంత శాస్త్రములను తన ఉపన్యాసముల ద్వారా, వాదనల ద్వారా పరిచయము చేసిన ఖ్యాతి అతనికి కలదు. గురువు గారి కోరిక మేరకు అమెరికాకు వెళ్ళి అక్కడ హిందూ మతప్రాశస్త్యం గురించి ఎన్నో ఉపన్యాసాలు చేశాడు.భారతదేశాన్ని ప్రేమించి,భారతదేశం మళ్ళీ తన ప్రాచీన ఔన్నత్యాన్ని పొందాలని ఆశించిన వారిలో ముఖ్యులు స్వామి వివేకానందా. అతని వాగ్ధాటికి ముగ్ధులైన అమెరికా ప్రజానీకం బ్రహ్మరథం పట్టింది. ఎంతో మంది అతనికి శిష్యులయ్యారు. పాశ్చాత్య దేశాలలోకి అడుగు పెట్టిన మొదటి హిందూ సన్యాసి ఈయనే. తూర్పు దేశాల తత్త్వమును షికాగో లో జరిగిన ప్రపంచ మత జాతర (పార్లమెంట్ ఆఫ్ వరల్డ్ రెలిజియన్స్)లో *1893* లో ప్రవేశపెట్టాడు. అక్కడ షికాగోలోను, అమెరికాలోని ఇతర ప్రాంతాలలోను ప్రజల అభిమానాన్ని చూరగొన్నాడు. తిరిగి భారత దేశం వచ్చి రామకృష్ణ మఠాన్ని స్థాపించి దీని ద్వారా భారత యువతకు దిశా నిర్దేశం చేశాడు. ముప్పై తొమ్మిది ఏళ్ళ వయసు లోనే మరణించాడు. ఆయన చేసిన సేవలకు గుర్తింపుగా భారత ప్రభుత్వం ఆయన జన్మ దినాన్ని "జాతీయ యువజన దినోత్సవం" గా*1984* లో ప్రకటించింది.



స్వామీ వివేకానంద

**నవయుగ వైతాళికుడు**

**జననం - 1848, ఏప్రిల్ 16రాజమండ్రి** **మరణం - 1919, మే 27**

**ప్రసిద్ధి సంఘసంస్కర్త, రచయిత** **సాధించిన విజయాలు- రావుబహద్దూర్**

**భార్య / భర్త – బాపమ్మ** **తండ్రి – సుబ్బారాయుడు** **తల్లి - పున్నమ్మ**

**కందుకూరి వీరేశలింగం** గొప్ప సంఘ సంస్కర్త, తెలుగు జాతి గర్వించదగ్గ మహోన్నత వ్యక్తి. సంఘ సంస్కరణకు, సామాజిక దురాచారాల నిర్మూలనకు నిరుపమానమైన కృషి చేసిన మహానుభావుడు ఆయన. సాహితీ వ్యాసంగంలోనూ అంతటి కృషి చేసిన కందుకూరి బహుముఖ ప్రజ్ఞాశాలి. తెలుగు జాతికి నవయుగ వైతాళికుడు.



కందుకూరి వీరేశలింగం

ఆచార్యిణి శాంతా సిన్హా, సామాజిక సేవికురాలు, సంఘ సంస్కర్త. బాల కార్మికులపై చేసిన కృషికి రామన్ మెగసెస్ అవార్డు గ్రహీత. నేషనల్ కమిషన్ ఫర్ ప్రొటెక్షన్ ఆఫ్ చైల్డ్ రైట్స్‌కు చైర్ పర్సన్. పద్మశ్రీ అవార్డు గ్రహీత శాంతాసిన్హా. ఎంవీ ఫౌండేషన్ స్థాపకురాలు. శాంతాసిన్హా ఆంధ్రప్రదేశ్‌లోని నెల్లూరు జిల్లాకు చెందినవారు. జనవరి 7వ తేదీ *1950* సంవత్సరంలో పుట్టారు. బాల్యంలో సికింద్రాబాద్ సెయింట్ ఆన్స్ హైస్కూలులోనూ, కీస్ హైస్కూల్లోనూ విద్యాభ్యాసం చేశారు.[1] *1972* సంవత్సరంలో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో రాజనీతి శాస్త్రంలో పీజీ చేసారు. *1976*లో ఢిల్లీలోని జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేట్ అందుకున్నారు.హైదరాబాద్ విశ్వ విద్యాలయంలో ప్రొఫెసర్‌గా చేరారు. *1981* సంవత్సరంలో ఎంవీ ఫౌండేషన్ (మామిడిపూడి వెంకటరంగయ్య ఫౌండేషన్) స్థాపించారు. మొదట్లో సామాజిక మార్పుకోసం, పేదలకు విద్యనందించే దృక్పథంతో ఆరంభించిన ఈ ఫౌండేషన్ *1991* తర్వాత బాలకార్మిక వ్యవస్థ నిర్మూలన కోసం వీధిబాలలకు విద్యాబుద్ధులు చెప్పించింది. ఈ సంస్థలో *80* వేలకు పైగా స్వచ్ఛందసేవకులు ఉన్నారు.



శాంతా సిన్హా

విద్యావేత్తగా, సంఘసంస్కర్తగా, పవిత్రతకు సంకేతంగా, బ్రహ్మర్షిగా ఆంధ్రదేశాన పేరుపొందిన వ్యక్తి, ఆచార్య **రఘుపతి వెంకటరత్నం నాయుడు** (*అక్టోబరు 1, 1862 - మే 26, 1939*). సంఘసంస్కరణోద్యమమన్నా, బ్రహ్మసమాజమన్నా గుర్తుకు వచ్చే పేరు కందుకూరి వీరేశలింగం పంతులు తో పాటు రఘుపతి వెంకటరత్నం నాయుడుదే.

రఘుపతి వెంకటరత్నం నాయుడుకు ఎన్నో బిరుదులు ఉండేవి. వివిధ రంగాల్లో ఆయన కృషికి గుర్తింపుగా ఎన్నో పురస్కారాలు కూడా ఆయనకు లభించాయి. వాటిలో కొన్ని: బ్రహ్మర్షి , శ్వేతాంబర ఋషి , అపర సోక్రటీసు , కులపతి , దివాన్ బహదూర్ , కైజర్-ఇ-హింద్ , సర్



రఘుపతి వెంకటరత్నం.

| | |
|---|---|
| తెలుగులో వాడుక భాషా ఉద్యమ పితామహుడు, **గిడుగు వెంకట రామమూర్తి** (ఆగష్టు 29, 1863 - జనవరి 22, 1940). గ్రాంధికభాషలో ఉన్న తెలుగు వచనాన్ని ప్రజల వాడుకభాషలోకి తీసుకు వచ్చి, నిత్య వ్యవహారంలోని భాషలో ఉన్న అందాన్నీ, వీలునూ తెలియజెప్పిన మహనీయుడు. ఆంధ్రదేశంలో వ్యావహారిక భాషోద్యమానికి మూలపురుషుడు. బహుభాషా శాస్త్రవేత్త, చరిత్రకారుడు, సంఘసంస్కర్త, హేతువాది. శిష్టజన వ్యవహారికభాషను గ్రంథరచనకు స్వీకరింపజేయడానికి చిత్తశుద్ధితో కృషిచేసిన అచ్చతెలుగు చిచ్చర పిడుగు గిడుగు. గిడుగు ఉద్యమంవల్ల ఏ కొద్దిమందికో పరిమితమైన చదువు వ్యావహారికభాషలో సాగి, అందరికీ అందుబాటులోకి వచ్చింది. పండితులకే పరిమితమైన సాహిత్యసృష్టి, సృజనాత్మకశక్తి ఉన్న ప్రతి ఒక్కరికీ వీలైంది. గిడుగు రామ్మూర్తి జయంతి ఆగష్టు 29 ని "తెలుగు భాషా దినోత్సవం" గా జరుపుకుంటున్నాము.<br>మరణం - జనవరి 22, 1940 తండ్రి వీర్రాజు, తల్లి వెంకమ్మ , \| పిల్లలు గిడుగు సీతాపతి<br>శ్రీకాకుళానికి ఉత్తరాన ఇరవైమైళ్ళ దూరంలో ముఖలింగ క్షేత్రం దగ్గర ఉన్న పర్వతాలపేట అనే గ్రామం<br>ఇతర పేర్లు - తెలుగులో వాడుక భాషా ఉద్యమ పితామహుడు,<br>ప్రసిద్ధి ఆంధ్రదేశంలో వ్యావహారిక భాషోద్యమానికి మూలపురుషుడు. | <br>గిడుగువెంకటరామమూర్తి |
| **చిలకమర్తి లక్ష్మీనరసింహం**( సెప్టెంబరు 26, 1867 - జూన్ 17, 1946) ప్రముఖ కవి, రచయిత, నాటక కర్త, పాత్రికేయుడు, సంఘ సంస్కరణవాది, విద్యావేత్త. 19వ శతాబ్దం చివర, 20వ శతాబ్దం ఆరంభ కాలంలో తెలుగు సాహిత్యం అభివృద్ధికి, తెలుగు నాట ఆధునిక భావాల వికాసానికి పట్టుకొమ్మలైన మహామహులలో చిలకమర్తి ఒకడు. ఇరవైరెండేళ్ళ వయస్సప్పుడు ఆయన రచించిన గయోపాఖ్యానం అనే నాటకం ప్రతులు లక్షకి పైబడి అమ్ముడుపోవటమనేది తెలుగు సాహిత్య చరిత్రలో కనీ, వినీ, ఎరగని విషయం. ఈ నాటకంలో టంగుటూరి ప్రకాశం పంతులు అర్జునుడి వేషం వేసేవాడు లక్ష్మీనరసింహం 1867 సెప్టెంబర్ 26 న పశ్చిమ గోదావరి జిల్లా, పెరవలి మండలములోని ఖండవల్లి గ్రామములో ఒక బ్రాహ్మణ కుటుంబములో వెంకయ్య, రత్నమ్మ దంపతులకు జన్మించాడు. | <br>చిలకమర్తిలక్ష్మీనరసింహం |
| కవిరాజుగా ప్రసిద్ధి చెందిన **త్రిపురనేని రామస్వామి** (జనవరి 15, 1887 - జనవరి 16, 1943) న్యాయవాది మరియు ప్రముఖ హేతువాద రచయిత, సంఘసంస్కర్త. ప్రసిద్ధ కవి రాజు గా పిలువబడే అతను హేతువాదం మరియు మానవతావాదం తెలుగు కవిత్వం మరియు సాహిత్యాల్లో లోకి మొదటి సారిగా ప్రవేశపెట్టిన కవిగా భావిస్తారు. త్రిపురనేని రామస్వామి 1887 జనవరి 15 న కృష్ణా జిల్లా, అంగలూరు గ్రామంలో ఒక రైతు కుటుంబంలో జన్మించాడు. రామస్వామి అప్పటికే భారతదేశంలో ప్రచారంలో ఉన్న సామాజిక-మత సంస్కరణ ఉద్యమాలలో పాల్గొనినారు.రామ్ మోహన్ రాయ్ , ఈశ్వర్ చంద్ర విద్యాసాగర్ , రనడే , దయానంద సరస్వతి మొదలగువారి ఆదర్శాలను ప్రజలలోనికి తీసుకురావడానికి ఉద్యమించిన వారిలో రామస్వామి ఒకరు | <br>త్రిపురనేని రామస్వామి |
| 1891 భీంరావ్ రాంజీ అంబేడ్కర్ సంవత్సరం ఏప్రిల్ 14 నాడు అప్పటి సెంట్రల్ ప్రావిన్సెస్ లో సైనిక స్థావరమైన మహెం అను ఊరిలో (ఇప్పటి మధ్యప్రదేశ్ లో ) రాంజీ మలోజీ సక్పాల్ మరియు భీమాబాయ్ దంపతుల 14 వ మరియు చివరి సంతానంగా జన్మించాడు. అతని కుటుంబం ఆధునిక మహారాష్ట్ర లోని రత్నగిరి జిల్లాలో అంబావడే పట్టణం (మండనగడ్ తాలూకాలో) వారు కావున మరాఠీ నేపథ్యం కలవారు. వీరు మహర్ కులానికి చెందినవారు కావున అంటరానివారిగా సామాజిక మరియు ఆర్థికఇబ్బందులకు గురి అయ్యారు. బ్రిటీష్ ఈస్ట్ భారతదేశం కంపెనీ యొక్క సైన్యం లో అంబేద్కర్ పూర్వీకులు పనిచేశారు. వీరి తండ్రి భారత సేవలు మోహో సైనిక స్థావరంలో బ్రిటీష్ సైన్యంలో పనిచేశాడు. భారత రాజ్యాంగ శిల్పిగా, ప్రజాస్వామ్య పరిరక్షకునిగా, సంఘసంస్కర్తగా, మహామేధావిగా విఖ్యాతుడైన డాక్టర్ భీమ్‌రావ్ అంబేద్కర్ స్మృతికి నివాళులర్పిస్తూ, ఆ మహనీయునికి 'భారతరత్న ' అవార్డును భారత ప్రభుత్వం యివ్వడం అత్యంత అభినందనీయం. | <br>యువకునిగా<br>అంబేద్కర్ |

| FORMATIVE ASSESSMENT - పాఠ్యాంశ వారిగా లఘు పరీక్ష | | | మార్కులు |
|---|---|---|---|
| విద్యార్థి పేరు | నెం: | 10వ తరగతి సెక్షన్ : | |
| పాఠశాల పేరు - | అమరావతి | - విశాఖజిల్లా. | 20 |

**1. అవగాహన ప్రతిస్పందన – 5M**

Q. నగర నిర్మాణములో ఏఏ మౌలిక వసతులు ఏర్పాటు చేయాలో రాయండి ?

**2. సృజనాత్మ కత వ్యక్తీకరణ – 5M**

Q. రాజధాని నగరం అంటే ఏమిటి ?

రాజధాని నగరానికి మామ్ములు ఇతర నగరాలకు గల తేడా ఊహించి రాయండి ?

**3. వ్యాకరణాంశములు – 5M**

1. పునీతం సొంత వాక్యం రాయండి ?
2. వాడు తాటి చెట్టుంత పొడవున్నాడు ఏ అలంకారమో రాయండి ?
3. పురము వ్యుత్పత్తిని రాయండి ?
4. వాఙ్మయం ఏ సంధి రాయండి ?
5. కీర్తి పర్యాయ పదాలు రాయుము ?

**4. ఉపవాచక ప్రశ్న రాయండి. 5M**

Q. రామాయణము ఆధారంగా అన్నదమ్ముల అనుబంధాన్ని విశ్లేషించండి ?

## ప్రాజెక్టు పని 2 :

## Q. అమరావతి శిల్పాల చిత్రాలను సేకరించి ప్రదర్శించండి ?

### అమరావతి: ఆంధ్రుల రాజధాని






అమరావతి గుంటూరు జిల్లాలో కృష్ణా నదీ తీరానికి కుడి వైపున ఉన్నది. ఈ పట్టణము వేల సంవత్సరాల ప్రాచీనమైన చరిత్ర కలిగి ఉన్నది. ప్రాచీన శాసనాల ప్రకారము ఈ పట్టణానికి ధాన్యకటకము అనే పేరు ఉన్నట్లు తెలుస్తుంది. ఆంధ్ర ప్రదేశ్ లోని పంచారామాలలో ఒకటైన అమరేశ్వరాలయము పేరు మీదుగా అమరావతి పేరు వచ్చింది. ఈ పట్టణము జైన, బౌద్ధ మతాలకు కూడా ప్రసిద్ధమైనది. శాతవాహనులలో ప్రసిద్ధుడైన గౌతమీపుత్ర శాతకర్ణి మూలముగా క్రీ.శ. ఒకటవ శతాబ్దములో ధాన్యకటకము ప్రసిద్ధిచెందినది. చైనా యాత్రికుడు హ్యూయాన్‌త్సాంగ్ ఈ పట్టణము లో నివసించి అచటి వైభవము గురించి ప్రశంసించాడు.

అమరావతి / ధరణికోట పరిసరములలో బృహత్ శిలాయుగపు సాంస్కృతిక అవశేషాలు లభించాయి. క్రీ. పూ 4-3 శతాబ్దాలనాటి నివాస ప్రదేశాలు, కట్టడాలు, స్థంభాలు వెలుగు చూశాయి. మౌర్యులకు పూర్వమే ఇచట నాగ, యక్ష తెగల జనపదం (గణతంత్ర రాజ్యం) ఉండేదని తెలుస్తోంది. బౌద్ధ భిక్షువు, చరిత్రకారుడు తారనాథుని ప్రకారము గౌతమ బుద్ధుడు ధరణికోటలో కాలచక్ర మండలాన్ని ఆవిష్కరించాడు. బహుశా ఈ కారణము వల్ల బుద్ధుని మరణానంతరము అమరావతిలో గొప్పస్తూప నిర్మాణము జరిగివుండవచ్చును. మౌర్యులు, సదవంశీయులు, శాతవాహనులు, ఇక్ష్వాకులు, పల్లవులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు, ఆనంద గోత్రీయులు, చాళుక్యులు, చోళులు, కోట వంశీయులు, కాకతీయులు, విజయనగర రాజులు, కుతుబ్ షాహి నవాబులు వరుసగా అమరావతి/ధరణికోట ను పాలించారు. క్రీ.శ. 4వ శతాబ్ది నుండి 15వ శతాబ్దము వరకు ధరణికోట ఆంధ్రదేశ రాజకీయ చరిత్రలో కీలకస్థానం వహించింది.
అమరావతిలో కల అమరేశ్వర ఆలయం కారణం గా ఈ ప్రదేశం ప్రపంచ వ్యాప్తంగా పేరు పొందింది. అంతేకాక, ఇక్కడ నిర్మించబడిన అతి పెద్ద బౌద్ధారామాల కారణంగా కూడా ప్రసిద్ధి కెక్కింది. ఈ బౌద్ధ స్తూపాలని మౌర్య సామ్రాజ్య స్థాపనకు ముందే నిర్మించారని విశ్వసిస్తారు. దీనిని అప్పట్లో ధాన్య కటకం లేదా ధరణికోట అని పిలిచేవారు. ఆంధ్ర పాలకులలో మొదటి వారైన శాతవాహనులకు సుమారు క్రి. పూ. 2 వ శతాబ్దం నుండి 3వ శతాబ్దం వరకు వారి సామ్రాజ్యానికి రాజధానిగా వుండేది. గౌతమ బుద్ధుడు తన కాలచక్ర ప్రక్రియను అమరావతి లోనే బోధించాడు. అందువలన అమరావతి బుద్ధునికంటే ముందు నుండే ఉన్నదని నిర్ధారణ ఔతున్నది. దీనికి చారిత్రక ఆధారాలు వజ్రాయన గ్రంథంలో పొందుపరచబడి వున్నాయి. నేడు ఈ పట్టణం, అమరావతి స్తూపం , పురావస్తు మ్యూజియం వంటి ఆకర్షణల కారణంగా ఒక చక్కని పర్యాటక ప్రదేశంగా ప్రసిద్ధికెక్కింది.

**అమరేశ్వరాలయము**

అమరావతి గొప్ప శైవ క్షేత్రము. కృష్ణా నది ఒడ్డున నిర్మితమైన అమరేశ్వరాలయము, ఈ ఆలయంలో కొలువు దీరిన దేవుడు అమరలింగేశ్వర స్వామి. ఈ శివాలయము ఆంధ్రప్రదేశ్ లోని పంచారామాలలో ఇది ఒకటి. గర్భాలయంలో 15 అడుగుల ఎత్తులో పొడవుగా ఉన్న మహా శివలింగం దంతం రంగులో ఉంటుంది. ఈ శివలింగం అంతకంతకూ పెరుగుతూ ఉండటంతో తలపై మేకు కొట్టినట్టు చెబుతారు. అందుకు సంబంధించిన ఆనవాళ్లు కూడా కనిపిస్తూ వుండటం విశేషం. ప్రతి యేటా విజయదశమి రోజున . మహా శివరాత్రి పర్వదినం రోజున ఇక్కడ స్వామివారికి . అమ్మవారికి అంగరంగ వైభవంగా కల్యాణోత్సవం జరిపించబడుతూ ఉంటుంది. చాముండికా సమేతుడైన అమరేశ్వరుడు ఇక్కడ విశేష పూజలను అందుకుంటూ ఉంటాడు. ఇక్కడి స్వామివారు త్రిగుణాలకు అతీతుడు అనే భావాన్ని ఆవిష్కరించేలా మూడు ప్రాకారాలతో ఆలయం కనువిందు చేస్తుంటుంది. మొదటి ప్రాకారంలో ప్రణవేశ్వరుడు . జ్వాలాముఖీ దేవి కనిపిస్తారు. మధ్య ప్రాకారంలో వినాయకుడు, కాలభైరవుడు ,కుమార స్వామి , ఆంజనేయ స్వామి ఉంటారు. ధ్వజ స్తంభం దగ్గరగా సూర్య భగవానుడు ప్రతిష్టితమై ఉన్నాడు.

శ్రీకృష్ణదేవరాయలు అమరావతిని సందర్శించి ఇక్కడి అమరేశ్వరునికి నైవేద్య మహాపూజలు నిర్వహించినట్టు, పెదమద్దూరు గ్రామ పంటభూముల్ని ఆలయానికి దానమిచ్చినట్టుగా ఇక్కడ ఉన్న రాజశాసనం తేటతెల్లం చేస్తోంది. కొండవీటి రెడ్డిరాజులపై విజయానంతరం 1517లో చారిత్రక ప్రాంతం కృష్ణాతీరమైన అమరావతిని దర్శించిన కృష్ణదేవరాయలు ఇక్కడ తులాభారం తూగారు. తన బరువుతో సరిసమానమైన బంగారాన్ని పేదలకు పంచిపెట్టినట్టుగా శాసనంలో ఉంది. అందుకు గుర్తుగా రాయలు నిర్మించిన తులాభార మండపం, దానిముందు వేయించిన శాసనం నేటికీ ఇక్కడ చెక్కుచెదరకుండా ఉన్నాయి. ఆలయంలోని దక్షిణ రెండో ప్రాకారంలో ఈ మండపం ఉంది. నేడు అమరావతి అమరేశ్వరునిగా కొలువందు కుంటున్న స్వామి నాడు ధరణికోట అమరేశ్వరస్వామిగా వెలుగొందాడని ఈ శాసనం ద్వారా తెలుస్తోంది.






## బౌద్ధ సంస్కృతి

అమరావతికి సమీపంలో ఉత్తరాన ఉన్న ధరణికోట ఒకప్పటి ఆంధ్ర శాతవాహనుల రాజధాని యైన ధాన్యకటకం. శాతవాహనుల కాలంలో బౌద్ధ మతం పరిఢవిల్లింది. బౌద్ధమత చరిత్రలో ధాన్యకటకానిది ప్రముఖ స్థానం. ప్రాచీన బౌద్ధ వాఙ్మయములో విశిష్ట స్థానము పొందిన 'ఆంధ్రపురి'యే ధాన్యకటకం. క్రీ.పూ. 4వ శతాబ్దిలో గ్రీకు రాయబారి మెగస్తనీసు పేర్కొన్న 30 ఆంధ్ర దుర్గాలలో ఈ నగరమొకటి. సుమారు 16 కి.మీ చుట్టుకొలత కలిగిన మహానగరం. నేటి అమరావతి, ధరణికోట అందులోని భాగాలే. మౌర్యులకు పూర్వము క్రీ. పూ. 4 - 3 శతాబ్దాలలో ఈ ప్రాంతం గణతంత్ర రాజ్యం (జనపదం)గా ఉన్నట్టు అధారాలున్నాయి. బుద్ధుని జీవితకాలము నుండి క్రీ. శ 14వ శతాబ్దివరకు ఇక్కడ బౌద్ధం నీరాజనాలందుకొంది. మరుగున పడిన చైత్య ప్రాశస్త్యం తిరిగి

18వ శతాబ్దములో వెలుగు చూసింది. దీపాలదిన్నె గా పిలువబడిన పెద్ద దిబ్బను త్రవ్వి 1797 లో మహాస్తూపాన్ని వెలుగులోకి తెచ్చిన వ్యక్తి కల్నల్ కోలిన్ మెకంజీ. అప్పటికే మహాచైత్యం అంతా కూలిపోయి 90 అడుగుల చుట్టుకొలత, 20 అడుగుల ఎత్తుగల ఒక దిబ్బలాగా మిగిలింది. అనేక విడతలుగా జరిగిన తవ్వకాలలో ఎన్నో విలువైన విగ్రహాలు, పరికరాలు మరియు ఇతర వస్తువులు దొరికాయి. ఈ త్రవ్వకాలను సర్ వాల్టర్ స్మిత్ 1845 లో, రాబర్ట్ సీవెల్ 1877 లో, జేమ్స్ బర్గెస్ 1881 లో మరియు అలక్జాండర్ రియ 1888-89 మధ్యలో చేపట్టారు. ఆఖరున జరిగిన తవ్వకాలలో ఈ చైత్య నిర్మాణానికి కొన్ని వేల సంవత్సరాలకు పూర్వం నివసించిన మెగాలిథ్స్ కి సంబంధించిన అవశేషాలు కూడా దొరికాయి. ఇక్కడ దొరికిన శిల్పాలలో ఎక్కువ మద్రాస్ గవర్నమెంట్ మ్యూజియం, చెన్నై మరియు బ్రిటిష్ మ్యూజియం, లండన్ లలో భద్రపరిచారు. ధాన్యకటకంలో 1962-65 మధ్యలో యమ్. వెంకటరామయ్య మరియు క.రాఘవాచారి ల అధ్వర్యంలో త్రవ్వకాలు జరిగాయి. ఇందులో ఐదు కాలాలకు కి సంబంధించిన అధారాలు దొరికాయి. కార్బన్ డేటింగ్ ద్వారా ఈ పట్టణం క్రీ.పూ.5వ శతాబ్దికి చెందిందని తెలిసింది.

అద్భుతమైన శిల్పకళతో అలరారే స్థూపంపై బుద్ధుని జీవిత చరిత్రకు సంబంధించిన చిత్రాలు, బౌద్ధచిహ్నాలు చెక్కబడి ఉన్నాయి. స్థూపంపై బ్రాహ్మీ లిపిలో శాసనాలు చెక్కబడి ఉన్నాయి. ఈ స్థూపం గురించి అప్పటి బ్రిటిషు పురాతత్వ పరిశోధకుడు ఫెర్గుసన్ ఇలా అన్నాడు: "కళావైదుష్యానికి సంబంధించి ఇది భారతదేశంలోనే అత్యంత విశిష్టమైన కట్టడము". దీన్ని చెన్నై లోని ప్రభుత్వ ప్రదర్శనశాలలో భద్రపరచారు.

## రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు

రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు అమరావతి సంస్థాన పాలకుడు. 1761 ఏప్రిల్ 20న జగ్గన్న, అచ్చమ్మ దంపతులకు జన్మించాడు. ఆయన పాలనా కాలంలో చెంచులు గ్రామాలపైబడి దోచుకుంటూ ఉండేవారు. ఈ దోపిడీలను అరికట్టడానికి ఆయన 150 మంది చెంచు నాయకులను ఆహ్వానించి, వారిని మట్టుపెట్టించాడు. ఈ సంఘటనను "అటునుంచి కొట్టుకురండి" అన్న కథలో (అమరావతి కథలు)చక్కగా వివరించబడినది. ఈ సంఘటన జరిగిన గ్రామం పేరు నరుకుళ్ళపాడు గా మారింది. దానితో ప్రజలకు దోపిడీల బెడద తగ్గినా, ఆయన అశాంతికిలోనై, పాప పరిహారార్థం దేవాలయాల నిర్మాణం చెయ్యమన్న కొందరు పెద్దల సూచన మేరకు అనేక దేవాలయాలను కట్టించాడు. అమరావతి లోని అమరలింగేశ్వరస్వామి గుడిని పునరుద్ధరించాడు. 1807-09లో మంగళగిరి నరసింహ స్వామి దేవాలయానికి 11 అంతస్థుల గాలి గోపురాన్ని నిర్మింపజేసాడు. ఆయన తండ్రి జగ్గన్న పేరు మీదనే బేతవోలు అనే గ్రామం పేరును జగ్గయ్యపేట గా మార్చాడు. వేంకటాద్రి నాయుడు 1817, ఆగష్టు 17న మరణించాడు.

**ఇది మన సంపద. మన దేశ సంపద. మన వారసత్వ సంపద. కోటలు, స్తూపాలు , పురాతన కట్టడాలు. ఇవన్నీ ఇది మన ఉమ్మడి ఆస్తి, వీటిని పరిరక్షిస్తూ, పరిశోధనల ద్వారా వాటి చరిత్రను వెలుగులోకి తీసుకొచ్చి అతి భద్రంగా కాపాడుకుంటూ నేటి తరాని నికి తెలియ చెప్పాలి**

ఎంతో గొప్ప వారసత్వ సంపద మనకు ఉంది. అగ్రరాజ్యా లుగా వెలుగొందే అమెరికా వంటి వాటికి కేవలం 45 సంవత్సరాల చరిత్రే ఉంది నూరేళ్లు దాటిన కట్టడాలు, పురా తన స్థలాలు, చారిత్రక శిల్పాలు, శాసనాలు వారసత్వ సంపద జాబితాలో చోటు దక్కించుకునేలా యునెస్కో ప్రయత్నాలు చేస్తోంది. భారత దేశంలోని దేవాలయాలు వారత్వ సంపదలో చోటు దక్కించుకున్నాయి. మన దేశంలో కేవలం దేవాల యాలే కాక ఇంకా ఎన్నో కట్టడాలు వారసత్వ కట్టడం హోదా ను దక్కించుకున్నాయి. నిడమర్రులో వైకుంఠ నారాయణుడు మంగళగిరి మండలం నిడమర్రులో క్రీస్తుశకం 14వ శతాబ్దం నాటి వైకుంఠనారాయణుడి విగ్రహం, 12వ శతాబ్దం నాటి బుదుని విగ్రహం మౌన ముద్రలో ఒక ఇంటి ముందు ఉన్నాయి. వీటిని పట్టించుకునే నాథుడే లేడు. వైకుంఠపురంలో ఒక రోడుపై ఆరుగుపై క్రీ.శ9వ శతాబ్దం నాటి భూస్పర్శ బుదుడి విగ్రహం ఉంది. దీన్ని ఎవరూ పట్టించుకోవడం లేదు. ఇది మట్టి కొట్టుకుపోయింది. అ కొలనుకొండలో కనుమరుగైన సమాధులు విజయవాడ - గుంటూరుకు మార్గంలో జాతీయ రహదారి పక్కనే ఉన్న కొలనుకొండలో శిలా యుగానికి చెందిన మాన వుల సమాధులు కనుమరుగయ్యాయి. అక్కడే ఉన్న చారిత్రక నిలయాలు ఎండకు ఎండి, వానకు తడుస్తున్నాయి. జైన మతానికి చెందిన కుందనుకుందాచార్యుని ఆరామంగా ఉన్న స్థానం అక్కడ ఉందన్న సంగతి పురావస్తు శాఖ వారికి తెలి యదంటే అతిశయోక్తి కాదు. మైలవరం పంగిడికొండపై బౌద్ధారామం కృష్ణా జిల్లా మైలవరం సమీపంలో పంగిడికొండపై బౌద్ధారామం ఉన్నట్లు తెనాలికి చెందిన వెంకటేశ్వరరావు అనే చరిత్రకారుడు వెలుగులోకి తీసుకొచ్చారు. ఇది క్రీ.శ. 1, 2 శతాబ్దాల నాటి బౌద్ధారామం, శిలా స్తంభాలు, శిల్ప శకలాలు, పెద్ద పెద ఇటుకరాళ్లు ఇక్కడ లభ్యయయ్యాయి. ఘంటసాలలో బౌద్ధ మహాచైత్యం ఘంటసాలలో శాతవాహనులు, ఇక్ష్వాకుల కాలం నాటి బౌద్ధ చైత్యానికి మరమ్మతులు చేపట్టారు. ఇక్కడ ఉన్న పెద్ద దిబ్బ (బౌద్ధ సూపం)ను 1904లో అలెగ్జాండర్రే అనే చరిత్రకారుడు తవ్వకాలు చేపట్టి బుదుని వైశిష్యాన్ని వెలుగులోకి తీసుకొ చ్చారు. దీనికి సమీపంలో ఉన్న ఘోటకం దిబ్బ వద్ద తవ్వకా లలో బుదుడి పాలరాతి విగ్రహం, స్తంభాలు, శాసనాల రా తి ముక్కలు ఇలా ఎన్నో లభించాయి. ప్రస్తుతం వీటిలో కొన్ని ప్యారిస్, లండన్, పాండిచ్చేరి మ్యూజియంలలో ఉన్నాయి. వాటిలో కొన్ని మాత్రమే సందర్శకులను ఆకట్టుకుంటున్నాయి. విక్టోరియా మ్యూజియం విజయవాడలో ఉన్న విక్టోరియా మ్యూజియానికి వందేళ్ల

1881లో దీన్ని ప్రారంభిం చారు. మన రాష్ట్రంతో పాటు ఇతర రాషాలలో బయట పడిన అనేక వస్తువులు ఇక్కడ ప్రదర్శనలో ఉంచారు. వీటితో పాటు రాతి, శిలా యుగం నాటి మట్టి పాత్రలు, దంతపు ముక్కలు, శాసన లిపి పలకలు, రాత ప్రతులు, కత్తులు, శూలాలు, శవపేటిక, తాళపత్ర గ్రంధాలు, పురాతన నాణాలు ఎన్నో ఉన్నాయి. ప్రచారం లేక ఈ మ్యూజియం వెలవెలబోతోంది. ఆధనంబోడుగోడు పట్టేదెవరికి జగ్గయ్యపేటలోని ధనంబోడు బ్రిటీష్ కాలంలో జరిగిన తవ్వ కాల్లో బయట పడింది. క్రీస్తు పూర్వం ఒకటో శతాబ్దం నుంచి క్రీస్తు శకం 1వ శతాబ్దం వరకు బౌద్ధమతం ఈ ప్రాంతంలో పరిఢవిల్లిందనడానికి నిలువెత్తు సాక్ష్యంగా ఇక్కడ సూపం ఉంది. బ్రిటీష్ కాలంలో శిల్పాలు, నాణేలు, శాసనాలు లభించి నా అవి చెన్నై మ్యూజియంలో ఉన్నాయి. దీనికి సరైన ప్రచారం లేక సందర్శకులు రాక వెల వెలబోతోంది. పైన చెప్పకున్నవే కాకుండా రెండు జిల్లాలో వెలుగులోకి రానివి ఉన్నాయి. ఉండవల్లి గుహలకు పక్కనే ఉన్న పెనుమాక వెళ్లే దారిలో దాదాపు 100 ఎకరాల విస్తర్ణంలోని స్థలంలో బౌద్ధా రామ శిథిలాలు ఉన్నట్లు చరిత్రకారులు చెబుతున్నారు.

### *రాతియుగంనాటి మానవుల చరిత్ర*

రాతియుగంలో మానవుడు నివసించిన గృహాలు మన చెంత నే ఉన్నాయన్న విషయం ఎవరికీ తెలియదు. ఇవి గ న్నవరానికి వెళ్లే దారిలో జాతీయ రహదారికి అనుకుని ఉ న్న కేసరిపల్లిలో బయటపడ్డాయి. 1960లో తవ్విన తవ్వ కాల్లో ఇవి బయట పడ్డాయి. తరువాత ఎవరు పట్టించుకోక పోవడంతో అక్రమ తవ్వకాల వల్ల మాయమయ్యాయి.

* సీతానగరంకొండ మీద ఇటీవల విష్ణుమూర్తి, గోవర్ధన పర తం ఎత్తిన కృష్ణుడి విగ్రహాలు లభ్యమయ్యాయి. ఇక్కడకొండ మీదకు ఘాట్ రోడును జీయర్ ఆశ్రమం వారు నిర్మిస్తున్నారు. * మంగళగిరికి వెళ్లే దారిలో ఉన్న ఎర్రపాలెంలోని తవ్వకాల్లో స్థానికులకు విగ్రహాలు దొరుకుతున్నాయి. సమాచారం అందినా పురావస్తు శాఖ అధికారులు అక్కడికి వెళ్లడానికి మీన మేషాలు లెక్కిస్తున్నారు • పిడుగురాళ్ల తదితర ప్రాంతాలలో బౌద్ధమతానికి సంబం ధించిన ఆనవాళ్లు లభిస్తున్నాయి * ఇంద్రకీలాద్రి కొండ చుటూ దాదాపు 100కు పైగా శాసనా లు ఉన్నాయి.

| అమరేశ్వరాలయ శిఖరం | అమరేశ్వరాలయ స్నానఘట్టము | అమరేశ్వరస్వామి వారి నావలరేవు | కృష్ణా నది | మ్యూజియంలో స్తూపంనమూనా | బుద్ధుని పై మరుని దాడి విగ్రహము క్రీ.శ.2వ శతాబ్దం |
| --- | --- | --- | --- | --- | --- |
| అమరావతిలో పురాతత్వశాఖ ఫలకము | గ్రీకు శాసనముతో భారతీయ యక్షుడు, అమరావతి, క్రీ.శ.3వ శతాబ్దం | అమరేశ్వరస్వామివారి ప్రధాన దేవాలయం. | అమరావతి మ్యూజియంలో ఒక చక్రవర్తి శిల్పం 1వ శతాబ్దం | అమరావతి ధ్యానకేంద్రము | అమరావతిలో మ్యూజియము |
| అమరావతి స్తూపం నమూనా ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర మ్యూజియంలో ఉన్న చిత్రం | అమరావతి స్తూపం | రాజవాసిరెడ్డివెంకటాద్రినాయుడు. మంగళగిరి ఆలయంలో ప్రధానద్వారంలో వున్న చిత్రపటము. | A.P. Tourism Museum at Amaravati | | వివిధ దశలకు చెందిన కొన్ని అమరావతి స్తూపాలు |
| సంబోధి | బౌద్ధమతం యొక్క త్రిరత్నాల చిహ్నంబ్రిటిష్ మ్యూజియం నుండి. | పద్మం | అమరావతి చైత్యంలో కనుగొన్న ధాతుకరండాల పేటికల చిత్రాలు | స్తూపం నిర్మాణాన్ని తెలిపే మరొక చిత్రం | అమరావతి స్తూపం నమూనా ఫలకం బ్రిటిష్ మ్యూజియం నుండి. |
| | | | | | |
| | *Statue of Acharya Nagarjuna* | Mahachaitya of Buddha at Amaravati | Statue of Gautamiputra Satakarni at Amaravati | | |

## అ కొండపల్లి ఖిల్లా సర్వేకొండ కింద మట్టిగోడ, కందకం

జిల్లాలో ఉన్న ఏకైక కోట కొండపల్లి ఖిల్లా, సముద్ర మట్టానికి 1200 అడుగుల ఎత్తులో ఉంది. 1850లో ఆనవే మారెడ్డి అనే రాజు కొండకాపరి సూచనలపై నిర్మించినట్లు చరిత్ర చెబుతోంది. 18 బురుజులు, కొండపైకి వచ్చే శత్రు సైనికులను అడుకోడానికి మానవ అవసరం లేకుండా రా ళ్లు విసిరే ఒక యంత్రం, రాజుగారి విహార మందిరం, రాణి మహల్, నర్తనశాల, రథాలు నడవడానికి మార్గం, గుర్రా లు, సైన్యం నడవడానికి కాలిబాట అబ్బో ఇంకా చాలా చెప్పుకోవచ్చు. శిథిలావస్థలో ఉన్న దీనిని బాగు చేయడానికి పురావస్తు శాఖ దాదాపు 15 సంవత్సరాల నుంచి కష్టప డుతోంది. కాని కొండ దిగువున ఉన్న మట్టిగోడ, దానికి అనుకుని ఉన్న కందకాన్నిపట్టించుకోకపోవడం వల్ల ఇవి అన్యాక్రాంతం అవుతున్నాయి. అవనిగడ్డ దగ్గర లక్ష్మీపురంలో ఏడో శతాబ్దం నాటి తెలుగు శాసనాల్లో మొట్టమొదటిగాలిపి, భాషాపరంగా గొప్పగా చెప్ప కునే శాసనం లభించింది. ఒకప్పుడు శాసన పరిశోధకులకు తెలిసిన ఇది కనిపించడం లేదు. • దివిసీమలో మాజేడులో లభించిన బుదుని దంత ధాతువును ఇక్కడి నుంచి శ్రీలంకకు తరలించే క్రమంలో కొంత కాలం చారి త్రక స్థలంగా వర్ధిల్లిందని బౌద్ధ సాహిత్యం ద్వారా తెలిసింది.. మన చరిత్రకు సాక్ష్యాలుగా నిలిచిన పరావస్తు అవసరం అందరిపైనా ఉంది.

## రవాణా, వసతి

విజయవాడ నుండి 45 కిలోమీటర్ల దూరంలో ఉన్న అమరావతి చేరుకోవడానికి విజయవాడ నుండి నేరుగా బస్సులున్నాయి. గుంటూరు నుండి 32 కిలోమీటర్ల దూరం ఉన్న అమరావతి చేరుకోవడానికి గుంటూరు నుండి నేరుగా బస్సులు ఉన్నాయి. ఆంధ్ర ప్రదేశ్ పర్యాటకశాఖ విజయవాడ నుండి అమరావతికి మోటర్ బోటు ప్రయాణ వసతి కల్పించింది. రాష్ట్ర ప్రభుత్వ బస్సు లు రాష్ట్రం లోని వివిధ ప్రాంతాల నుండి అమరావతి కి నడుస్తాయి. విజయవాడ లేదా గుంటూరు చేరుకుని అక్కడి నుండి అమరావతి వెళ్ళవచ్చు.  దీనికి సమీప ఎయిర్ పోర్ట్ విజయవాడ లో కలదు. ఎన్నో ఆకర్షణలు కల ఈ ప్రదేశం, చారిత్రకులనే గాక పర్యాటకులని కూడా ఆకర్షిస్తోంది. ప్రస్తుతం అమరావతిలో దలైలామా అమరావతి వచ్చిన సమయంలో ఆరంభించిన బౌద్ధనిర్మాణం పని జరుగుతూ ఉంది. ఇక్కడ బసచేయటానికి హోటల్స్, లాడ్జి లు లభ్యమవుతాయి, లేదా విజయవాడ, గుంటూరులో బస చేసి  కారు లేదా బస్సు ద్వారా ఇక్కడికి కేవలం 30 నిముషాలలోనే చేరుకోవచ్చు.








| FORMATIVE ASSESSMENT - పాఠ్యాంశ వారిగా లఘు పరీక్ష | | | మార్కులు |
|---|---|---|---|
| విద్యార్థి పేరు | నెం: | 10వ తరగతి సెక్షన్ : | |
| పాఠశాల పేరు | జానపదుని జాబు | - విశాఖజిల్లా. | 20 |

1. **అవగాహన ప్రతిస్పందన – 5M**

   Q. పల్లె గొప్పదా ? పట్టణం గొప్పదా ? మీరైతే దేనిని సమర్థిస్తారు ? ఎందుకు ?

2. **సృజనాత్మకత వ్యక్తీకరణ – 5M**

   Q. "కష్టం ఒకళ్ళది ఫలితం మరొకళ్ళది" అని అనడంలో రచయిత ఉద్దేశ్యం ఏమిటి ?

3. **వ్యాకరణాంశములు – 5M**

   1. చమత్కారం సొంత వాక్యం రాయండి ?
   2. "పురిటిలోనే సంధి కొట్టడం" ఈ జాతీయాన్ని వివరించి రాయండి ?
   3. రామకృష్ణు గురువు. వివేకానందుడు శిష్యుడు. సంయుక్త వాక్యాలుగా రాయండి ?
   4. అక్కడక్కడ ఏ సంధో రాయండి ?
   5. రాము పాఠం చదివాడు, రాము పాఠం అర్థం చేసుకున్నాడు సంశ్లిష్ట వాక్యంగా మార్చండి.

4. **ఉపవాచక ప్రశ్న రాయండి. 5M**

   Q. రామాయణములో కైక పాత్రను విశ్లేషించండి ?

## *ప్రాజెక్టు పని 3 :*

## జానపదుని జాబు(భాషా కార్యకలాపాలు/ ప్రాజెక్టు పని) 'అందమైన గ్రామసీమలు' పుస్తకం (సంకలనం)

**Q. అందమైన గ్రామ సిమలు అనే పుస్తకం సంకలనం చేయండి. ముఖ చిత్రం గీయండి?**

**పల్లెటూర్లను ఊహించి రాయండి. విషయ సూచిక ముందుమాటలను రాసి పదర్శించండి ?**



*విశాలమైన ఇళ్లు, ఇళ్లముందు పచ్చని చెట్లు, పుష్పాల గుబాళింపు, పక్షుల కిలకిలరావాలు, పచ్చని పొలాలు, చెరువులో చేపల సందడి గ్రామాల్లో మనకు దర్శనమిస్తాయి. పొలాలపై నుంచి వచ్చే పైరుగాలికి తన్మయం చెందనివారు ఎవరు? ఒక్కో గ్రామదేవత ఆలయానికి ఒక్కో ప్రత్యేక గాథ. కల్మషం లేని ఆత్మీయ పలకరింపులు మనల్ని కట్టి పడేస్తాయి. లేగదూడల విన్యాసాలు, కులవృత్తుల పనితీరు పల్లెసీమకు కొత్త అందాలను అద్దుతాయి. అక్కడ అసూయలు ఉండవు.*

**విషయసూచిక:**

*1) గ్రామం నిర్వచనం*

*2) ఇళ్ల అందాలు*

*3) పచ్చని చెట్లు*

*4) అందమైన చెరువులు*

*5) పచ్చని పొలాలు - అభివృద్ధి*

*6) పెంపుడు జంతువులు*

*7) దేవాలయాలు - జానపద కళారూపాలు*

*8) ఆత్మీయతలు - అనుబంధాలు*

**ముందుమాట**

*గ్రామాలు అప్యాయాలు, ఆత్మీయతలకు నిలయాలు. ఎక్కడ చూసినా పచ్చదనమే. చూసి పరవశించాల్సిందే తప్ప వర్ణింపలేం. అందుకే గ్రామంలోని పచ్చనిచెట్లు, వివిధ రకాలుగా ఉండే ఇళ్ల నిర్మాణం అన్నింటినీ ఒకసారి చుట్టి రావాలి. పల్లె ప్రజల జీవనం, పైరుగాలి తీరు, విజ్ఞానాన్ని పెంచే బడి, జానపద కళారూపాలను ఈ అందమైన గ్రామసీమలు అనే పుస్తక సంకలనం మనకళ్ల ముందు ఉంచుతుంది. పాఠకులకు తమ ఊరితో ఉన్న అనుభవాలను గుర్తు చేస్తుంది. 'ఊరు పిలుస్తోంది' అనే భావన కలుగుతుంది. ఆనందంగా జీవించడాన్ని నేర్పే ఈ సంకలనం అందరికీ ఉపయోగకరం. పల్లెను విడిచి పట్టణాల బాట పట్టిన ప్రతి ఒక్కరూ చదవాల్సిన పుస్తకం.*

పల్లె అందాలు కనుమరుగు..!

-కలుషితమవుతున్న ఆహ్లాద వాతావరణం

-తగ్గుతున్న పశు, వృక్ష సంపద

-సేంద్రియ ఎవుసంతోనే రైతులకు ఆరోగ్యం

-ఆధునిక పోకడలతో తప్పని ఆరోగ్య సమస్యలు

చూడ చక్కని తల్లి.. చుక్కల్లో జాబిల్లి.. నవ్వుల్లో నాగమల్లి.. నా పల్లె పాలవెల్లి.. అన్నాడో కవి.. పల్లెలు పచ్చదనానికి ప్రతీకలు... ఊరికో చెరువు.. పొంగిపొర్లే వాగులు వంకలు.. పచ్చని పంట పొలాలు.. పక్షుల కిలకిలలు.. ఊర్లకు ఆదెరువుగా ఉండే పశు, వృక్ష సంపద.. అప్యాయంగా పలుకరించే అమాయకపు పల్లె జనాలు.. పొద్దున లేచింది మొదలు ఎవరి వృత్తుల్లో వారు నిమగ్నమయ్యేవారు... ఒకప్పటి పల్లె ముఖ చిత్రమిది. కాలం మారింది... ఆధునిక పోకడలతో గ్రామసీమల్లో నాటి దృశ్యాలు కనుమరుగవుతున్నాయి. ఆయురారోగ్యాలను

పంచిన ఆహ్లాద వాతావరణం కలుషితమవుతోంది. పెరిగిన సాంకేతిక పరిజ్ఞానంతో పండుగలు, బంధుత్వాలు దూరమవుతున్నాయి. పల్లె దనానికి నెలవైన పశు, వృక్ష సంపద తగ్గుతుండడం.. సేంద్రియ ఎవుసం నుంచి రసాయన ఎవుసానికి రైతులు అలవాటు పడడంతో ఆరోగ్య సమస్యలు దరి చేరుతున్నాయి.. నాటి పల్లె స్మృతులపై నమస్తే తెలంగాణ ఈ వారం సండే స్పెషల్.. - అందోల్, నమస్తే తెలంగాణ ప్రకృతి పచ్చని పట్టు చీర కట్టినట్లు... పచ్చని నగలహారం మెడలో వేసినట్లు... ఎటుచూసిన పంట పొలాలతో గ్రామసీమలు కళకళాలాడేవి. అత్మీయతకు, ఆప్యాయతకు మాయమర్మమెరుగని మానస్తత్వానికి, పెద్దలపై గౌరవం, కల్లా కపటం లేని మనుషుల భవ బంధాలకు చిరునామాగా ఉండేవి.
ఏ ఇంటిముందు చూసిన కల్లాపీ (సానిపి) చల్లిన విశాలమైన వాకిల్లు, స్వాగతం పలికే వీధి అరుగులు, అందమైన ఎర్రమట్టి అలుకుడు చూడచక్కని ముగ్గులు దర్శనమిచ్చేవి. పాడి, పశుసంపదతో కళకళలాడేవి. కోడి కూత కూయగానే నిద్రలేచే అన్నదాత సూర్యస్తమయం అయ్యే వరకు నేలతల్లిని నమ్ముకుని చెమట చుక్కలను చిందిస్తూ చిరునవ్వుతో పంటలను పండించే వారి బతుకు చిత్రం ఈ నాటి తరానికి విడ్డూరమే కానీ అది అక్షర సత్యం. కానీ నేడు ఆ పల్లె వాతావరణం కనుమరుగవుతోంది. ఆహ్లాదకరమైన వాతావరణంలో అయురారోగ్యాలతో ఉండే పల్లె ప్రజలకు పెరిగిన సాంకేతిక పరిజ్ఞానం, మారిన జీవన విధానంతో లేనిపోని ఆరోగ్య సమస్యలు తలెత్తుతున్నాయి. పాశ్చాత్య పోకడల నేపథ్యంలో సంస్కృతి సంప్రదాయాలను పట్టించుకోవడం లేదు. సంపాదనలో పడి బంధుత్వాలకు కూడా విలువనివ్వడం లేదు. చిత్ర విచిత్ర కల్చర్లు మన సంప్రదాయానికి మాయని మచ్చగానే మిగులుతుందన్నది నిజం. ఆనాటి పల్లె స్మృతులను గుర్తుచేసుకుంటూ... అందిస్తున్న ప్రత్యేక కథనం...

**ఆరోగ్యకరమైన, రుచికరమైన ఆహారం**

రైతులు పండించిన పంటల్లో రసాయనిక ఎరువుల వాడకం ఉండేది కాదు. కేవలం సేంద్రియ ఎరువులతోనే పంటలను పండించేవారు. అలా పండించడంతో ఏలాంటి కల్తీ లేకుండా పంటలు చేతికందేవి. శనగపంట చేతికందగానే ముందుగానే పొలాల వద్ద వాటిని కాల్చుకుని తినేవారు. జొన్నలు మరో వారం రోజుల తర్వాత చేతికందుతున్న సమయంలో ఆ కంకులను కాల్చుకోని తినేవారు. వాటిని కాఫీలు అంటారు. ఇలా ఏ పంట పండినా రైతులు ఏడాదికి సరిపడ ఇంట్లోకి తీసుకున్న తర్వాత మిగతా పంటలో నుంచి కొంత మేరకు బంధువులకు, పట్టణాల్లోని స్నేహితులకు, తెలిసిన వారికి పంపించేవారు. పండ్ల విషయానికోస్తే ఏ కాలానికి ఆ పండ్లను ఆస్వాదించేవారు. వేపపుల్లతో పండ్లను శుభ్రం చేసుకునేవారు. కానీ నేడు అంతా రసాయనిక ఎరువులతో పండించిన పంటలే. పాలు సైతం కల్తీ అవుతున్నాయి. హైబ్రీడ్ పండ్లు మార్కెట్లోకి అందుబాటులోకి వచ్చేశాయి. కాయలుగా ఉన్న వాటిని పండ్లుగా మార్చే రసాయన పదార్థాలను వాడుతున్నారు. అయినా వాటినే తినాల్సిన పరిస్థితి దాపురించింది. దీనివల్ల ఆరోగ్యం మాటా దేవుడెరుగు, అది ఆనారోగ్యానికి దారి తీసోంది.

**వ్యవసాయమే వ్యాయామం..**

నేటికీ గ్రామీణప్రాంతాల్లో ఉన్న పెద్ద వయస్సు గల వారిని పలకరిస్తే వారి ఆరోగ్య రహస్యాన్ని వివరిస్తుంటారు. ఆ రోజుల్లో ఉదయమే 4 గంటలకు లేచి పొలాల బాట పట్టేవారు. ఇండ్లకు, పొలాలకు సుమారు కిలోమీటర్‌కు తక్కువగా దూరం ఉండేది కాదు. అక్కడి వరకు కాలినడకన (చెప్పులు లేకుండా) వెళ్లేవారు. బీడుగా ఉన్న భూములను సాగులోకి తీసుకువచ్చేందుకు దుక్కి దున్నడం, వొరాలు చేయడం, పశువులకు పచ్చిమేతను కోయడం వంటి పనులతో పంట చేతికందే వరకు చేసే వివిధరకాల పనులతో రైతులకు మంచి వ్యాయమం అయ్యేది. అంతేకాకుండా పొలాల వద్ద చెరువులు, బావుల్లో ఈత (స్విమ్మింగ్) కొట్టేవారు. సాయంకాలం పనులను ముగించుకున్న తర్వాత శరీరానికి విశ్రాంతి ఇచ్చేందుకుగాను కల్తీలేని కల్లును, ఇప్ప సారాను సేవించేవారు. భోజనం విషయంలోనూ సమయపాలన పాటిస్తూ మూడు పూటల పుష్టిగా తినేవారు. కానీ నేడు పరిస్థితులన్ని తారుమారయ్యాయి. యువతీ, యువకును ఉదయం 9 గంటలైనా నిద్రమత్తు వదలడం లేదనే చెప్పవచ్చు. అసలే కల్తీ ఆహారం, దానికి కుడా సమయపాలన పాటించక పోవడంతో లేనిపోని రోగాలను కొని తెచ్చుకుంటున్నట్లు అవుతోంది.

**ప్రతి పండుగ సంబురమే..**

గ్రామీణ ప్రాంతాల్లో ప్రతి పండుగనే సంతోషంగా, ఘనంగా జరుపుకుంటారు. పండుగను పండగలాగానే చేసుకుంటారు. పల్లె సంస్కృతులకు అన్ని మతాల పండుగలకు గౌరవం ఇస్తూ ప్రతి పండుగను వేడుకగా జరుపుకోవడం సంప్రదాయం. రంజాన్, బక్రీద్, దసరా, సంక్రాంతి, పీర్ల పండుగ, ఉగాది, బతుకమ్మ, హోళీ వంటి పండుగలను ఘనంగా జరుపుకుంటారు. వీటిలో పీర్ల పండుగ రోజున పీర్లను గ్రామంలో ఊరేగించి, మధ్యాహ్నం సమయంలో దులా దుంకడం, బతుకమ్మ సంబురాలను మహిళలు ఆట-పాటలతో సంతోషంగా జరుపుకునేవారు. దసరా పండుగకు గ్రామం నుంచి ఇతర ప్రాంతాల్లో నివాసం ఉంటున్నవారు సైతం సొంతూరికి వెళ్లి, పండగను వేడుకగా జరుపుకుంటారు. గ్రామాల్లో నేటికీ ముస్లింలు, క్రైస్తవులనే తేడాలేకుండా బంధుత్వ వరుసలతో కలిసిమెలిసిగా ఉంటారు. కానీ నేటి పరిస్థితి మారింది. ఈ రోజుల్లో ఏ పండుగనైనా సులువుగా (ఈజీగా) తీసుకుంటున్నారు. ఆనాటి పరిస్థితులు మచ్చుకైనా కనిపంచడం లేదు.

**పశువులతోనే పల్లెదనం..**

పచ్చని పంట పొలాలే కాదు... పాడి సంపదతోనే పల్లెదనం ఉట్టిపడేది. గ్రామీణప్రాంతాల్లో రైతుల ఇండ్ల వద్ద తప్పనిసరిగా ఆవులు, గేదెలు, మేకలు, గొర్రెలు, కోళ్లు, ఎడ్లు వీటిలో ఏవో ఒకటి ఉండేవి. ఇవి రైతులకు జీవనాధారంగా ఉపయోగపడేవి. ఎడ్లబండ్ల సహాయంతో చేతికందిన పంటను తీసుకువచ్చేవారు. వీటిలో ఎడ్లు వ్యవసాయానికి తోడ్పాటునందించడంలో ముఖ్యపాత్రను పోషిస్తాయి. కానీ నేడు పరిస్థితులు తారుమారయ్యాయి. వాటి పర్యవేక్షణ చేసేందుకు ఒకరిని ప్రత్యేకంగా ఏర్పాటు చేయాల్సి ఉంటుంది. పశుగ్రాసం కొరత, కూలీల కొరతతో పల్లెల్లో పశువుల పెంపకం తగ్గిపోయింది.
వ్యవసాయాన్ని ట్రాక్టర్ల సహాయంతో, ఆధునిక యంత్రాలతో చేపడుతున్నారు. దీనివల్ల రైతుల్లో కుడా సోమరితనం పెరిగిపోతుందనే చెప్పవచ్చు. బర్రెలు, ఆవుపాలు ఆరోగ్యానికి ఎంతో శ్రేష్టమైనవి. వాటి పెంపకం తగ్గడంతో పాల ఉత్పత్తి తగ్గిందనే చెప్పవచ్చు. దీంతో పాలప్యాకెట్లు వాడకంలోకి వచ్చాయి. పశుసంపదను పెంచెందుకు ప్రభుత్వం ప్రోత్సాహకంగా సబ్సిడీల పేరుతో రైతులకు వివిధ రకాలుగా తోడ్పాటునిస్తున్నా పశుగ్రాసం కొరతతో మేకలు, గొర్రెలు సైతం అప్పట్లో ఉన్నంత ప్రస్తుతం లేవనది అక్షరసత్యం. నాటి పల్లెల్లో పచ్చదనంతో జీవకళ తొణికిసలాడగా.. ఆధునికత పేరుతో పాశ్చాత్య అనుకరిస్తూ పల్లెలు జీవకళ కోల్పోతున్నాయి.

| FORMATIVE ASSESSMENT - పాఠ్యాంశ వారిగా లఘు పరీక్ష | మార్కులు |
|---|---|
| విద్యార్థి పేరు      నెం :    10వ తరగతి<br>సెక్షన్ : | |
| జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల -    వెన్నెల    - విశాఖజిల్లా. | **20** |

1. ***అవగాహన ప్రతిస్పందన –5M***

   Q. సురుచిర తారక కుసుమ ? పద్యమునకు ప్రతిపదార్థం రాయుము ----

2. ***సృజనాత్మకత వ్యక్తీకరణ – 5M***

   Q. "కవి వెన్నెలను వర్ణించడానికి ఏ ఏ అంశాలను ఎంచుకున్నాడో రాయండి ? .

3. ***వ్యాకరణాంశములు – 5M***

   1. మిక్కుటము సొంత వాక్యం రాయండి ?
   2. సంధ్య వికృతి రాయండి?
   3. తేట గీతీ పద్య లక్షణాలను రాయండి ?
   4. అవ్విధము ఏ సంధో రాయండి ?
   5. సూర్యచంద్రులు .సమాసమును రాయుము ___

4. ***ఉపవాచక ప్రశ్న రాయండి . 5M***

   Q. రామాయణములో సుగ్రీవుని స్వభావమును, పాత్రను విశ్లేషించండి?

## ప్రాజెక్టు పని 4 :

Q. "నరసింహ స్వామి కథ" నేపథ్యంతో వచ్చిన గ్రంథాలు, వివరాలను ఈ క్రింది పట్టికలో రాయండి?

| క్ర. సం | గ్రంథం పేరు | ప్రక్రియ | కవి | కాలం |
|---|---|---|---|---|
| 1. | **నృసింహ పురాణం** | చంపుకావ్యం | ఎర్రన | 14 వ శతాబ్దం |
| 2 | **ఆంధ్ర మహా భాగవతం** | ఇతిహాసం | పోతన | 14 వ శతాబ్దం |
| 3 | **హరి వంశం** | కావ్యం | ఎర్రన | 14 వ శతాబ్దం |
| 4 | **విష్ణు పురాణం** | కావ్యం | వెన్నెల కంటి సూరన | 16 వ శతాబ్దం |
| 5 | **ప్రహ్లాద విజయం** | కీర్తనము | తాగరాజు | క్రీ॥శ॥ 1759-1847 |
| 6 | **నరసింహ శతకం** | శతకం | శేషప్ప కవి | 18 వ శతాబ్దం |
| 7 | **ఆంధ్రనాయక శతకం** | శతకం | కాసుల పురుషోత్తమ కవి | 18 వ శతాబ్దం |
| 8 | **సింహాద్రి నారసింహ శతకం** | శతకం | గోగుల పాటి కూర్మనాధ కవి | 18 వ శతాబ్దం |
| | | | | |

| FORMATIVE ASSESSMENT - పాఠ్యాంశ వారిగా లఘు పరీక్ష<br>విద్యార్థి పేరు నెం : 10వ తరగతి సెక్షన్ : | మార్కులు |
|---|---|
| జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల - ధన్యుడు - విశాఖజిల్లా. | 20 |

**1. అవగాహన ప్రతిస్పందన –5M**

Q. చూడాకర్ణుని మాటలను బట్టి మీకు అర్థమైన విషయమేమి? మీ అభిప్రాయం రాయండి .?

**2. సృజనాత్మకత వ్యక్తీకరణ – 5M**

Q. వివేకహీనుడైన ప్రభువును సేవించుటకంటే వనవాసము ఉత్తమముదీని ఔచి.త్యమును రాయుము ?

**3. వ్యాకరణాంశములు – 5M**

1. ధన్యుడు సొంత వాక్యం రాయండి ?
2. గృహము వికృతి రాయండి?
3. మూషికము వ్యుపత్తిని రాయండి ?
4. సరసపుమాట ఏ సంధో రాయండి ?
5. చంపకవతి పట్టణము.సమాసమును రాయుము __

**4. ఉపవాచక ప్రశ్న రాయండి . 5M**

Q. రామాయణములో శబరి పాత్రను వివరించండి?

| **FORMATIVE ASSESSMENT - పాఠ్యాంశ వారిగా లఘు పరీక్ష** | మార్కులు |
|---|---|
| విద్యార్థి పేరు నెం : 10వ తరగతి సెక్షన్ : | |
| జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల - **శతకమధురిమ** - విశాఖజిల్లా. | **20** |

**1. అవగాహన ప్రతిస్పందన –5M**

Q. తన దేశంబు స్వభాష ? .పద్యమునకు ప్రతిపదార్థం రాయండి ...........

**2. సృజనాత్మకత వ్యక్తీకరణ – 5M**

Q. నైతిక విలువలు అంటే ఏమిటి మీరు గమనించిన నైతిక విలువలను ?రాయుము?

**3. వ్యాకరణాంశములు – 5M**

1. ముష్కరుడు సొంత వాక్యం రాయండి ?
2. లక్ష్మి వికృతి రాయండి?
3. పయోనిధి వ్యుపత్తిని రాయండి ?
4. మనోహరము సంధి విడదీసి రాయండి ?
5. నిస్తేజము.సమాసమును రాయుము __

**4. ఉపవాచక ప్రశ్న రాయండి . 5M**

Q. శ్రీరాముడు తన బలముపై సుగ్రీవునికి నమ్మకం ఎట్లా కలిగించాడు? .

## భాషా కార్యకలాపాలు/ ప్రాజెక్టు పని 6

### శతక మధురిమ శతక పద్యాలు

పాఠశాల గ్రంథాలయంలో శతక పద్యాలున్న పుస్తకాలు తీసుకొని చదవండి. వాటిలో ఏవైనా అయిదు శతక పద్యాలను, వాటి భావాలను రాసి ప్రదర్శించండి.

1. వేమన శతకం ఆ.వె. పట్టుబట్టరాదు పట్టి విడువరాదు

పట్టెనేని బిగియఁ బట్టవలయు

బట్టివిడుటకన్న బరగఁజచ్చుట మేలు

విశ్వదాభిరామ వినురవేమ!

భావం: ఏ పనైనా చేయాలని ఆలోచనవస్తే అది పూర్తయ్యే వరకు వదలకూడదు. పట్టిన పట్టు వదలడం కంటే ప్రాణం వదలడం మేలు.

2. సుమతీ శతకం ఆ. స్త్రీలయెడ వాదులాడకు,

బాలురతోఁ జెలిమిజేసి భాషింపకుమీ,

మేలైన గుణము విడువకు

ఏలినపతి నింద సేయకెన్నడు సుమతీ!

భావం: స్త్రీలతో మాట్లాడుతూ గొడవలకు దిగకూడదు. తెలిసీ తెలియని వయసున్న వారితో స్నేహం చేసి అన్ని విషయాల గురించి చర్చించరాదు. స్వచ్ఛమైన గుణాన్ని ఎప్పటికీ విడిచిపెట్టకూడదు. యజమాని గురించి ఏ సమయంలోనూ చెడుగా మాట్లాడొద్దు.

3. భర్తృహరి నీతి శతకం కం. కందుకమువోలె సుజనుఁడు

గ్రిందం బడి మగుడ మీఁదికిన్నెగయుఁ జుమీ

మందుఁడు మృత్పిండమువలెఁ

గ్రిందం బడి యడంగి యుండుఁగృపణత్వమునన్.

భావం: బంతి కింద పడి మళ్ళీ పైకెగిరిన విధంగానే దైవాన్ని నమ్మినవాడు హీనస్థితిని పొందినా తిరిగి వెంటనే ఉన్న తస్థితికి చేరుకుంటాడు. కానీ దైవాన్ని నమ్మనివాడు మట్టిముద్దలా కిందపడి హీనస్థితిలోనే ఉంటాడు.

4. భాస్కర శతకం ఉ. దానము చేయగోరిన వదాన్యున కీయగ శక్తి లేనిచో

నైన పరోపకారమునకై యొక దిక్కున దెచ్చియైన నీ

బూనును, మేఘుడంబుధికి బోయి జలంబులదెచ్చి యీయడే

వాన, సమస్త జీవులకు వాంఛితమింపెసలార భాస్కరా!

భావం: ఓ సూర్యుడా! దానగుణం కలవాడు తన దగ్గర సొమ్ము లేకపోయినా దానం చేయడానికి ఎక్కడి నుంచైనా తెచ్చి దానం చేస్తాడు. సముద్రం వద్దకు వెళ్ళి, మేఘుడు నీటిని తెచ్చి జీవరాశికి వానగా ఇవ్వడం లేదా!

5. కుమార శతకం క. ఆచార్యున కెదిరింపకు

బ్రోచిన దొర నింద సేయ బోకుము కార్యా

లోచనము లొంటిఁజేయకు

మాచారము విడువఁబోకుమయ్య కుమారా!

భావం: ఓ కుమారా! చదువు చెప్పే గురువు మాటకు ఎదురు చెప్పకు. పోషించే యజమానిని నిందించకు. ఒంటరిగా అనేక విధాలుగా ఆలోచనలు చేయకు. మంచి నడవడికను వదిలిపెట్టకు. ఇలా చేయడం వల్ల నీకు ఎంతో మేలు జరుగుతుంది. అందరూ నిన్ను అనుసరిస్తారు.

| **FORMATIVE ASSESSMENT - పాఠ్యాంశ వారిగా లఘు పరీక్ష** | మార్కులు |
|---|---|
| విద్యార్థి పేరు　　　　నెం　:　　10వ తరగతి　సెక్షన్ : | |
| జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల - మా ప్రయత్నం - విశాఖజిల్లా. | **20** |

**1. అవగాహన ప్రతిస్పందన -5M**

Q. మహిళావరణం రచయిత్రులు ఏఏరంగాలకు చెందిన స్త్రీల వివరాలు సేకరించాలనుకున్నారో రాయండి?

**2. సృజనాత్మకత వ్యక్తీకరణ – 5M**

Q. చరిత్రనిర్మాతలగా స్త్రీలు ప్రధానంగా ఉన్నారనే భావన సంపాదకులకు కలగడానికిగల కారణాలను వివరించండి ?

**3. వ్యాకరణాంశములు – 5M**

1. తునాతునకలు సొంత వాక్యం రాయండి ?
2. విజయోత్సవం అనగా వివరించండి?
3. సామాజకాభివృద్ధి అనగా వివరించండి?
4. సవర్ణదీర్ఘ సంధిని సోదాహరణముగా వివరించండి ?
5. ప్రతిదినము.సమాసమును రాయుము __

**4. ఉపవాచక ప్రశ్న రాయండి . 5M**

Q. వాల్మీకి భాధ ఎట్లా రామయణముగా రూపుదిద్దుకుంది? .

## 7. మా ప్రయత్నం భాషా కార్యకలాపాలు/ ప్రాజెక్టు పని

**వివిధ రంగాల్లో ప్రసిద్ధులైన మహిళల ఫొటోలను, జీవిత విశేషాలను సేకరించి ఒక మోడల్ మహిళావరణం పుస్తకాన్ని తయారుచేయండి. ప్రదర్శించండి.**

### 1. మొదటి మహిళా మంత్రి రాజ్‌కుమారీ అమృత్ కౌర్:



అమృత్ కౌర్ 1889 ఫిబ్రవరి 2న రాజా హరమ్‌సింగ్, రాణి హరమ్‌సింగ్‌లకు ఉత్తరప్రదేశ్ లోని లక్నోలో జన్మించారు. వారిది సంప్రదాయ పంజాబీ కుటుంబం. కౌర్ విద్యాభ్యాసం ఇంగ్లండ్‌లోని షెర్‌బోర్న్ స్కూల్ ఫర్ గర్ల్స్‌లో, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో పూర్తయింది. తన తండ్రికి గోపాలకృష్ణ గోఖలే ఆప్తమిత్రుడు. భారత్ వచ్చాక ఆమెకు స్వాతంత్ర్య ఉద్యమం మీద మక్కువ పెరిగింది. మహాత్మాగాంధీతో కలిసి పనిచేశారు. ఆల్ ఇండియా ఉమెన్ కాన్ఫరెన్స్‌ను ఏర్పాటుచేసి, దానికి అధ్యక్షురాలుగా పనిచేశారు. 1934 నుంచి సబర్మతి ఆశ్రమంలో మహాత్మాగాంధీ సెక్రటరీగా పదహారు సంవత్సరాలు సేవలు అందించారు. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, జైలుకు వెళ్లారు. స్వాతంత్ర్యం అనంతరం జవహర్‌లాల్ నెహ్రూ క్యాబినెట్‌లో ఆరోగ్యమంత్రిగా పనిచేశారు. 1950లో వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్‌కు అధ్యక్షురాలుగా ఎన్నికయ్యారు. అలా ఎన్నికైన మొదటి మహిళా నాయకురాలు కౌర్. ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీకి చైర్ పర్సన్‌గా 14 సంవత్సరాలు సేవలందించారు. నర్సింగ్ కాలేజీని స్థాపించి తన ఆస్తినంతా ధారపోశారు. ఆమె రాజ్యసభ సభ్యురాలిగా ఉన్న సమయంలో 1964వ సంవత్సరంలో కన్నుమూసింది.

### 2. అరుందతీ భట్టాచార్య:

కలకత్తాలోని బెంగాలీ కులీన్ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. ఆమె బాల్యమంతా భిలాయ్‌లో గడిచింది. తండ్రి ప్రద్యుమ్న కుమార్ భిలాయ్ స్టీల్ ప్లాంట్‌లో పనిచేసేవారు. అరుంధతీ 1977లో ప్రొబేషనరీ ఆఫీసర్ (పీవో)గా ఎస్‌బీఐలో చేరారు. 36 ఏళ్ల సర్వీసులో... ఫారిన్ ఎక్స్ఛేంజ్, ట్రెజరీ, రిటైల్ ఆపరేషన్స్, హ్యూమన్ రిసోర్సెస్, ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంకింగ్ రంగాల్లో పదవీ బాధ్యతలను స్వీకరించారు. ఎస్‌బీఐ మొదటి మహిళా ఛైర్‌పర్సన్‌గా ఎన్నికయ్యారు. పిల్లలు, వృద్ధుల సంరక్షణ కోసం మహిళా ఉద్యోగులు రెండు సంవత్సరాలు సెలవు తీసుకునేలా ఆమె ఎస్‌బీఐలో ఒక విధానాన్ని ప్రవేశపెట్టారు. 2014 ఫోర్బ్స్ పత్రికలో శక్తిమంతమైన మహిళల జాబితాలో 36వ స్థానంలో నిలిచారు. మహిళా బ్యాంక్ స్థాపనలో ఆమె కృషి మరవలేనిది.

### 3. థెస్సీ థామస్:

భారతదేశంలో క్షిపణి పరీక్షకు నేతృత్వం వహించిన మొదటి మహిళగా గుర్తింపు పొందిన థెస్సీ థామస్ 1963లో జన్మించారు. 5 వేల కిలోమీటర్ల దూరంలోని లక్ష్యాలను ఛేదించగల 'అగ్ని-5' ప్రాజెక్టు డైరెక్టరుగా ఆమె పనిచేశారు. 1988లో డీఆర్‌డీవోలో సైంటిస్ట్‌గా చేరారు. అబ్దుల్‌కలాంతో కలిసి పనిచేశారు. మన్మోహన్‌సింగ్ ఒకసారి థెస్సీని "నీలాంటి మహిళా శాస్త్రవేత్తలు శాస్త్ర సాంకేతిక రంగాల్లో అరుదైన ముద్ర వేయడం అభినందనీయం" అని పొగిడారు.

### 4. అనౌషే అన్సారీ:

1966లో జన్మించారు. ఎలక్ట్రికల్ ఇంజినీరింగ్, కంప్యూటర్ సైన్స్‌లో డిగ్రీ పూర్తిచేశారు. 1993లో టెలికామ్ టెక్నాలజీస్‌ను స్థాపించారు. 2006లో స్పేస్ సెంటర్‌కు పయనమవుతున్న వ్యోమనౌకలో ప్రయాణించాల్సిన ఓ వ్యోమగామి అనారోగ్యానికి గురి కావడంతో అన్సారీకి వెళ్లే అవకాశం దక్కింది. రక్తహీనతకు సంబంధించిన కారణాలను, స్పేస్ స్టేషన్‌లోని వ్యక్తులపై మైక్రోబ్స్ ప్రభావాన్ని ఆమె పరిశోధించారు. తొలి మహిళా స్పేస్ టూరిస్ట్‌గా రికార్డు నెలకొల్పారు.

| FORMATIVE ASSESSMENT - పాఠ్యాంశ వారిగా లఘు పరీక్ష | మార్కులు |
|---|---|
| విద్యార్థి పేరు నెం : 10వ తరగతి సెక్షన్ : | |
| జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల - సముద్రలంఘనం - విశాఖజిల్లా. | 20 |

**1. అవగాహన ప్రతిస్పందన –5M**

Q. తనచూ పంభుధి మీద జూచి? .పద్యమునకు ప్రతిపదార్థం రాయండి ...........

**2. సృజనాత్మ కత వ్యక్తీకరణ – 5M**

Q. హనుమంతుడు సముద్రాన్ని లంఘించిన విధానాన్ని కవి ఎలా వర్ణించాడో రాయుము ?

**3. వ్యాకరణాంశములు – 5M**

1. నభము అర్థమును రాయండి ?
2. సముద్రము వికృతి రాయండి?
3. పారావారము వ్యుపత్తిని రాయండి ?
4. నీవుడక్కరి సంధి విడదీసి రాయండి ?
5. ముక్తపదగ్రస్తాలంకారమును నోదాహరణముగా రాయుము.

**4. ఉపవాచక ప్రశ్న రాయండి . 5M**

Q. మైనాకుడు తనపై విశ్రాంతి తీసుకొమన్నా ఒప్పుకోనిహనుమంతుని మాటలనుబట్టి మీరేమి గ్రహించారు ?

| FORMATIVE ASSESSMENT - పాఠ్యాంశ వారిగా లఘు పరీక్ష | మార్కులు |
|---|---|
| విద్యార్థి పేరు   నెం:   10వ తరగతి  సెక్షన్ : | |
| జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల - **మాణిక్యవీణ** - విశాఖజిల్లా. | **20** |

***1. అవగాహన ప్రతిస్పందన – 5M***

Q. మాణిక్యవీణ వచన కవితా భావాన్ని సొంతమాటలలో రాయండి. ?

***2. సృజనాత్మకత వ్యక్తీకరణ – 5M***

Q. విద్వాన్ విశ్వం కవిత్వాన్ని ప్రశంసిస్తూ మిత్రునికి లేఖ వ్రాయండి.?

***3. వ్యాకరణాంశములు – 5M***

1. రోదసి సొంత వాక్యం రాయండి ?
2. శ్లేషాలంకారమును సోదాహరణముగా రాయండి ?
3. మంత్రాలకు చింతకాయలు రాలడం జాతీయాన్ని వివరించండి. ?
4. మహోపకారం సంధి విడదీసి రాయండి ?
5. ప్రముఖ దినము ---- సమాసమును రాయుము.

***4. ఉపవాచక ప్రశ్న రాయండి. 5M***

Q. రామాయణములో విభీషణుని స్వభావమును, పాత్రను విశ్లేషించండి ?

9. మాణిక్యవీణ

భాషాకార్యకలాపాలు/ ప్రాజెక్టు పని

★దిన, వార పత్రికల ఆధారంగా మీకు నచ్చిన రెండు వచన కవితలను సేకరించి, అంశాల ఆధారంగా కింది పట్టికను పూరించండి.

| క్ర.సం. | కవితా శీర్షిక | పత్రిక తేది | కవితలో మీరు గుర్తించిన ప్రత్యేక అంశాలు | కవితలో మీకు బాగా నచ్చిన పంక్తులు |
|---|---|---|---|---|

జ:

| క్ర.సం. | కవితా శీర్షిక | పత్రిక తేది | కవితలో మీరు గుర్తించిన ప్రత్యేక అంశాలు | కవితలో మీకు బాగా నచ్చిన పంక్తులు |
|---|---|---|---|---|
| 1. | స్వాతంత్ర్యం... | ఈనాడు 15 ఆగస్టు 2014 | 1) స్వాతంత్ర్య ఫలాల ను అందుకోవడం<br>2) మహానుభావుల త్యాగఫలం | 1) దాస్య బంధనం వీడిందని ఎగురుతోంది ఢిల్లీ ఎర్రకోట పై జెండా<br>2) ప్రతి భారతీయుడిలో ఆనందం గుండెనిండా |

| క్ర.సం. | కవితా శీర్షిక | పత్రిక తేది | కవితలో మీరు గుర్తించిన ప్రత్యేక అంశాలు | కవితలో మీకు బాగా నచ్చిన పంక్తులు |
|---|---|---|---|---|
| 2. | గాలానికి చిక్కొద్దు | ఈనాడు 17 ఏప్రిల్ 2014 | 1) ఓటు హక్కు వినియోగం<br>2) మంచి వారిని ఎన్నుకోవాలి | 1) ఊసరవెల్లులను నమ్మొద్దు మాటల గాలానికి చిక్కొద్దు<br>2) తరతరాల అంతరాల తలరాతలు మార్చేదెవరు? |
| 3. | ఈ నేరం ఎవరిది. ....? | ఈనాడు 27 జులై 2014 | 1) రైలు ప్రమాదంలో మరణించిన బాలలు<br>2) ప్రమాదంలో కోల్పోయింది ఏమిటి | 1) ఢీ కొట్టింది రైలే...! కానీ... చిధ్రమైంది బస్సు కాదు మహా వృక్షాలుగా ఎదగాల్సిన అంకురాలు<br>2) ఢీ కొట్టింది రైలే...! కానీ... బలైంది పసిప్రాణాలే కాదు తల్లిదండ్రుల కోటి స్వప్నాల సర్వ ప్రాణాలు |

| FORMATIVE ASSESSMENT - పాఠ్యాంశ వారిగా లఘు పరీక్ష | మార్కులు |
|---|---|
| విద్యార్థి పేరు నెం : 10వ తరగతి సెక్షన్ : | |
| జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల - గోరంత దీపాలు - విశాఖజిల్లా. | 20 |

**1. అవగాహన ప్రతిస్పందన –5M**

Q. రైలు పెట్టిలో ఉడుస్తూన్న బలుడు గూర్చి వృధుడు ఏమి చేసాడు? .

**2. సృజనాత్మకత వ్యక్తీకరణ – 5M**

Q. "ఒంటరిగా ఉన్నప్పుడు పుస్తకాలే మన నేస్తాలు" అనే వాక్యంతో ఏకీభవిస్తారా ?ఎందుకు ?

**3. వ్యాకరణాంశములు – 5M**

1. వినయం విదేయత- సొంత వాక్యం రాయండి ?
2. తదేకంగా అర్థము వ్రాయుము?
3. అక్షరం వ్యుత్పత్తిని రాయండి? .
4. పల్లెటూరు సంధి విడదీసి రాయండి ?
5. గోరంత దీపాలు పాఠ్యభాగ రచయిత ఎవరు?

**4. ఉపవాచక ప్రశ్న రాయండి . 5M**

Q. రామాయణములో జటాయువు పాత్రను విశ్లేషించండి?

## 10. గోరంత దీపాలు

### భాషా కార్యకలాపాలు/ ప్రాజెక్టు పని

మీ పాఠశాల గ్రంథాలయంలోని ఏదైనా కథల పుస్తకం నుంచి లేదా ఏదైనా పత్రిక నుంచి సామాజిక సేవ, మానవ సంబంధాలు, గురుశిష్య సంబంధం మొదలైన విషయాలకు సంబంధించిన మంచి కథను చదివి ఎంపిక చేయండి. దాన్ని రాసి ప్రదర్శించండి. అది మీకు ఎందుకు నచ్చిందో, దానిలోని గొప్పతనమేమిటో నివేదిక రాయండి?

జ: కథ: మానవ సంబంధాలు గొప్పవి

సుధాకర్, నాగరాజు, బాలకిషన్, ఆనంద్ నలుగురూ అన్నదమ్ములు. వారిది చాలా పేద కుటుంబం. రెక్కాడితేగాని డొక్కాడని పరిస్థితి. వృద్ధులైన తల్లిదండ్రులకు సహాయం చేస్తూ బతుకుతున్నారు. అందరూ చదువుకుంటే పూట గడవటం కష్టమని చిన్న తమ్ముడైన ఆనంద్‌ను చదివించారు. సుధాకర్, నాగరాజు, బాలకిషన్ తలో పని చేస్తూ డబ్బులు కూడబెట్టి ఆనంద్‌ను బాగా చదివించారు. ఆనంద్‌పైనే అన్నల ఆశ. తమ కుటుంబాన్ని ఉన్నత స్థితికి తీసుకెళతాడని పస్తులు ఉండి పనిచేసి మరీ కార్పొరేటు విద్యను అందించారు. బాగా చదివిన ఆనంద్‌కు ఉన్నత ఉద్యోగం లభించింది.

ఆనంద్‌కు ఉద్యోగం రావడంతో అన్నల ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. కొంతకాలం తర్వాత ఆనంద్‌కు పెళ్లి చేశారు. ఉద్యోగ నిమిత్తం ఆనంద్ బొంబాయి వెళ్లాడు. సంవత్సరాలు గడిచాయి. తాను, తన భార్య, తన పిల్లలే ముఖ్యం అనే స్వార్థ ఆలోచనతో అన్నలను పట్టించుకున్న పాపాన పోలేదు. ఎదురు చూస్తున్న అన్నల ఆశలు ఆవిరి అయ్యాయి. కన్న తల్లిదండ్రులు చనిపోయినా రాలేదు. ఒక మొక్క ఎదిగి చెట్టుగా మారేందుకు ఎన్ని జాగ్రత్తలు తీసుకుంటారో అన్ని జాగ్రత్తలు ఆనంద్ విషయంలో అన్నలు తీసుకున్నారు. అయినా అది గ్రహించని ఆనంద్ సంబంధాలను తెంచేసుకున్నాడు. కొన్ని సంవత్సరాల తర్వాత రోడ్డు ప్రమాదంలో ఆనంద్‌కు తీవ్రగాయాలయ్యాయి. భార్యా పిల్లలు అతడికి సేవలు చేయలేకపోయారు. వారు ఛీత్కరించిన ప్రతిసారి ఆనంద్‌కు తమ అన్నలు గుర్తుకు వచ్చేవారు. తన అన్నలకు ఉత్తరం రాశాడు. ప్రేమ ఉన్న అన్నలు తమ తమ్ముడిని చేరదీశారు. సేవలు చేసి తమ్ముడిని మామూలు మనిషిని చేశారు. ఆనంద్‌కు సంబంధాల గొప్పతనం అర్థమైంది. లోకంతో సంబంధాలు కలిగి ఉండాలని, 'మనం' అనే భావనను మరవరాదని తెలుసుకున్నాడు. ఇన్నాళ్ల తన స్వార్థ ఆలోచనలకు సిగ్గుపడి తలదించుకున్నాడు. పేదరికంలో ఉన్న అన్నలను బొంబాయి తీసుకెళ్లి పని కల్పించాడు. వారితో హాయిగా జీవించసాగాడు.

### 'కథ'పై నివేదిక

కథలో అన్నల త్యాగంతో తమ్ముడు చదువుకున్నాడు.

స్వార్థపూరిత ఆలోచనలతో తమ్ముడు పూర్తిగా మారిపోయాడు.

కన్నతల్లిదండ్రులు మరణిస్తే రాలేని కసాయి కొడుకు ఆనంద్.

తమ్ముడు అన్నలను పట్టించుకోకపోవడంతో అన్నల బాధ వర్ణనాతీతం.

తీవ్ర గాయాలతో నిస్సహాయ స్థితిలో ఉన్న తమ్ముడిని చేరదీసి సేవలు చేయడం అన్నల గొప్పతనం.

మానవ సంబంధాలు గొప్పవి అని తమ్ముడు తెలుసుకోవడం, 'మనం' అనే భావనను పెంపొందించుకోవడం.

మానవ సంబంధాలు మనిషిని ఉన్నతుడిగా తయారు చేస్తాయి.

అందరూ కలిసి పేదరికాన్ని పారదోలవచ్చు.

| FORMATIVE ASSESSMENT - పాఠ్యాంశ వారిగా లఘు పరీక్ష | మార్కులు |
|---|---|
| విద్యార్థి పేరు నెం : 10వ తరగతి సెక్షన్ : | |
| జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల - భిక్ష - విశాఖజిల్లా. | **20** |

**1.** *అవగాహన ప్రతిస్పందన –5M*

Q. ఆకంఠంబుగ .......శిలోంఛప్రక్రముల్ తాపసుల్ |పద్యానికి ప్రతిపదార్థం రాయండి? .

**2.** *సృజనాత్మకత వ్యక్తీకరణ – 5M*

Q. భిక్ష పాఠం లోని కథను సంక్షిప్తంగా రాయండి ?

**3.** *వ్యాకరణాంశములు – 5M*

1. కుందాడుట---- సొంత వాక్యం రాయండి ?
2. మత్స్యము వికృతి రాయండి?.
3. గురుడు వ్యుత్పత్తిని రాయండి? .
4. యివ్వీటి సంధి విడదీసి రాయండి ?
5. అర్థాంతరన్యాసాలంకారమును లక్షణములు రాయము?

**4.** *ఉపవాచక ప్రశ్న రాయండి . 5M*

Q. సీత ఆదర్శ నారి వివరించండి?

**ప్రాజెక్టు పని 11 :**

*భిక్ష భాషా కార్యకలాపాలు/ ప్రాజెక్టు పని : శ్రీనాథుడు సీస పద్య రచనకు ప్రసిద్ధి. ఆయన రచించిన ఏవైనా 5 పద్యాలు వేర్వేరు గ్రంథాల నుంచి సేకరించండి.*

జ: శ్రీనాథుడి సీసపద్యాలు

1. 'శృంగార నైషధము'

సీ. తల్లి మదేక పుత్రిక, పెద్ద కన్నులు
గానదిప్పుడు; మూడుకాళ్ళముసలి
యిల్లాలు గడు సాధ్వియేమియు నెఱుఁగదు
పరమ పాతివ్రత్య భవ్యచరిత
వెనుక ముందరలేరు నెనరైన చుట్టాలు
లేవడి యెంతేని జీవనంబు
గానక కన్న సంతానంబు శిశువులు
జీవన స్థితికేన తావలంబు
తే. కృపదలంపగదయ్య యో నృపవరేణ్య!
యభయమీవయ్య !యోతుహినాంశువంశ!
కావగదవయ్య యర్థార్థి కల్పశాఖి,
నిగ్రహింపకుమయ్య యోనిషధరాజ!

2. భీమేశ్వర పురాణం

సీ. ఒకచోటగోటి ఫల్ల్యుడు రాజకోటీర
విభ్రాజితోత్సంగ వృద్ధగంగ
యొకచోట బీదాంబికోన్నత స్తన భరు
స్ఫాల జరిత కల్లోల యేల
యొకచోట జటుల నక్రకులీర పాఠీన
తోయ గర్భాభోగ తుల్యభాగ
యొకచోట నప్సరో నికర సంసేవి తాం
తరము శ్రీ సప్త గోదావరంబు
తే. నమరు నాగర ఖండ సిద్ధాంత జాతి
నాగవల్లీ సమాక్రాంత పూగ ఖండ
మండితో ద్యాన వాటికా ఖండ విభవ
పాత్రమగు భీమ మండలీ క్షేత్రమునకు

3. కాశీఖండం

సీ. ధర్మంబు కాశి కాష్ఠాన మధ్యంబున
నాల్గు పాదంబుల నడచియాడు
నర్థంబు కాశీ పురాంగణంబున యందు
నానా ప్రకారమైనటున మిగులు
గామంబుకాశి కాకటక ఘంటా వీధి
గర్వించు రాజలోకంబు లేవ
మోక్ష సంపదలు కాశీ క్షేత్రమున యందు
ద్రవ్వి తండంబులై నివ్వటిల్లు
తీ. కాశికళ్యాణముల కాది కారణంబు
కాశి యణి మాది సిద్ధుల కాట పట్టు
కాశి జనలోక సంకల్ప కల్పకంబు
కలుష పిశితంబు మెసవు రాకాసికాశి

4. హరవిలాసం

సీ. అనువు దప్పిరి నొచ్చిరలసి రాపద నొంది
రాదవదలైరి చీకాకుపడిరి
యంగలార్చిరి విచ్చి రాఅడి బొందిరి
బ్రమసిరి పాఱిరి పల్ల టవిరి
బెగ్గడివిరి పికాపికలైరి సొలసిరి
కులకుల కూసిరి కుతిల పడిరి
గగ్గులకాఱైరి కలగి రోటాఱిరి
వెలవెల్లనైరి నివ్వెఱగు పడిరి
తే. యసపు సవులైరి గుజగుజయైరిడస్సి
రొల్లబోయిరి వెగ్గిరి తల్లడిలిరి
సిగ్గువడి రొచ్చవడిరి యిస్సిస్సియైరి
తారకుని చేత మునులు బృందారకులును

5. శివరాత్రి మహాత్మ్యం

సీ. స్ఫటిక రత్న గృహంబు సర్వం సహాకాంత
కభిదాంతరంబు దుగ్ధాంబు నిధికి
మణి దర్పణము నభోమణి మార్గలక్ష్మికి
జంద్రా తపమునకు జన్మభూమి
యర్ధేందు మకుటాట్టహాసంబునకు జోడు
పౌలస్త్యగిరికి సబ్రహ్మచారి
ప్రతిబింబమభ్రము ప్రభువారణమునకు
ననుగు జుట్టము శారదాభ్రములకు
తే. గమఠ తిమినక్ర విక్రమక్రమ విహార
చటులతర వీచికా ఘటా సమధి రూఢ
హంసకుల సన్నినాద సంవ్యాప్త దిగ్వి
భాగమీక్షించె నతడు తడాగ మెదురు

| FORMATIVE ASSESSMENT - పాఠ్యాంశ వారిగా లఘు పరీక్ష | మార్కులు |
|---|---|
| విద్యార్థి పేరు     నెం :     10వ తరగతి సెక్షన్ : | |
| జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల - **చిత్రగ్రీవం** - విశాఖజిల్లా. | **20** |

**1. అవగాహన ప్రతిస్పందన –5M**

Q. చిత్రగ్రీవం ఏయే వయస్సులలో ఏయే పనులు చేయగలగినదో రాయండి?

**2. సృజనాత్మకత వ్యక్తీకరణ – 5M**

Q. ధన గోపాల్ ముఖర్జీ చేసిన సాహితీ సేవ ఏమిటి ?

**3. వ్యాకరణాంశములు – 5M**

1. శ్రద్ధాసక్తులు --- సొంత వాక్యం రాయండి ?
2. ఉలుకు పలుకు లేక పోవడం జాతీయాన్ని వివరించండి ?
3. పావురాలు సమాసమును రాయండి?
4. కంద పద్య లక్షణాలను రాయండి ?
5. ? ఏ అలంకారమో రాయండి "శ్రీకాంత్ చొక్కా మల్లెపువ్వువలే తెల్లగా ఉంది"

**4. ఉపవాచక ప్రశ్న రాయండి . 5M**

Q. లక్ష్మణుని రామ సేవా తత్పరతను తెల్పండి( లేదా ) ?

Q. చెప్పుడు మాటలు చెటుకు కారణం వివరించండి .?

## ప్రాజెక్టు పని 12 :

Q. ధనగోపాల్ ముఖర్జీ రాసిన చిత్రగ్రీవం ఓ పావురం కథ అనే పుస్తకాన్ని లేదా పక్షులు గూర్చి తెలిపే ఏదైనా ఒక పుస్తకాన్ని గ్రంథాలయం నుండి చదవండి.మీరు తెలుసుకొన్న వివరాలు రాసి ప్రదర్శించండి లేదా అంతర్జాలంద్వారా ఏపైనా రెండుపక్షుల వివరాలు,వాటిచిత్రాలు సేకరించి రాయండి

# పరోపకారం

ఒక అడవిలో నది ఒడ్డున ఓ మర్రిచెట్టు ఉంది. దానిపై ఓ పావురం నివసించేది. అది చాలా మంచిది. ఎవరికి కష్టం కలిగినా సాయం చేసేది. ఆ పావురానికి పాటలు పాడటమంటే భలే ఇష్టం. తన పనంతా అయిపోయాక చెట్టుకొమ్మపై పాటలు పాడుతూ గడిపేసేది.

ఓ రోజు పావురం పాటపాడుకుంటూ నదిలో నీరు తాగడానికి వచ్చింది. ఇంతలో దానికి నదీ ప్రవాహంలో కొట్టుకుపోతున్న చీమ ఒకటి కనిపించింది. దాన్ని ఎలాగయినా కాపాడాలనుకుంది పావురం. ఆలోచించగా ఓ ఉపాయం తట్టింది. వెంటనే మర్రిచెట్టు ఆకునొకదాన్ని తీసుకుని చీమ పక్కన పడేసింది. 'ఓ చీమా... ఆ ఆకుమీదకు ఎక్కి నీ ప్రాణం కాపాడుకో' అని అరిచింది. అంతే, చీమ గభాల్న ఆ ఆకుమీదకు వెళ్లిపోయింది. ఆకు అలా తేలుతూ నది ఒడ్డున ఆగిపోవడంతో చీమ సురక్షితంగా ఒడ్డుకు చేరుకుంది. 'నా ప్రాణాలు కాపాడినందుకు ధన్యవాదాలు' అంటూ పావురానికి చీమ కృతజ్ఞతలు చెప్పింది. సంతోషంతో పావురం అక్కడి నుంచి వెళ్లిపోయింది.

చాలా రోజులు గడిచిపోయాయి. తనను కాపాడిన పావురాన్ని కలుద్దామని చీమ పావురం వద్దకు బయలుదేరింది. అంతలో అటువైపుగా వస్తున్న వేటగాడు దానికి కనిపించాడు. అతడు పక్షులు,




జంతువుల కోసం నాలుగు వైపులా గాలించడం చీమ చూసింది. చెట్టుపై పాటపాడుకుంటున్న పావురంపై వేటగాడి దృష్టి పడింది. కానీ, పావురం అతడిని గమనించలేదు. తన మానాన తాను పాటలు పాడుకుంటోంది. వేటగాడి విషయం పావురానికి ఎలా తెలియజేయాలో చీమకు అర్థం కాలేదు. ఇంతలో వేటగాడు ఓ బాణం తీసి పావురం వైపు గురిపెట్టాడు. సరిగ్గా బాణం వదిలే సమయానికి అతడి పాదంపై గట్టిగా కుట్టింది చీమ. దాంతో అతడి గురి తప్పి బాణం పావురం పక్కనుంచే వెళ్లి ఓ చెట్టుకు తగిలింది. దాంతో చెట్టుపై ఉన్న పక్షులు ఎగిరిపోయాయి. ఈ అలజడిని గమనించి ఏ జరిగిందా అని చూసిన పావురానికి 'పాడు చీమ... సరిగ్గా ఇప్పుడే కుట్టి నా గురి తప్పించింది' అంటూ వేటగాడు కిందికి చూడటం కనిపించింది. విషయం తెలుసుకుని వెంటనే అక్కడి నుంచి తప్పించుకుంది.

ఆ తరవాత చీమను కలిసి 'ఈ రోజు నువ్వే గనక సమయానికి రాకపోతే నేను బతికేదాన్ని కాదు' అని కృతజ్ఞతలు చెప్పింది.

'నాకు ప్రాణభిక్ష పెట్టిన నీకు ఉపకారం చేయడంలో గొప్పతనం ఏముంది. ఆ రోజు నేనెవరో తెలియకపోయినా నువ్వు నా ప్రాణాలు కాపాడావు. నీకన్నా మంచివాళ్లు ఎవరుంటారు' అంది చీమ. అప్పటినుంచీ అవి రెండూ మంచి స్నేహితులుగా కలిసిమెలిసి ఉండేవి.

# పోటీ



ఒక అడవిలో రెండు కాకులుండేవి. అవి 'నేను గొప్పా అంటే కాదు నేనే గొప్ప' అనుకుంటూ రోజూ తగవులాడుకునేవి.

ఇలాకాదని ఓరోజు తగవు తీర్చమంటూ ఓ ముసలి కాకి దగ్గరకి వెళ్లాయి రెండూ.

'ఎందుకిలా వాదులాడుకుంటారు... మీ ఇద్దరూ తెలివైనవాళ్లే' అని సర్దిచెప్పే ప్రయత్నం చేసిందా ముసలికాకి.

'అలా ఎలా కుదురుతుంది. నేనే దీనికంటే తెలివైనదాన్ని' మొదటికాకి అంది.

'కాదు, నేనే...' రెండోదీ వాదించింది.

'ష్... ఆపండి మీ గోల. మీ ఇద్దరికీ ఓ పోటీ పెడతాను. అందులో ఎవరు నెగ్గితే వాళ్లే తెలివైనవారని ఒప్పుకోవాలి' అంది ముసలికాకి.

'ఏమిటూ పోటీ' అడిగాయి అవి రెండూ.




'మీ ఇద్దరూ రెండు సమానమైన మూటల్ని తెచ్చుకోండి. వాటిని నోట కరచుకుని ఆకాశంలో ఎగరాలి. ఎక్కువ ఎత్తుకు ఎవరు ఎగిరితే వారే విజేత. అసలే ఇది వర్షాకాలం. మూటలు తెచ్చుకునే ముందు ఆ మాట మాత్రం మరచిపోకండి' చెప్పింది ముసలి కాకి.

'సరే'నన్నాయి రెండు కాకులు.

ఆ మరునాడు ఈ రెండూ మూటల్ని పట్టుకుని ముసలికాకి దగ్గరకి వచ్చాయి. అప్పటికే ఆకాశం బాగా మబ్బు పట్టిఉంది. పోటీని ప్రారంభించింది ముసలికాకి. రెండూ మూటల్ని పట్టుకుని రివ్వున పైకెగిరాయి.

కాసేపటికి వర్షం మొదలైంది. అయినా ఈ కాకులు సమాన ఎత్తులో ఎగురుతూనే ఉన్నాయి.

ఇంకాసేపటికి వర్షం హోరు పెరిగింది. మొదటికాకి తెలివిగా తన మూటలో ఉప్పు నింపి తెచ్చుకుంది. అది వర్షానికి కరిగి కొంచెం కొంచెంగా బరువు తగ్గసాగింది.

రెండోది తన మూటలో దూది తెచ్చుకుంది. అది వర్షానికి మరింత బరువెక్కింది. ఆ బరువు ఓపలేక నెమ్మదిగా నేలపై పడిపోయిందా కాకి.

వర్షాకాలమని ముసలికాకి ఎందుకు హెచ్చరించిందా అని ఆలోచించి తెలివిగా ఉప్పుమూటను తెచ్చుకున్న మొదటికాకి విజేతగా నిలిచింది. పెద్దవాళ్ల మాటల్లో ఏదో ఒక అంతరార్థముంటుందని గ్రహించక, ఆ మాటలను చాదస్తపు సలహాగా కొట్టిపారేసిన రెండో కాకి ఓటమిని ఒప్పుకుని వెళ్లిపోయింది.

# స్వేచ్ఛ



రమేష్‌కు పక్షులంటే ఇష్టం. అందుకని అతడి పుట్టినరోజు కానుకగా వాళ్ల నాన్న చిలుకను తెచ్చి కానుకగా ఇచ్చారు. దాన్ని పంజరంలో పెట్టి రోజూ ఆడుకునేవాడు రమేష్. జామ, అరటి, మామిడి పళ్లను తెచ్చి పెట్టేవాడు. చిలుక చాలాసార్లు వాటిని తినకుండానే ఉండిపోయేది. 'చిలుకలకు పళ్లంటే ఇష్టం కానీ నా చిట్టి చిలుక ఏమీ తినడం లేదు ఎందుకో' అని చింతించేవాడు రమేష్.

ఓరోజు పొద్దునే బడికి వెళ్లిన రమేష్ సాయంత్రానికి ఇంటికి చేరలేదు. దాంతో ఇంట్లో అమ్మానాన్నా ఆందోళన చెందారు. రమేష్ కోసం వాళ్ల నాన్న అతడి బడికి వెళ్లారు. ఆ సమయానికి వాచ్‌మన్ మాత్రమే బడిలో ఉన్నాడు. వాచ్‌మన్‌తో విషయం చెప్పి అతన్ని తీసుకొని రమేష్ తరగతి గది వైపు ఇద్దరూ వెళ్లారు. గది లోపల నుంచి ఏదో శబ్దాలు వినిపించాయి వారికి. వాచ్‌మన్ తలుపు తీసేసరికి భోరున ఏడుస్తూ బయటకు వచ్చాడు రమేష్. 'బ్యాగ్‌లో ఒక పుస్తకం కనిపించలేదు. బెంచీల కింద పడిపోయిందేమోనని వెతుకుతుంటే వాచ్‌మన్ తలుపు వేసుకొని వెళ్లిపోయాడు' అని తండ్రికి చెప్పాడు రమేష్.

అమ్మానాన్నా, స్నేహితులూ ఎవరూ లేకుండా గదిలో బందీగా ఉండటం ఎంత కష్టమో తెలుసుకున్న రమేష్, ఇంటికి రాగానే పంజరంలోని రామ చిలుకను విడిచిపెట్టాడు. అప్పట్నుంచీ 'పక్షుల్ని బంధించకూడ'దంటూ స్నేహితులకూ చెప్పసాగాడు.

కథ

# ముందుచూపు




ఒక అడవిలో ఒక పెద్ద మర్రిచెట్టు ఉండేది. అందులో రకరకాల పక్షులు నివసించేవి. వాటికి ఒక తెలివైన పక్షి నాయకుడిగా ఉండేది. ఒకరోజు అది పక్కనున్న రెండు చెట్లు ఒకదానికొకటి రుద్దుకొని పొగ రావడం గమనించింది. తన గుంపులో ఉన్న మిగతా పక్షులతో ''ఈ అడవిలో కారుచిచ్చు మొదలయ్యే ప్రమాదం ఉంది. మనం ఇక్కడి నుండి వెంటనే వేరే ప్రదేశానికి వెళ్లిపోవడం శ్రేయస్కరం'' అని చెప్పింది. కొన్ని పక్షులు దానికి ఒప్పుకున్నాయి. కాని కొన్ని పక్షులు ''మన నాయకుడికి చాదస్తం ఎక్కువ. గోరంత దాన్ని కొండంత చేస్తాడు'' అని నాయకుడు చెప్పిన మాటలను అశ్రద్ధ చేశాయి.

అడవిలో చెట్టుకు చెట్టు రుద్దుకొని చిచ్చు పుట్టింది. ఆ చిచ్చు ఎండిపోయిన ఆకుల మీద పడి నిప్పంటుకుంది. అలా మొదలైన నిప్పు అడవిలోని కొంత ప్రాంతాన్ని కాల్చేసింది. ముందుచూపుగా నాయకుని మాట విని తప్పించుకున్న పక్షులు ప్రాణాలను కాపాడుకున్నాయి. అదే ఆకతాయిగా నాయకుని మాటలను అశ్రద్ధ చేసిన పక్షులు ఆ కారుచిచ్చులో తమ రెక్కలను కాల్చుకున్నాయి.

## చాతకపక్షి దీక్ష - పెద్దలు చెప్పిన నీతికథ

అది గ్రీష్మం. సూర్యుడు నడినెత్తిన ఉండి రీవిగా తన ప్రతాపాన్ని చూపిస్తున్నాడు. పిల్ల పక్షులతో ఒక తల్లి చాతకం గగనతలంలో ఎగురుతోంది. పసి చాతకాలు వేడిమికి తాళలేకపోతున్నాయి. తల్లి చాతకం నెలవు కోసం గాలిస్తోంది. నేల పై ఒక పెద్ద మఱ్ఱి వృక్షం కనబడింది. దాని వేరు బొఱియలలో ఎలుకల చీమల పుట్టలు. తొఱ్ఱలలో పాములు. కొమ్మలు రెమ్మలు ఆశ్రయించి వందలాది పక్షులు. నేలమీదనున్న ఒక వృక్షమే ఇన్ని వేల ప్రాణులకు ఆశ్రయం ఇస్తే ఇక సాధన దీక్ష లక్ష్యం ఉన్న ఓ సజ్జనుడు ఎన్ని జీవులను తరింపచేయగలడు!

సామాజిక విలువ తెలిసో లేక సహజీవనం అనివార్యం అని గ్రహించో ఏమో ఆ వృక్షాన్ని కాపురమున్న పక్షి జంట పిల్లలు తమ తల్లితో "అయ్యో పాపం! వాటికి ఇల్లులేదే" అన్నాయి. "ఇన్నాళ్ళకికదా మా జీవనం సార్ధకమైనది. మేము పెంచిన పిల్లలు ఎదుటివారి కష్టాన్ని గుర్తించాయి" అన్న ఆనందంతో ఆ పక్షి జంట ఆ చాతక పక్షులను ఆహ్వానించాయి.

ఆశ్రయం కోసం వెతుకుతున్న చాతకాలకి ఆ ఆహ్వానం పరమానందాన్ని కలిగించింది. కాని ధీరులు సర్వకాల సర్వావస్థలయందు తమ స్వాభావిక సద్గుణాలను విడిచిపెట్టరు. "ఈ వృక్షం మొదటి స్వాతి వాన చినుకులతోనేనా పుట్టినది?" అని అడిగి కాదు అని తెలుసుకొని ముందుకుసాగిపోతున్న ఆ చాతకాల దీక్ష చూసి విభ్రాంతిచెంది "ఔరా!" అని ముక్కున వ్రేలిడికొని చూశారా పిల్లలూ దీక్షా రూపం అని కళ్ళతోనే సైగచేసి బోధించింది తల్లి పక్షి పిల్లలకు.

**పిల్లలూ! మనం ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దామ్:**

చాతక పక్షులు మనకి దీక్ష సాధన యొక్క ప్రాముఖ్యతను చూపినాయి. చాతక పక్షులు వాన చినుకులు తప్ప ఎంత దాహమేసినా ఇంకేవీ త్రాగవు. ఈ స్వాభావిక గుణాన్ని విడువక కథలోని చాతకం కూడా మొదటి వాన చినుకులతో మొలకెత్తిన వృక్షం పైనే ఉండాలనుకున్నది.

హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చన్ద్రం చకోరస్తథా |
చేతో వాంఛతి మామకం పశుపతే చిన్మార్గమృగ్యం విభో
గౌరీనాథ భవత్పదాబ్జయుగళం కైవల్యసౌఖ్యప్రదం ||

జగద్గురువులైన ఆది శంకరాచార్యులు ఒక భక్తుడు శివసాన్నిధ్యం చేరటానికి పడే ఆరాటాన్ని అద్భుతమైన ఉదాహరణలతో వివరిస్తున్నాడు. హంస తామర తూళ్ళనే తింటుంది. అందుకనే పద్మాలతో నిండి ఉన్న సరోవరాలకై పరితపిస్తుంది. చాతక పక్షులు వాన చినుకులను మాత్రమే త్రాగుతుంది. అందుకే ఘనమేఘాలకై ఎదురుచూస్తుంది. చక్రవాక పక్షి జంటలు ప్రొద్దులలో జంటగా ఉంటాయి. రాత్రిళ్ళు విరహవేదనను అనుభవిస్తాయి. అందుకని చక్రవాకాలు సూర్యోదయానికై నిరీక్షిస్తాయి. చకోర పక్షులకి కేవలం వెన్నెల ఆహారం. అందుకని చకోరాలు చంద్రోదయానికై పరితపిస్తాయి. అలాగే నిజమైన భక్తుడు కూడా మోక్ష సాధనాలైన పరమేశ్వరుని పాదాలను చేరాలని పరితపిస్తుంటాడు. అన్యములేవీ అతనికి అక్కరలేదు!

పుత్రోత్సాహం తల్లితండ్రులకు తమ పిల్లలు నలుగురికీ ఉపయోగపడ్డప్పుడు కాని పుట్టినప్పుడు కలుగదు అన్న సూక్తిని గుర్తుచేశాయి పక్షులు. తమ పిల్లలు ఎదుటివారి కష్టాలని చూసి "అయ్యో పాపం!" అని జాలిచూపినప్పుడు ఆ తల్లిదండ్రులు ఆనందించారు.

# పుస్తక సమీక్ష

## నిర్మాణాత్మక మూల్యాంకనము

| నెం : | పేరు : | క్లాసు : | సెక్షన్ : |
| --- | --- | --- | --- |

1. పుస్తకం పేరు :
2. రచయిత పేరు :
3. మొత్తం పేజీలు :
4. వెల / ధర :
5. ప్రచురణ కర్త / పబ్లిక్షర్ :
6. పీఠికలో (ముందు పేజీలలో కొందరు - వారి అభిప్రాయాలు ) :
7. పుస్తకంలో విషయం – సంగ్రహంగా :
8. పుస్తకంపై నా అభిప్రాయం :

**32. గణతంత్ర దినోత్సవ లేఖ (రిపబ్లిక్ దినోత్సవ లేఖ) :** **(మార్చి 2004)**

భద్రాచలం,
30-1-2012.

ప్రియమైన నాన్నగారికి నమస్కారాలు.
ఉభయకుశలోపరి.

గడచిన జనవరి 26న మా పాఠశాలలో రిపబ్లిక్ దినోత్సవ వేడుకలు బ్రహ్మాండంగా జరిగాయి. మా జిల్లా విద్యాశాఖాధికారిని ముఖ్యఅతిథిగా ఆహ్వానించాం. ఈ రోజు ఉదయం గం. 8-00 లకు ముఖ్యఅతిథిగారిచే జాతీయ పతాకావిష్కరణ కావించబడింది. రిపబ్లిక్ దినోత్సవ ప్రాముఖ్యాన్ని గురించి ముఖ్యఅతిథిగారు చక్కని సందేశమిచ్చారు. కొందరు ఉపాధ్యాయులు, విద్యార్థులు కూడా ఆ రోజు గొప్పతనాన్ని గురించి ఉపన్యాసమిచ్చారు. రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా నిర్వహించిన పోటీలలో గెలుపొందిన విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టబడ్డాయి. తరువాత విద్యార్థులకు స్వీట్లు పంచిపెట్టబడ్డాయి.

'జనగణమన' జాతీయ గీతంతో నాటి కార్యక్రమం ముగిసింది. అమ్మగారికి నా నమస్కారములు.

ఇట్లు
మీ కుమారుడు,
ఆనందకుమార్.

**చిరునామా :**
శ్రీ ఆర్. శ్రీహరిగారు,
డోర్ నెం. 4-8-72,
హైస్కూల్ రోడ్, దానవాయిపేట,
రాజమండ్రి, తూర్పుగోదావరి జిల్లా.

---

**33. గ్రామసమస్యను గూర్చి పత్రికా సంపాదకునకు లేఖ :**

'ఆంధ్రజ్యోతి' సంపాదకులకు,
అమలాపురం వాస్తవ్యుడు వ్రాసికొను విన్నపం,

ఆర్యా,

మా అమలాపురంలోని మెయిన్ బజారు చాలా ఇరుకుగా ఉంది. సాయంకాలం పూట ఆ బజారులో నడచివెళ్ళటానికే చాలా కష్టంగా ఉంటుంది. ఇక వాహనాలు నడిపేవారి బాధలు అంతా ఇంతా కాదు.

రోడ్డుపైనే లారీలు, రిక్షాలు ఆపడంవల్ల, రోడ్డుపైనే పూలకొట్లు, పండ్లకొట్లు, బడ్డీకొట్లు ఏర్పాటుచేయడంవల్ల రద్దీగా ఉంటుంది. దీనికితోడు రోడ్డుపైనే పశువులు సంచరించడం, విశ్రాంతి తీసుకోవడంకూడా జరుగుతుంది. ట్రాఫిక్ సమస్యతో నిత్యం బాధపడుతున్నాం. కాబట్టి మా యీ సమస్యను మీ పత్రికాముఖంగా ప్రచురించి సంబంధిత అధికారులకు తెలిసేటట్లు చేయవలసినదిగా కోరుతున్నాను.

ఇట్లు
తమ విధేయుడు,
XXXXX

**చిరునామా :**
సంపాదకుడు,
'ఆంధ్రజ్యోతి' దినపత్రిక,
లబ్బీపేట, విజయవాడ,
కృష్ణా జిల్లా.

**34. వ్యాయామశాల స్థాపనకై పత్రికా సంపాదకునకు లేఖ :** **(మార్చి 2004)**

'ఆంధ్రజ్యోతి' సంపాదకులకు,

నందిగామ గ్రామ నివాసి వ్రాయు విన్నపం -

ఆర్యా,

మానవుని మనుగడకు ఆహారం ఎంత అవసరమో వ్యాయామం కూడా అంతే అవసరం. శరీర ఆరోగ్యం బాగా ఉండాలంటే అందరూ తప్పక వ్యాయామం చేయాల్సిందే.

కుస్తీలు పట్టుట, బస్కీలు, దండెములు తీయుట, బరువైన వస్తువులు పైకెత్తుట మొదలైన వ్యాయామ సాధనకు ఒక వ్యాయామ శాల ఉంటే అందరికీ అనుకూలంగా ఉంటుంది.

'ఆరోగ్యమే మహాభాగ్యం' అన్నారు కదా ! అలాంటి ఆరోగ్యానికి మూలం శరీర వ్యాయామం. ఈ వ్యాయామం చేయటానికి మా గ్రామంలో ఒక వ్యాయామశాలను ప్రభుత్వం స్థాపించే విధంగా తమ పత్రికాముఖంగా సహకరించవలసిందిగా కోరుతున్నాను.

ఇట్లు
తమ విధేయుడు,
హరి బుచ్చికోటయ్య.

**చిరునామా :**
సంపాదకుడు,
'ఆంధ్రజ్యోతి' దినపత్రిక,
పటమట, విజయవాడ - 10,
కృష్ణా జిల్లా.

**35. పాఠశాలలో జరిగిన క్రీడోత్సవాలను గురించి మిత్రునకు లేఖ (ఆటల పోటీలు) :** **(మే 2004)**

అనంతపురం,
10-10-2011.

ప్రియమిత్రుడు రాజేష్‌కు,

నేను క్షేమంగా ఉన్నాను. నీవుకూడా క్షేమంగా ఉన్నావని తలుస్తాను. ఈ లేఖలో మా పాఠశాలలో జరిగిన క్రీడోత్సవాలను గురించి తెలియజేస్తున్నాను.

గడచిన బుధవారం మా పాఠశాలలో జిల్లాస్థాయి క్రీడోత్సవాలు బ్రహ్మాండంగా జరిగాయి. ఈ క్రోడోత్సవాలలో జిల్లా నాల్గు మూలల నుండి వచ్చిన విద్యార్థులు పాల్గొన్నారు. మా జిల్లాధికారి ఈ ఉత్సవాలను ప్రారంభించారు. కబాడి, ఖోఖో, వాలీబాల్, ఫుట్‌బాల్, బాస్కెట్‌బాల్ మొదలైన ఆటల పోటీలు రెండురోజులపాటు జరిగాయి. మా పాఠశాల జట్టు బాస్కెట్‌బాల్ పోటీలో పాల్గొని విజయం సాధించింది. మీ పాఠశాలలో జరిగిన ఆటల పోటీలను గురించి తెలియజేయవలసిందిగా కోరుతున్నాను.

ఇట్లు
నీ ప్రియమిత్రుడు,
కోట రవికుమార్.

**చిరునామా :**
పి. రాజేష్,
10వ తరగతి,
సెంట్రల్ పబ్లిక్ స్కూల్,
వరంగల్, వరంగల్ జిల్లా.

***36. మీ గ్రామానికి కావలసిన సౌకర్యములను కల్పించమని ముఖ్యమంత్రిగారికి లేఖ వ్రాయుము. (మే 2004)***

జగన్నాథపురం,
10-3-2012.

గౌరవనీయులైన
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగారి దివ్యసముఖమునకు,
ఆర్యా,

నమస్కారములు. మాది తూర్పుగోదావరి జిల్లా, తుని మండలంలోని జగన్నాథపురం అనే గ్రామం. మా గ్రామ ప్రజలు వివిధ సమస్యలతో సతమతమవుతున్నారు. వాటిని ఈ లేఖద్వారా తమ దృష్టికి తీసుకొని వస్తున్నాను.

ప్రజలు త్రాగునీరు అందక అల్లాడిపోతున్నారు. రైతులు సాగునీరు లేక దిక్కుతోచని స్థితిలో ఉన్నారు. మా గ్రామంలో ఉన్నత పాఠశాల లేకపోవడం చేత పేద విద్యార్థులు పట్నానికి వెళ్ళి చదువుకోలేక మధ్యలోనే చదువు మానేస్తున్నారు. కాబట్టి మా గ్రామానికి త్రాగునీరు, సాగునీరు ఏర్పాటుతో పాటు, ఉన్నత పాఠశాల సౌకర్యాన్ని కూడా కల్పించాల్సిందిగా మనవి చేసుకొంటున్నాను.

ఇట్లు
తమ విధేయుడు,
ఐ.వి. గణేష్ కుమార్.

**చిరునామా :**
గౌ॥ ముఖ్యమంత్రి గారికి,
ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్ - 500001.

***37. మీ ప్రాంతంలోని రోడ్ల దుస్థితిని వివరిస్తూ పత్రికా సంపాదకునకు లేఖ వ్రాయుము.***

మొగులూరు,
20-3-2012.

'ఈనాడు' సంపాదకునకు,
మొగులూరు గ్రామనివాసి వ్రాసికొను విన్నపం,
ఆర్యా,

మాది కృష్ణాజిల్లా కంచికచర్ల మండలంలోని మొగులూరు గ్రామం. మా గ్రామంలోని రోడ్ల దుస్థితి అంతా ఇంతా కాదు. అందువల్ల మేము పడుతున్న బాధలు వర్ణించడానికి వీలులేనిది.

రోడ్లన్నీ చాలా ఇరుకుగా ఉన్నాయి. దానికి తోడు రోడ్లన్నీ గోతుల మయంగా తయారయ్యాయి. కనీసం మెయిన్ బజారు రోడ్డు కూడా వాహనాల రాకపోకలకు అనుకూలంగా లేదు. వాహన చోదకులు నానా బాధలు పడుతున్నారు. రోడ్లపై చెత్తా చెదారం వేయడం వల్ల ఈగలు ముసిరి ప్రజలు అనారోగ్యం పాలవుతున్నారు. సైడు కాలువలు లేకపోవడం చేత మురుగునీరు రోడ్లపైకి ప్రవహించి దోమలకు నిలయంగా తయారయ్యాయి. ఆ దోమల బాధ వల్ల రాత్రిళ్ళు నిద్రపట్టక పిల్లలు, పెద్దలు దిక్కుతోచని స్థితిలో ఉన్నారు. కాబట్టి మా యీ సమస్యను తమ పత్రికలో ప్రచురించి సంబంధిత అధికారులకు తెలియ జేయవలసినదిగా కోరుతున్నాను.

ఇట్లు
తమ విధేయుడు,
హరి ఆంజనేయ అభిషేక్.

**చిరునామా :**
సంపాదకుడు,
'ఈనాడు' దినపత్రిక, పటమట లంక,
విజయవాడ, కృష్ణా జిల్లా.

**38. నీవు చూసిన నదీ పుష్కర విశేషాలను గూర్చి నీ మిత్రుడికి ఒక లేఖ రాయండి.** **(జూన్ 2005)**

జగ్గయ్యపేట,
10-9-2011.

ప్రియమిత్రురాలు అంజనకు,

నేను క్షేమంగా ఉన్నాను. నీవు కూడా క్షేమంగా ఉన్నావని తలుస్తాను. ఈ లేఖలో నేను చూసిన కృష్ణాపుష్కరాలను గురించి తెలియజేస్తున్నాను.

12 సంవత్సరాలకొకసారి కృష్ణాపుష్కరాలు వస్తాయి. ఆ సమయంలో కృష్ణానదిలో స్నానం చేయడం ఎంతో పుణ్యమని ప్రజల నమ్మకం. అందువల్ల 28-8-2004 నుండి 8-9-2004 వరకు జరిగిన కృష్ణాపుష్కరాలు చూడటానికి నేను విజయవాడ వెళ్ళాను. ఆ 12 రోజులు కృష్ణానదీ తీరమంతా శోభాయమానంగా విలసిల్లింది.

పుష్కరాలు మన సంస్కృతికి, సాంప్రదాయానికి, ఆచారవ్యవహారాలకు, మన పితృదేవతల పట్ల మనకున్న విశ్వాసానికి నిదర్శనం. రాష్ట్రం నలుమూలల నుండి పుష్కర స్నానాలు చేయడానికి ఎందరో భక్తులు విజయవాడ వచ్చారు. ప్రభుత్వం భక్తులకు ఏ విధమైన ఇబ్బంది లేకుండా తగిన సౌకర్యాలు చేసింది. వివిధ స్వచ్ఛంద సేవా సంస్థలవారు కూడా వచ్చిన యాత్రికులకు తమ సేవలను అందించారు. భక్తుల కోసం ఏర్పాటు చేసిన స్నానఘట్టాలు చూడముచ్చటగా ఉన్నాయి. నేను దుర్గాఘాట్‌లో స్నానమాచరించాను. నీవు కూడా పుష్కరాలకు ఎక్కడికైనా వెళ్ళి ఉంటే విశేషాలు తెలియజేయి.

ఇట్లు,
నీ మిత్రురాలు,
గార్లపాటి తేజస్వి.

చిరునామా :
హరి అంజన, D/o హరి బాలాశంకర్,
గొల్లపూడి, కృష్ణా జిల్లా, పిన్ – 521225.

**39. మీరు ఇష్టపడే నాటకాన్ని గురించి మీ సోదరికి ఒక లేఖ రాయండి.** **(జూన్ 2005)**

జగన్నాథపురం,
12-3-2012.

ప్రియమైన సోదరీమణికి,

నమస్కరించి మీ చెల్లెలు బాలచాముండి వ్రాయునది.

నేను ఇక్కడ క్షేమంగా ఉన్నాను. మీరందరు అక్కడ క్షేమమని తలుస్తాను. నాకు నాటకాలు చూడటమంటే చాలా సరదా. ఎన్నో నాటకాలు చూశాను. అందులో నాకు నచ్చినది, నేను ఇష్టపడే నాటకాన్ని గురించి ఈ లేఖలో తెలియజేస్తున్నాను.

'సత్యహరిశ్చంద్ర' నాటకం అంటే నాకు చాలా ఇష్టం. దాన్ని బలిజేపల్లి లక్ష్మీకాంత కవి రచించాడు. అందులో చంద్రమతీ హరిశ్చంద్రుల పవిత్రగాథ ఉంది. నీతి ప్రధానంగానూ, కరుణరస భరితంగానూ మలచబడిన ఉత్తమ నాటకం అది.

సత్యతత్పరత, శీలసౌష్ఠవం, ఆపదలలో ధైర్యం వహించడం వంటి గుణాలు ఈ నాటకంలో బోధించబడ్డాయి. అందువల్ల 'సత్యహరిశ్చంద్ర' నాటకం అంటే నాకు ఎంతో ఇష్టం. పెద్దలందరికీ నా నమస్కారాలు. పిల్లలకు నా ఆశీస్సులు.

ఇట్లు,
మీ ప్రియమైన చెల్లెలు,
ఐ. బాలచాముండి.

చిరునామా :
శ్రీమతి జి. అన్నపూర్ణ, W/o జి. లక్ష్మీనారాయణ గారు,
మోగులూరు, కంచికచర్ల మండలం, కృష్ణా జిల్లా.

**40. వేసవి సెలవులను గడిపే విధానాన్ని గురించి మిత్రునికి లేఖ.** **(మార్చి 2007)**

సంగారెడ్డి,
16-3-2012.

ప్రియమిత్రుడు ఆనంద్‌కు,

నేను పబ్లిక్ పరీక్షలు బాగానే రాస్తున్నాను. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడను కావాలనే పట్టుదలతో బాగా చదివి పరీక్షలు ఎంతో శ్రద్ధగా రాస్తున్నాను.

పరీక్షలు అయిపోయిన తరువాత వేసవి సెలవులలో నేను కంప్యూటర్ విద్య నేర్చుకోవాలనుకొంటున్నాను. ఇంటర్మీడియట్‌లో కూడా నేను కంప్యూటర్ కోర్సు చదువతలచాను. అందువల్ల సెలవులు వృథా కాకుండా కంప్యూటర్ నేర్చుకోదలచాను. భవిష్యత్తులో కంప్యూటర్ ఇంజనీరు కావాలనేది నా ఆకాంక్ష. అందుకు ఎంతైనా శ్రమపడి చదవాలనుకొంటున్నాను. దీనికి తోడు ఇంగ్లీషు గ్రామర్ నేర్పే 'కోచింగ్ సెంటర్'లో చేరి ఇంగ్లీషు భాషపై పట్టు సాధించాలనుకొంటున్నాను. ఈ విధంగా వేసవి సెలవులను సద్వినియోగం చేసుకోవాలనుకొంటున్నాను. నీ అభిప్రాయాన్ని తెలియజేయాల్సిందిగా కోరుతున్నాను.

ఇట్లు,
నీ మిత్రుడు,
చంద్రకాంత్.

చిరునామా :
పి. ఆనంద్, 10వ తరగతి, విజ్ఞానభారతి విద్యాలయం,
విజయనగరం – 531202.

**41. నీ మాతృదేశ గొప్పదనాన్ని వివరిస్తూ విదేశాలలో వున్న మిత్రునికి లేఖ :** **(మార్చి 2010, జూన్ 2008)**

ఒంగోలు,
15-3-2012.

ప్రియ కలం స్నేహితుడు జాన్ డేవిడ్ పాల్‌కు,

నేను క్షేమంగా ఉన్నాను. నీవు కూడా క్షేమంగా ఉన్నావని తలుస్తాను. నేను ఈ లేఖలో మా మాతృదేశమైన భారతదేశ విశేషాలు తెలియజేస్తున్నాను.

ఆసియా ఖండంలోగల పెద్ద దేశాలలో భారతదేశం ఒకటి. దీనినే 'ఇండియా' అని పిలుస్తారు. మా భారతదేశానికి ఉత్తరాన హిమాలయాలు, తూర్పున బంగాళాఖాతం, దక్షిణాన హిందూ మహాసముద్రం, పశ్చిమాన అరేబియా సముద్రం ఎల్లలుగా ఉన్నాయి. మా దేశంలో సింధు, గంగ, యమున, కృష్ణ, గోదావరి వంటి జీవనదులెన్నో ఉన్నాయి.

భారతదేశంలో వివిధ జాతులవారు, మతాలవారు ఉన్నారు. 'భిన్నత్వంలో ఏకత్వం' అనటానికి మా దేశాన్ని ఉదాహరణగా చెప్పుకోవచ్చు. సత్యం, అహింసయే ఆయుధాలుగా భావించెడి దేశం మాది. సర్వమానవులను సౌభ్రాతృత్వ దృష్టితో చూస్తూ అందరి సుఖశాంతులను కాంక్షించేదే మా భారతదేశం.

ఇట్లు
నీ కలం స్నేహితుడు,
డి. వి. శ్యామ్‌సుందర్.

**చిరునామా :**
జాన్ డేవిడ్ పాల్, డోర్ నెం. 4/159,
కెనడీ రోడ్, వాషింగ్‌టన్, అమెరికా.



**42. దొంగిలించబడిన మోటారు సైకిల్ గురించి ఎస్. ఐ గారికి లేఖ :** **(జూన్ 2008)**

జగ్గయ్యపేట,
10-3-2012.

స్టేషన్ హౌసు ఆఫీసరు (ఎస్.ఐ) గారికి
పోలీసుస్టేషను, జగ్గయ్యపేట.

ఆర్యా,

నేను వెంకటేశ్వర టాకీస్ సమీపంలో నివసిస్తున్నాను. నేను నిన్న మున్సిపల్ ఆఫీసులో ఇంటిపన్ను కట్టే నిమిత్తం మోటారు సైకిల్‌పై వెళ్ళాను. నా మోటారు సైకిల్ మున్సిపల్ ఆఫీసు ముందు ఉంచి ఆఫీసులోకి వెళ్లాను. ఇంటి పన్ను కట్టి తిరిగి వచ్చి చూసేసరికి నా మోటారు సైకిల్ కనిపించలేదు.

నా మోటారు సైకిల్ రిజిస్ట్రేషన్ నెం. A.P. 16Q. 3637. ఛాసిస్ నెం. P 1103 F 502 306, ఇంజన్ నెం. P 1103 M532453. దయతో నా మోటారు సైకిలును గూర్చి దర్యాప్తు చేసి నాకు దానిని అప్పచెప్పవలసిందిగా కోరుచున్నాను.

ఇట్లు
కొండూరు శివరామప్రసాద్,
వెంకటేశ్వర టాకీస్ దగ్గర,
జగ్గయ్యపేట, కృష్ణాజిల్లా - 521175.

**చిరునామా :**
స్టేషన్ హౌస్ ఆఫీసర్ (ఎస్.ఐ), పోలీస్ స్టేషన్
జగ్గయ్యపేట - 521 175, కృష్ణా జిల్లా.



**43. ఇంటర్‌లో చేరుటకు ప్రిన్సిపాల్‌గారికి దరఖాస్తు చేయండి.**

కంకిపాడు,
28-6-2012.

ప్రిన్సిపాల్,
గవర్నమెంట్ జూనియర్ కాలేజి, ఆకునూరు.

ఆర్యా,

డి. సతీష్ అనే నేను కంకిపాడు జిల్లాపరిషత్ హైస్కూలులో 10వ తరగతి చదివాను. గడచిన మార్చి నెలలో జరిగిన 10వ తరగతి పబ్లిక్ పరీక్షలలో నాకు 600కి 540 మార్కులు వచ్చాయి. నేను తమ కళాశాలలో చేరి ఇంటర్మీడియేట్ చదవాలనుకుంటున్నాను. కాబట్టి నాకు తమ కళాశాలలో జూనియర్ ఇంటర్ యం.పి.సి. గ్రూపు చదువుకొనే అవకాశం కల్పించవలసినదిగా ప్రార్థించుచున్నాను.

ఈ దరఖాస్తుతోపాటు అవసరమైన అన్ని సర్టిఫికెట్లు ఫోటోస్టాట్ కాపీలను జతపరచి పంపుచున్నాను. తమ అనుమతి పత్రం కోసం ఎదురు చూస్తూ ఉంటాను.

ఇట్లు
తమ విధేయుడు,
డి. సతీష్
S/o నారాయణ,
కంకిపాడు, కృష్ణాజిల్లా.

**చిరునామా :**
ప్రిన్సిపాల్,
గవర్నమెంట్ జూనియర్‌కాలేజి,
ఆకునూరు, కృష్ణాజిల్లా.



**44. 'పల్లెవెలుగు' పేరుతో గల బస్సులు పల్లెలకు రావడం లేదని సంబంధిత అధికారికి లేఖ.**

తాళ్ళచెరువు,
28-3-2012.

ఆర్.టి.సి. జనరల్ మేనేజర్‌గారికి,

తాళ్ళచెరువు నివాసియైన శిరిపురపు శ్రీనివాస్ వ్రాయు విన్నపం.

అయ్యా,

మాది గుంటూరు జిల్లా అచ్చెంపేట మండలంలోని తాళ్ళచెరువు అనే గ్రామం. మా గ్రామ జనాభా ఎనిమిది వందలు. ఇచ్చటి ప్రజలు నిత్యావసర సరుకులు తెచ్చుకోవాలంటే అచ్చెంపేట వెళ్ళాలి. విద్యార్థులు చదువుకోవాలన్నా అచ్చెంపేట వెళ్ళాల్సిందే. పిల్లలు, పెద్దలు, విద్యార్థులు అందరూ కూడా మండల కేంద్రమైన అచ్చెంపేట వెళ్ళటానికి, ఇతర వ్యవహారాలకై సత్తెనపల్లి వెళ్ళటానికి బస్సు సౌకర్యం లేక నానా బాధలు పడుతున్నారు.

ఆర్.టి.సి.వారు 'పల్లెవెలుగు' పేరుతో అనేక పల్లెలకు బస్సు సౌకర్యాన్ని కలిగించారు. కానీ మా పల్లెకు ఆ బస్సు రావడంలేదు. 'ప్రజాసేవయే కర్తవ్యంగా' భావించే మీరు 'పల్లెవెలుగు' బస్సు సౌకర్యాన్ని మా గ్రామానికి కూడా ఏర్పాటు చేయవలసినదిగా కోరుతున్నాను.

ఇట్లు
తమ విధేయుడు,
ఎస్. శ్రీనివాస్.

**చిరునామా :**
జనరల్ మేనేజర్,
ఏ.పి.యస్. ఆర్.టి.సి. ఆఫీసు,
గుంటూరు రేంజి, గుంటూరు.

**45. 'గ్రామానికి రోడ్డు సౌకర్యం కల్పించమని' కోరుతూ జిల్లా కలెక్టరుగారికి లేఖ : *(మార్చి 2011)***

పోపూరు,
15-3-2012.

కృష్ణా జిల్లా కలెక్టరు గారి
దివ్య సముఖమునకు –

అయ్యా,

మాది కృష్ణా జిల్లా నందిగామ తాలూకా పోపూరు గ్రామం. మా గ్రామ జనాభా 1500. ఇచ్చటి ప్రజలకు జీవనాధారం వ్యవసాయం. మా గ్రామ ప్రజలకు ఏది అవసరం వచ్చినా ఇక్కడికి 15 కి.మీ. దూరంలో గల నందిగామ వెళ్ళిరావాల్సిందే. నిత్యావసర సరుకులు కూడా మా ఊళ్ళో దొరకవు. విద్యార్థులు చదువుకోవాలన్నా నందిగామ వెళ్ళాల్సిందే.

ఎటువంటి వసతులు లేని మా గ్రామానికి కనీసం రోడ్డు సౌకర్యం కూడా లేదు. వర్షాకాలం వచ్చిందంటే మా బాధలు చెప్పడానికి వీలుండదు. సరైన రోడ్డు సౌకర్యం లేకపోవడంచేత మా గ్రామానికి బస్సులు కూడా రావు. కాబట్టి తమరు దయ యుంచి మా గ్రామం నుండి నందిగామ వరకు చక్కని రోడ్డు సౌకర్యాన్ని కల్పించాల్సిందిగా కోరుతున్నాను.

ఇట్లు
తమ విధేయుడు,
వి. మోహన్.

**చిరునామా :**
జిల్లా కలెక్టరు గారు,
జిల్లా కలెక్టరు కార్యాలయం,
మచిలీపట్నం, కృష్ణా జిల్లా.

**46. నిరక్షరాస్యత నిర్మూలనకు వేసుకున్న ప్రణాళికను వివరిస్తూ మిత్రునకు లేఖ : (మార్చి 2011)**

సత్యనారాయణపురం,
15-3-2012.

ప్రియ మిత్రురాలు పద్మకు,

నేను బాగా చదువుతున్నాను. నీవు కూడా బాగా చదువుతున్నావని తలుస్తాను. నేను ఈ లేఖలో నిరక్షరాస్యత నిర్మూలనకు వేసుకున్న ప్రణాళికను గురించి తెలియజేస్తున్నాను.

పిల్లలందరిని పాఠశాలలో చేర్పించే కార్యక్రమం చేపట్టాలి. బాల కార్మికులను గుర్తించి వారిని కూడా బడిలో చేర్పించాలి. నిరక్షరాస్యులైన వయోజనులను ప్రోత్సహించిన చదువు నేర్చేటట్లు చేయాలి. కనీసం చదవడం, వ్రాయడం, లెక్కలు చూడటమైనా వచ్చేలా చేయాలి. పాఠ్య గ్రంథాలు అందమైన చిత్రాలతో ఆకర్షణీయంగా ఉండేలా చూడాలి. పాఠ్యగ్రంథాలను అందరికీ ఉచితంగా అందజేయాలి. గ్రామాలలో గ్రంథాలయాలు ఏర్పాటు చేయాలి. అవసరమైన చోట రాత్రి పాఠశాలలు నెలకొల్పాలి.

ఈ విధంగా నిరక్షరాస్యతా నిర్మూలనకు నేను కొన్ని ప్రణాళికలను వేసుకున్నానని తెలియజేయడానికి సంతోషిస్తున్నాను.

ఇట్లు
నీ ప్రియ మిత్రురాలు,
అగ్గరాజు శ్రీవిద్య.

**చిరునామా :**

జి. పద్మ, 10వ తరగతి,
శ్రీగీత కాన్వెంట్ హైస్కూల్,
నందిపేట్, నిజామాబాద్.

**47. ఒక మంచి సినిమా గురించి వివరిస్తూ సోదరికి లేఖ : (మార్చి 2011)**

నల్లగొండ,
15-3-2012.

ప్రియ సోదరి సుందరికి,

ఉభయకుశలోపరి. నేను ఈ మధ్య చాలా పాత కాలానికి చెందిన ఒక సినిమా చూశాను. ఇప్పుడు వస్తున్న సినిమాల కంటే ఆ పాత సినిమా నాకు బాగా నచ్చింది.

నేను 'భరణి పిక్చర్స్' వారి 'అంతా మన మంచికే' అనే సినిమా చూశాను. 'ఉత్తమ శీలం కలవారికే ఉత్తమ గతులు' అనే నీతిని బోధించే చక్కని ఇతివృత్తం గల సినిమా అది. ఆ సినిమాలో పద్మశ్రీ భానుమతి నటన అత్యద్భుతం. అవివాహితగ, గృహ యజమానురాలుగ, ఉద్యోగినిగ, సంఘ సంస్కర్తగ, గాయనీమణిగా నటించిన భానుమతి ప్రేక్షకుల ఆదరాభిమానాలు చూరగొన్నది.

కథాకల్పన, సన్నివేశాలు అత్యద్భుతం. ఇటువంటి మంచి చిత్రాలు నేటి కాలంలో కరువయ్యాయి.

ఇట్లు
నీ ప్రియ సోదరి,
వి. వల్లీ లావణ్య.

**చిరునామా :**

వి. బాలాత్రిపురసుందరి, 10వ తరగతి,
జెడ్.పి. హైస్కూల్, రేణిగుంట,
చిత్తూరు జిల్లా.

✦ ✧ ✦ ✧ ✦

# వ్యాసాలు

Q.No. 11 to 13 – 5 Marks

## పాటించాల్సిన నియమాలు

1. వ్యాసరచనకు ఇచ్చిన విషయాన్ని గురించి బాగా ఆలోచించి, రాయాల్సిన ముఖ్య విషయాలను దృష్టిలో ఉంచుకోవాలి.
2. సామాన్యంగా వ్యాసాన్ని ఎ) ఉపోద్ఘాతం బి) వ్యాసవిషయం సి) ఉపసంహారం అనే మూడు భాగాలుగా విభజించాలి.
3. ఉపోద్ఘాతం : వ్యాసము యొక్క శీర్షికను నిర్వచించాలి. ఆ శీర్షికయందలి భావాన్ని చక్కగా వాక్యాలలో తెలపాలి.
4. వ్యాసవిషయం : వ్యాసరచనకై ఇవ్వబడ్డ విషయాన్ని కొన్ని శీర్షికలుగా విభజించాలి. వాటి ననుసరించి కొన్ని పేరాలుగా విభజించాలి.
5. ఉపసంహారం : వ్యాసమందలి ప్రధాన విషయాల్ని సమన్వయించి ముఖ్యమైన అంశాన్ని తెలపాలి. ఇందలి విషయం వ్యాస శీర్షికకు అనుగుణంగా ఉండాలి.
6. పేరాలన్నీ ఒకదానికొకటి సంబంధం కలిగి ఉండేటట్లు చూడాలి.
7. తప్పొడు సంధులు చేయకూడదు. సంధిని విడదీసి రాయవచ్చు. శకటరేఫ (ఱ)కు బదులు సాధురేఫ (ర)ను వాడవచ్చు. అరసున్నలు పెట్టాల్సిన అవసరం లేదు. అక్షరదోషాలు లేకుండా చూసుకోవాలి.
8. సందర్భానుసారంగా సామెతలు, లోకోక్తులు, జాతీయాలు మొదలైనవి రాస్తే వ్యాసం అందంగా ఉంటుంది.

## ఇందులో ....

## 1. ఎయిడ్స్ వ్యాధి - నివారణ

ఎయిడ్స్ (AIDS) అనేది అతి భయంకరమైన వ్యాధి. ఇది హెచ్.ఐ.వి. (HIV) వల్ల సంభవిస్తుంది. HIV అంటే 'హ్యూమన్ ఇమ్యునో డెఫిషియన్సీ వైరస్' అని అర్థం. అంటే మనిషిలోని రోగనిరోధక వ్యవస్థను క్షీణింపజేసే సూక్ష్మక్రిమి. హెచ్.ఐ.వి. ముదిరి రోగనిరోధకశక్తి నశించినపుడు ఎయిడ్స్ లక్షణాలు బయటపడతాయి.

ఎయిడ్స్ వ్యాధిని మొదట 1981లో అమెరికాలో కనిపెట్టారు. తరువాత అది ప్రపంచమంతటా వ్యాపించి మానవాళిని వణికిస్తోంది. 1986లో మొట్టమొదటి ఎయిడ్స్ కేసును భారతదేశంలో గుర్తించారు. ఇప్పుడు మన దేశంలో కొన్ని లక్షలమంది ఈ వ్యాధితో బాధపడుతున్నారు.

కలసి జీవించడం, కలసి పనిచేయడం, కలసి కూర్చోవడం, కలసి ఆడటం, కలసి తినడం, కరచాలనం చేయడంలాంటివాటి వల్ల ఈ వ్యాధి సోకదు. దోమకాటువల్ల హెచ్.ఐ.వి. సోకదు.

వైరస్ సోకిన వ్యక్తితో లైంగిక సంబంధం, వైరస్ సోకిన వ్యక్తి రక్తాన్ని ఇతరులకు ఎక్కించడం, వైరస్‌తో కలుషితమైన సిరంజిలను, సూదులనుపయోగించడం లాంటి కారణాలవల్ల ఎయిడ్స్ వ్యాధి వ్యాప్తిచెందుతోంది. కాబట్టి ఇలాంటి పనులు చేయరాదు.

శరవేగంతో విస్తరిస్తున్న ఈ వ్యాధికి అడ్డుకట్ట వేసేందుకు ప్రజల్లో మానసిక పరివర్తన తేవాలి. అక్రమ లైంగిక సంబంధం పనికిరాదని బోధించాలి. ప్రపంచ ఆరోగ్యసంస్థ, ఐక్యరాజ్యసమితి, స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వం పెద్దఎత్తున ప్రచారం చేపట్టి ప్రజలను చైతన్యవంతులను చేయాలి. ఉన్నత తరగతుల పాఠ్యప్రణాళికలో 'హెచ్.ఐ.వి. - ఎయిడ్స్' ను పాఠ్యాంశంగా చేర్చాలి.

"నిశ్శబ్దాన్ని ఛేదించండి - ఎయిడ్స్ గోడల్ని బద్దలుకొట్టండి."

## 2. కంప్యూటర్

కంప్యూటర్ అనేది ఒక ఎలక్ట్రానిక్ పరికరం. కంప్యూటర్‌లో 'డేటా' (Data)ను నిల్వచేయవచ్చు. దాన్ని మళ్ళీ ఎప్పుడైనా వెనక్కి తీసుకోవచ్చు. అంతేకాకుండా కంప్యూటర్ చాలా ఖచ్చితంగా, త్వరగా ఫలితాన్ని ఇస్తుంది. ఇటువంటి అద్భుత సాధనమైన కంప్యూటర్‌ను కనిపెట్టినవాడు ఛార్లెస్ బాబ్బేజి.

కంప్యూటర్ గురించి మాట్లాడినప్పుడు మనం తరచుగా హార్డువేర్, సాఫ్ట్‌వేర్ అనే పదాలను వింటూ ఉంటాం. హార్డువేర్ అంటే కంప్యూటర్ పరికరాలు. సాఫ్ట్‌వేర్ అంటే కంప్యూటర్ పనిచేయడానికి కావలసిన పద్ధతిని తెలిపేది.

కంప్యూటర్లను ఉపయోగించి ప్రస్తుతం పరిశోధనలు చేస్తున్నారు. కూడికలు, తీసివేతలు, గుణకారాలు (హెచ్చవేతలు), భాగహారాలు వంటి లెక్కలు చాలా వేగంగా చేయడానికి కంప్యూటర్ బాగా పనికివస్తుంది. కంప్యూటర్ల ద్వారా వాతావరణ పరిస్థితిని తెలుసుకోవచ్చు. విమానాలు, బస్సులు, రైళ్ళు మొదలైన వాటి టిక్కెట్ల రిజర్వేషన్లకు కంప్యూటర్లు ఉపయోగిస్తారు. పెద్ద పెద్ద కర్మాగారాల్లో, కార్యాలయాల్లో, బ్యాంకుల్లో ఇవి ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. విద్యా, వైద్య, వ్యాపార, వ్యవసాయ, సమాచార శాస్త్ర సాంకేతిక రంగాలలో ఈ కంప్యూటర్లు ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి. కంప్యూటర్‌ను ఉపయోగించి ఇంటర్‌నెట్ అనే సౌకర్యం ద్వారా ప్రపంచంలో జరుగుతున్న విషయాలన్నింటిని మన ఇంట్లోని కంప్యూటర్ ముందు కూర్చొని తెలుసుకోవచ్చు.

అయితే కంప్యూటర్లని వాడటం వల్ల ఉద్యోగాలకు నష్టం వాటిల్లుతుందనీ, నిరుద్యోగ సమస్య పెరుగుతుందనీ కొందరి వాదన. ఇది కొంతవరకు నిజమే. ఆ మాత్రంచేతనే ఆధునిక విజ్ఞానాన్ని త్రోసిరాజనడం న్యాయం కాదు. కాబట్టి భావిభారత పౌరులైన విద్యార్థులు కంప్యూటర్ విద్య ఆవశ్యకతను గుర్తించి తప్పక దాన్ని అభ్యసించాలి.

## 3. మాతృభాషలో విద్యను నేర్చుకోవడం (విద్యలో మాతృభాష ప్రాముఖ్యం)

మాతృభాష అంటే తల్లి భాష అని అర్థం. మనం పుట్టిన చోట జనవ్యవహారంలో ఉండే భాష మాతృభాష. మానవుడు పుట్టింది మొదలు గిట్టేవరకు మాతృభాషలోనే ఎక్కువగా మాట్లాడటం జరుగుతుంది. మనం ఏ భాషలో మాట్లాడతామో, ఏ భాషలో కలలు కంటామో ఆ భాషలోనే విద్యను నేర్చుకోవడం ఎంతైనా అవసరం.

పరాయి భాషలో విద్యాభ్యాసం చేస్తే చాలా కష్టాలు ఎదుర్కోవాల్సి వస్తుంది. ముందుగా పరాయి భాషను అర్థం చేసుకోవడానికే చాలా ప్రయాస పడాల్సి వస్తుంది. అందులో తగినంత పరిజ్ఞానం అలవడనిదే విషయ గ్రహణంగానీ, విషయ వ్యక్తీకరణగానీ సాధ్యపడదు. మాతృభాషలో విద్యాభ్యాసంవల్ల విద్యార్థి ఉపాధ్యాయులు చెప్పిన విషయాన్ని సులభంగా అర్థం చేసుకోవచ్చు. గుర్తుంచుకొని పరీక్షలు బాగా వ్రాయవచ్చు. తక్కువ సమయంలో ఎక్కువ విజ్ఞానాన్ని పొందవచ్చు.

మాతృభాషలో విద్యను నేర్చుకోవడం తల్లిపాలు త్రాగి పెరగడం వంటిది. పరభాషలో విద్యను నేర్చుకోవడం దాది పాలు త్రాగడం వంటిది. ఆంగ్లం వంటి పరాయిభాషలో విద్యార్థికి సరైన పరిజ్ఞానం లేనందువల్ల విద్యార్థికి ఆ భాషరాక బట్టీపట్టి ఏదోవిధంగా కృతార్థుడవుతున్నాడు. ఉపాధ్యాయులు చెప్పేది అర్థంకాక గైడ్సు (Guides) వెంట పడుతున్నాడు. కాబట్టి కనీసం సెకండరీ విద్యాస్థాయి వరకు మాతృభాషలోనే విద్యను బోధించడం, విద్యను నేర్చుకోవడం అవసరం.

## 4. పర్యావరణ కాలుష్యం - సంరక్షణ

భూమి, నీరు, గాలి మొదలైన వాటితో మనిషికి ఉండే అవినాభావ సంబంధమే పర్యావరణం. కాబట్టి పర్యావరణం అంటే పరిసరాల వాతావరణం అని అర్థం. పరిసరాల వాతావరణం కలుషితం కాకుండా కాపాడుకోవడమే పర్యావరణ సంరక్షణ అనబడుతుంది.

ప్రాణులు నివసించేది నేలపైన గదా ! ఆ నేలతల్లిని సరిగా చూసుకోవాలి. భూమిపై చెత్త, చెదారమేకాదు ఓషధులుంటాయి. చెట్లుంటాయి. జంతువులుంటాయి. మనం జీవించటానికి ఆహారం లభించేది భూమి వల్లనే గదా ! రసాయనిక ఎరువుల వాడకం వల్ల భూమి నిస్సారమైపోతోంది. భూమిని ఆరోగ్యంగా ఉంచాలి. భూమి సమతౌల్యాన్ని పోషించాలి.

జలకాలుష్యం మిక్కిలి భయంకరమైనది. రసాయనిక పదార్థాలు, పరిశ్రమల వల్ల విడుదలయ్యే ద్రవపదార్థాలు సాగునీటిని, త్రాగేనీటిని కాలుష్యపరుస్తాయి. మురుగునీరు, త్రాగేనీరు అనే భేదం లేకుండా పోతోంది. డ్రైనేజి వ్యవస్థ అరొకరగా వుంది. దీనివల్ల కలరా, మలేరియా, ఫ్లోరోసిస్, విషజ్వరం, టైఫాయిడ్ వంటివేకాక వైద్యులకి అంతుపట్టని కొత్తరోగాలు కూడా బయలుదేరాయి.

ఇక వాయు కాలుష్యం, గాలివల్లనే మనం జీవిస్తున్నాం. అటువంటి గాలి స్వచ్ఛంగా వుండాలి. కాని ఆధునిక పారిశ్రామికత పేరుతో గాలి కూడా కలుషితమైపోతోంది. విషపూరితమైన గాలి పీల్చటం వలన ఊపిరితిత్తులు, జీర్ణకోశం, గుండెకాయ, కళ్ళు అనారోగ్యానికి గురై ప్రమాదాలు సంభవిస్తున్నాయి. జీవితం రోగాలమయం అవుతోంది.

యంత్రాలవల్ల, వాహనాలవల్ల ధ్వనికాలుష్యం వ్యాపిస్తోంది. అణుశక్తి పరీక్షల వల్ల కూడా వాతావరణ కాలుష్యం ఏర్పడుతోంది.

1970లో అమెరికాలో పర్యావరణ పరిరక్షణ ఉద్యమం బయలుదేరింది. వాటి నుంచి శాస్త్రజ్ఞులు పర్యావరణ కాలుష్యనివారణకు విశేషమైన కృషి చేస్తున్నారు. ప్రతి సంవత్సరం జూన్ 5వ తేదీని పర్యావరణ దినోత్సవంగా పాటిస్తున్నారు. పర్యావరణ వ్యవస్థలోని సమతౌల్యాన్ని కాపాడుకోవటానికి అందరూ కృషి చేయాలి

## 5. విద్యార్థులు - క్రమశిక్షణ

విద్యను అర్థించేవారు విద్యార్థులు. క్రమశిక్షణ అంటే సక్రమమైన ప్రవర్తనని కలిగివుండటం. నిజానికి క్రమశిక్షణ అన్ని వర్గాలవాళ్ళకీ, అన్ని వయస్సుల వాళ్ళకీ అవసరమే. అయితే విద్యార్థులు భావిభారతపౌరులు! జాతి భవిష్యత్తు వాళ్ళమీదే ఆధారపడి వుంది. "మొక్కై వంగనిదే మానై వంగునా !" అన్నారు. చిన్నప్పుడే క్రమశిక్షణ అలవడటం సాధ్యం. పెద్దయిన తర్వాత మనిషి మారటం చాలా కష్టం. అందుకని విద్యార్థుల్లో క్రమశిక్షణ ఉండాలి.

అయితే విద్యార్థుల్లో క్రమశిక్షణ ఎందుకు లోపిస్తోంది ? అనే అంశాన్ని లోతుగా పరిశీలించవలసి వుంది. అందుకు కొన్ని కారణాలు:

1. కావలసిన కోర్సులో సీటు దొరకకపోవడం – కావలసిన రంగంలో ఉద్యోగం దొరకకపోవడం.
2. రాజకీయ పార్టీల, నాయకుల ప్రభావం, జోక్యం.
3. విద్యాలయాల్లో అవినీతి, అవకతవకల పరంపరలు !
4. ప్రభుత్వం విద్యను వ్యాపారంగా చెయ్యడం.
5. తల్లిదండ్రుల అశ్రద్ధ, అలసత్వం.

ఇన్ని కారణాలతో పాటు పేర్కొనవలసిన మరొక రెండు ముఖ్యమైన అంశాలున్నాయి – ఒకటి సినిమా, రెండు టి.వి ! ఈ రెండూ మానసిక వికాసానికి, జ్ఞానాభివృద్ధికి ఉద్దేశించబడ్డాయి. కానీ పాశ్చాత్య విషసంస్కృతి ప్రభావంచే ఈ రెండు ప్రచార సాధనాలూ యువకులపై, విద్యార్థులపై "స్లోపాయిజన్" లా పనిచేస్తున్నాయి.

విద్యార్థుల్లో క్రమశిక్షణ అలవడాలంటే ముందుగా –

1. విద్యను వ్యాపారంగా మార్చే ధోరణులపై కఠిన వైఖరి అవలంబించాలి.
2. విద్యారంగంలోని అవకతవకల్ని, అవినీతిని (లీకేజీ, మాస్ కాపీయింగ్ సంప్రదాయాల్ని) అరికట్టాలి.
3. ఉపాధ్యాయులు చిత్తశుద్ధితో ఆదర్శవంతంగా ప్రవర్తిస్తూ బోధనకి అంకితమవ్వాలి.

4. రాజకీయ పార్టీల నీడ కూడా విద్యాలయాలపై పడకూడదు.

5. విద్యాభ్యాసం తర్వాత ఉద్యోగం వస్తుందన్న గ్యారంటీ వుండాలి.

6. విద్యార్థుల్లో దేశభక్తి, సచ్ఛీలత, సహనం అలవడేలా తగిన చర్యలు తీసుకోవాలి.

క్రమశిక్షణ ఇతరులు బలవంతంగా రుద్దినట్టు ఉండకూడదు. ఆత్మగౌరవానికి సంబంధించినదిగా, ఆత్మశక్తికి సంబంధించినదిగా, జీవితధ్యేయంగా క్రమశిక్షణను అలవరచుకోవాలి. అప్పుడు విద్యార్థులతో పాటు దేశం కూడా అక్షరజ్యోతిగా వెలిగి అభివృద్ధి బాటలో పయనిస్తుంది.

## 6. దూరదర్శన్

విజ్ఞానశాస్త్ర ప్రగతికి, మానవుడి ప్రతిభకి నిదర్శనం టెలివిజన్. దృశ్యతరంగాలను గాలిలో ప్రసారం చేయటం ద్వారా దృశ్యాలు చూడగలుగుతున్నాం. శబ్దతరంగాల ద్వారా శబ్దం వింటున్నాం. టెలివిజన్‌ను మానవుడి ప్రతిసృష్టిగా పేర్కొనాలి. ఇది బ్రిటన్‌లో 1936లో మొదట వ్యాప్తిలోకి వచ్చింది. దీనిని స్కాట్ దేశపు ఇంజనీర్ జాన్ లాగ్ బైర్డ్ 1928లో కనిపెట్టాడు.

టెలివిజన్ ఈనాడు ప్రపంచమంతటా వ్యాప్తిచెందింది. టి.వి.లు లేని ఊరులేదు. ఇది కేవలం ప్రచార సాధనమో, వినోద సాధనమో కాదు. టి.వి.ల ద్వారా ప్రభుత్వం, వాణిజ్యసంస్థలు ప్రచారం చేసుకోవచ్చు. మన సంస్కృతిని, కళలను కాపాడుకోవచ్చు. మనం చూడలేని ప్రదేశాలు చూడవచ్చు. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రపంచాన్ని మన ముందు నిలబెట్టేది టెలివిజన్. విద్యారంగంలో, వైద్యరంగంలో, వాణిజ్యరంగంలో, విజ్ఞానశాస్త్ర రంగంలో ఈనాడు టెలివిజన్‌కు తిరుగులేని స్థానంవుంది. "వీడియో" పరిజ్ఞానానికి టి.వి. మూలకారణం. నిరక్షరాస్యతా నిర్మూలనలో టెలివిజన్ కీలకపాత్ర వహిస్తోంది. ప్రజల్ని అన్ని రంగాలలోనూ చైతన్యవంతం చేస్తున్న శక్తివంతమైన సాధనం టెలివిజన్.

విదేశీ చానల్స్ ప్రసారం వల్ల యువత నిర్వీర్యమవుతోంది. మన సంస్కృతిని విస్మరిస్తున్నారు. సినిమాల వ్యామోహం, సెక్స్ వ్యామోహం ఎక్కువై పెడదారి పడుతున్నారు. ఐక్యరాజ్య సమితి నివేదిక ప్రకారం పిల్లలపై టీ.వీ.లు దుష్ప్రభావం చూపిస్తున్నాయని వెల్లడైంది. కాబట్టి టెలివిజన్‌ని మంచికి ఉపయోగించుకొనేలా చూడవలసిన బాధ్యత ప్రభుత్వానిది. ప్రైవేట్ చానల్స్‌ను నియంత్రించి వాటిపై సెన్సారు అధికారాన్ని కలిగివుండాలి. అప్పుడే టి.వి. వల్ల సత్ప్రయోజనాలుంటాయి.

## 7. వరకట్న సమస్య

వరునికిచ్చు కట్నం వరకట్నం. దాని వల్ల సమాజంలో ఏర్పడే సమస్యని వరకట్న సమస్య అంటారు. వరకట్నం కేవలం ఆడపిల్ల తల్లిదండ్రులకే కాదు కుటుంబం మొత్తానికి కూడా అదొక దుర్భర సమస్యగా తయారైంది. అసలు కట్నం అంటే కానుక. పెళ్ళి సందర్భంగా ఇచ్చే కానుక క్రమక్రమంగా కట్నమైంది. పూర్వకాలంలో కన్యాశుల్కం వుండేది. డబ్బు ఇచ్చి కన్యల్ని కొనుక్కొనేవాళ్ళు. ఆధునిక కాలంలో దాని స్థానంలో వరకట్నం వచ్చింది. ఇప్పుడు పెళ్ళి సమయంలో పెళ్ళికూతురు తల్లిదండ్రులు పెళ్ళికొడుక్కి ఇచ్చే ధనం లేదా సంపదని వరకట్నం అంటున్నారు. కొందరు డబ్బు కట్నంగా ఇస్తే మరికొందరు భూములు ఇస్తారు.

వరకట్నం తీసుకోవడం గానీ, ఇవ్వడం గానీ నేరమని చట్టం వుంది. కానీ ఆ చట్టాన్ని పాటిస్తున్నదెవరు ? చట్టాన్ని కాపాడవలసిన అధికారులే వరకట్నం ఇస్తున్నారు – తీసుకుంటున్నారు. కంచే చేను మేస్తోంది ! వరకట్నం ఇవ్వనని ఎవరైనా శపథం చేస్తే అమ్మాయికి పెళ్ళికాని పరిస్థితి కూడా ఏర్పడుతోంది ! ఆశ్చర్యం ఏమిటంటే అమ్మాయికి కట్నం ఇవ్వలేక నానా బాధలు పడ్డవారే, అబ్బాయి పెళ్ళి దగ్గరికి వచ్చేటప్పటికి కట్నం ఇవ్వాలని పట్టుబడతారు.

వరకట్న నిర్మూలనం సాధ్యమవ్వాలంటే ముందుగా పెద్దలలో మార్పురావాలి. శాఖాంతర, కులాంతర, ప్రేమ వివాహాలను ప్రోత్సహించాలి. యువతీయువకులు ఆదర్శాలతో ఈ కట్నమనే దురాచారాన్ని రూపుమాపాలి. అమ్మాయికి ఇవ్వటం, అబ్బాయికి తీసుకోవటం రెండూ అక్రమమేనన్న ఆలోచన కలగాలి. కట్నం అనేది బానిసవ్యాపారమన్న ప్రచారం సాగాలి. రేడియోలు, టి.వి.లు, సాహిత్యం ద్వారా వరకట్న దురాచారల గురించి ప్రజలకి తెలియజెయ్యాలి. వరకట్నం నిషేధ చట్టాన్ని ప్రజలు అమలుపరచాలి. అప్పుడే పెళ్ళి నూరేళ్ళ పంట అవుతుంది లేదా 'తంటా' అవుతుంది !

## 8. గ్రంథాలయాలు

"చిరిగిన చొక్కా అయినా తొడుక్కో – కానీ ఒక మంచి పుస్తకం కొనుక్కో" అన్నది సూక్తి. ఇటువంటి సూక్తులెన్నో పుస్తకాల ప్రాముఖ్యాన్ని, ప్రాశస్త్యాన్ని వివరించేవి వున్నాయి. తరతరాల విజ్ఞాన సంపదను అందించేవి గ్రంథాలు. అటువంటి గ్రంథాలు గల నివాసాన్ని గ్రంథాలయం (Library) అంటారు.

అయ్యంకి వెంకట రమణయ్య, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, నాళం కృష్ణారావు మొదలైనవాళ్ళు మన రాష్ట్రంలో గ్రంథాలయోద్యమాన్ని చేపట్టి గ్రంథాలయాలను స్థాపించారు. గ్రంథాలయ మహాసభలు నిర్వహించి పుస్తకాలను సేకరించి భద్రపరిచారు.

ప్రపంచంలో గొప్ప గొప్ప గ్రంథాలయాలున్నాయి. అమెరికాలో గల 'కాంగ్రెసు లైబ్రరీ', రోము నగరంలోని 'వాటికన్ లైబ్రరీ',' 'బ్రిటీష్ లైబ్రరీ' మొదలైనవి ప్రపంచంలో పేరొందాయి. మనదేశంలో చెన్నైలోని "కన్నెమరా" గ్రంథాలయం, తంజావూరులోని "సరస్వతీ మహలు", వేటపాలెంలోని "సారస్వత నికేతనం", హైదరాబాదులోగల "శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం" మొదలైనవి చెప్పుకోదగ్గవి చాలా ఉన్నాయి. కడపలో సి.పి. బ్రౌన్ స్మారక గ్రంథాలయం కూడా నెలకొల్పబడింది.

గ్రంథాలయాలలో చాలా రకాలున్నాయి. ప్రభుత్వ గ్రంథాలయాలు, స్వచ్ఛంద సంస్థల గ్రంథాలయాలు వున్నాయి.

గ్రంథాలయాల వల్ల చాలా లాభాలున్నాయి :

1. గ్రంథాలయాలు మనిషిని మనీషిగా మారుస్తాయి.
2. మహామేధావులు తరతరాలుగా సంపాదించిన అనుభవాలు, ఆలోచనలు గ్రంథాలలో భద్రపరచబడతాయి.
3. దేశాభ్యుదయానికి, సమాజవికాసానికి మూలస్తంభాలు గ్రంథాలయాలు.
4. గ్రంథపఠనమనే మంచి అలవాటు అలవడుతుంది.
5. గ్రంథాలు తండ్రివలె ఆదేశిస్తాయి. తల్లివలె లాలిస్తాయి. మిత్రుని వలె ఆదుకుంటాయి. గురువువలె ప్రబోధిస్తాయి.

గ్రంథాలయాధికారులు పుస్తకాలు కొనేటప్పుడు అత్యంత శ్రద్ధ వహించాలి. డబ్బును దుర్వినియోగం చెయ్యకుండా మంచి పుస్తకాలనే కొనాలి. హాని కలిగించు పుస్తకాలను నిర్మొహమాటంగా తిరస్కరించాలి. పోటీ పరీక్షలకి, ఉద్యోగ పరీక్షలకి, చదువుకి కావలసిన పాఠ్య గ్రంథాలు, క్విజ్ పుస్తకాల వంటివాటికి ప్రాధాన్యం ఇవ్వాలి. ప్రభుత్వం గ్రంథాలయోద్యమాన్ని నీరుకార్చకుండా తగిన శ్రద్ధవహిస్తే సమాజం అభ్యుదయ పథంలో పయనిస్తుంది.

## 9. అవినీతి నిర్మూలనం

మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చాక అనేక రంగాలలో దేశం ముందంజ వేసింది. దురదృష్టవశంగా మనదేశంలో అవినీతి కూడ పెచ్చుపెరిగింది. అక్రమ సంపాదన ప్రజల లక్ష్యమయిపోయింది. ఏదోరకంగా తప్పుచేసి అయినా డబ్బు సంపాదించడం, తన పని పూర్తిచేసుకోవడం, ఆశ్రితులకు మేలు చేయడం, నీతికి సమాధి కట్టడం జరుగుతోంది. ముఖ్యంగా దేశ రాజకీయ నాయకులలో ఈ అవినీతి జాడ్యము విస్తరించిపోతోంది. చిన్న పంచాయతీ మెంబరు నుండి దేశ ప్రధాని వరకు అందరూ అవినీతి ఆరోపణలకు గురియగుచున్నారు. ఇది దేశానికి పట్టిన దౌర్భాగ్యం. దీనిని అరికట్టడంలో భావిభారత పౌరులైన యువతీయువకులు ముఖ్యంగా విద్యార్థినీ విద్యార్థులు ముందడుగు వేయాలి.

ముందుగా దేశంలో జరిగే అవినీతి కార్యాలను గూర్చి చూద్దాము. వర్తకులు సరకులలో కల్తీ చేయడం, ప్రభుత్వము పంపిణీ చేసిన నిత్యావసర వస్తువులను దాచి, బ్లాక్ మార్కెట్‌లో అమ్మడం, ధరలు పెంచివేయడం, ప్రభుత్వానికి పన్నులు ఎగవేయడం వంటి పనులు చేస్తున్నారు. ప్రభుత్వోద్యోగులు ప్రభుత్వము ప్రజలకు ఇచ్చే సదుపాయాలు ప్రజలకు లభించేలా చూడ్డానికి భారీగా లంచాలు మింగుతున్నారు. రేషన్ కార్డులు ఇవ్వడానికి, ఇళ్ళ స్థలాలు మొదలైనవి పంచడానికి లంచాలు తీసికొంటూ అర్హులయిన వారికి అన్యాయం చేసి వారికి ఇష్టమైన వారికి ఇస్తున్నారు. చౌకధరల దుకాణంలో సరుకులను దాచివేసి అక్రమ లాభాలు ఆర్జిస్తున్నారు. బ్యాంకుల అప్పులకు లంచాలు తీసికొంటున్నారు. విద్యాలయాలలో సీట్లకు లంచాలు, పాస్ చేయించడానికి లంచాలు ముట్టచెప్పవలసివస్తోంది. ఇట్లా దేశంలో అవినీతి అన్ని రంగాలలో తాండవిస్తోంది.

ఈ అవినీతిని అరికట్టడానికి యువతీయువకులు ముందుకు రావాలి. పత్రికలకు లేఖలు వ్రాసి లంచగొండుల గూర్చి అవినీతి శాఖ వారికి తెలియజేయాలి. అవినీతి శాఖ ఉద్యోగులు కూడా మరింత చురుకుగా పనిచేసి లంచగొండులను నిర్బంధించాలి.

రోజుకొక లంచగొండిని, కల్తీ వ్యాపారిని, దుష్ట రాజకీయవేత్తను ప్రభుత్వానికి యువత అప్పగిస్తే, కొద్దిరోజులలో దేశములో అవినీతి దానంతట అదే అంతరిస్తుంది. అవినీతిపరులకు ప్రభుత్వం కూడ గట్టి శిక్షలు విధించాలి. వారి ఉద్యోగాలు తీసివేయాలి. కల్తీ వ్యాపారులకు జరిమానాలు, జైలు శిక్షలు వేయాలి.

అవినీతి నిర్మూలన ప్రజలందరి లక్ష్యం కావాలి. లేనిచో ఈ అవినీతి చెదపురుగు దేశాన్నే కొరికి తినివేస్తుంది.

## 10. చలనచిత్రాలు

చలనచిత్రాలు అంటే కదిలే బొమ్మలు అని అర్థం. వీటినే సినిమాలు అంటారు. పూర్వం ప్రజల విజ్ఞాన వినోదాలకై తోలుబొమ్మలాటలు, భామాకలాపాలు, వీధి నాటకాలు ప్రదర్శింపబడుతుండేవి. క్రమంగా మాటలు లేని మూగచిత్రాలు వచ్చాయి. నేడు సాంకేతికంగా అభివృద్ధి చెంది మాటలతో కూడిన చలనచిత్రాలు ప్రదర్శింపబడుతున్నాయి. ప్రపంచంలో నేడీ రంగాన హాలీవుడ్ పేరుగాంచింది. ముంబాయి మనదేశంలో సినీరంగాన పేరుగాంచింది.

వినోదాన్ని అందించే సాధనాలలో 'సినిమా' అత్యల్ప వ్యయ సాధనమైనది. ప్రపంచంలో ఏమూలనో ఉన్న ప్రకృతి సుందర దృశ్యాలు, దేశంలోని వివిధ సుందర దృశ్యాలు సినిమాలలో చూసి ఆనందించవచ్చు. సినిమాలు సాంఘికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా గొప్ప ప్రచార సాధనాలు. ఎంతటి కఠిన విషయమైనా సినిమాద్వారా ప్రేక్షకులకు అర్థమయ్యేట్లు చెప్పవచ్చు.

నేడు ఈ పరిశ్రమ పెక్కుమందికి జీవనోపాధిని కలిగిస్తున్నది. అనేకమంది నటీనటులు, కళాకారులు దీనివల్ల ఐశ్వర్యవంతులవుతున్నారు. కార్మికులు, విద్యార్థులు, పిన్నలు పెద్దలు అందరూ వీటిని చూసి మానసిక విశ్రాంతిని, వినోదాన్ని పొందుతున్నారు. విజ్ఞానదాయకమైన సినిమాలు తీసి విద్యాలయాలలో ప్రదర్శిస్తే బాగుంటుంది.

ఈ సినిమాలను సరైన పద్ధతిలో తీయకపోతే సమాజానికి చెడు కలుగుతుంది. సినిమాలలో చూపించే దురభ్యాసాలు, దొంగతనాలు, దౌర్జన్యాలు చూసి కొందరు చెడిపోతున్నారు. కాబట్టి నిర్మాతలు కేవలం వ్యాపారదృష్టితోనే కాక, కళాత్మకపు విలువలను పెంచే చిత్రాలను నిర్మించాలి. అటువంటి చిత్రాలనే ప్రేక్షకులు కూడా ప్రోత్సహించాలి.

## 11. జాతీయ సమైక్యత

ఒక దేశంలో పుట్టి పెరిగిన వారంతా ఒక జాతి వారని చెప్పవచ్చు. మనది భారతజాతి. భాష, మతం, సంస్కృతి, ఆచార వ్యవహారాలు ఒక్కటైనా, కాకున్నా ఒకే ప్రభుత్వం క్రిందనున్న ప్రజలంతా ఒకే జాతి అని చెప్పవచ్చు. మతాలు వేరయినా, భాషలు, రాష్ట్రాలు వేరయినా జాతి అంతా కలసి ఉండటమే జాతీయ సమైక్యత అంటారు.

మన భారతీయులలో కనిపించే దౌర్బల్యం అనైక్యత, మతం పేరిటనో, అధికారాన్ని ఆశించో మన రాజులొకరితో ఒకరు కయ్యాలాడుకొని విదేశీయుల పాలనలో దేశాన్ని పడవేశారు. నేటికీ మన దేశౌన్నత్యాన్ని సహింపలేని విదేశాలున్నాయి. ఆ దేశాలతో మన జాతి సమైక్యతకు భంగం కలిగించే కొన్ని శక్తులు, మన దేశంలోనే ఉండి పొత్తు పెట్టుకొంటున్నవి. అట్టి అవాంఛనీయ శక్తులను తుదముట్టించి మన జాతినంతా ఒకే త్రాటిపై నిలపాలి. మనం ఏ రాష్ట్రం వారమైనా, ఏ భాషను మాట్లాడే వారమైనా మనమందరం భారతీయులమనే మాట మరువరాదు.

కొందరు మత కలహాలు పెంచి వారిలో భేదాలు రెచ్చగొట్టి హత్యలకు, లూటీలకు, గృహదహనాలకు సిద్ధపడుతున్నారు. దీనివల్ల ప్రజలలో ఇతర మతంవారిపై ద్వేషం పెరుగుతుంది. కొందరికి ప్రాంతీయ దురభిమానం, మరికొందరికి తమ భాషలపై మోజు ఎక్కువ. స్వభాషాభిమానం ఉండటం మంచిదే. కాని పరభాషపై ద్వేషం ఉండకూడదు. భాషా రాష్ట్రాలుగా విభజించిన తరువాత ప్రాంతీయ దురభిమానాలు పెరిగి నదీ జలాల కొరకు, తమ ప్రాంతాల అభివృద్ధి కొరకు పరస్పరం కలహించుకొంటున్నారు.

మన జాతిలో అనైక్యతను పోగొట్టి ఐక్యపరచటానికి ప్రభుత్వం జాతీయ సమైక్యతా మండలిని స్థాపించింది. భారత జాతి అంతా ఒక్కటే అని బోధిస్తున్నది. జాతీయ సమైక్యతవల్ల దేశం అన్నిరంగాలలో అభివృద్ధి చెందుతుంది. అంతేకాకుండా విదేశాలలో భారతజాతి కీర్తిపతాకలు రెపరెపలాడతాయి.

## 12. అణ్వస్త్ర పరీక్షలు

అణువులతో తయారైన అస్త్రాలను ప్రయోగించటానికిగాను చేసే పరీక్షల్ని అణ్వస్త్ర పరీక్షలంటారు. విజ్ఞానాన్ని వేయివిధాలుగా అభివృద్ధి చేసుకున్న నేటి మానవుడు అణువుతో ఆయుధాల్ని నిర్మించి ప్రపంచ విజేత కావాలని ఆకాంక్షిస్తున్నాడు.

సృష్టికి మూలమయింది అణువని గౌతముడు, కాణాదుడు మొదలయిన ప్రాచీన భారతీయులు ఊహించారు. పాశ్చాత్యదేశాలలోని విజ్ఞాన శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేసి సృష్టికి మూలభూతమైన పదార్థం అణువని గుర్తించారు. నిర్దిష్టమగు శాస్త్రీయ పద్ధతిలో అణువు నుండి వెలువడ్డ అనూహ్యమైన ఉష్ణశక్తితో ఐన్‌స్టీన్ నాయకత్వంలో అణుశక్తిని సాధించారు. అణుబాంబులను సాధించారు. రెండవ ప్రపంచ యుద్ధంలో అమెరికా అణుబాంబులను జపానుపై ప్రయోగించింది. వేలకొద్దీ మనుష్యులు మరణించారు. పశుపక్ష్యాదులు మరణించాయి. అప్పుడు వెలువడ్డ రేడియోధార్మిక శక్తి వల్ల చావగా మిగిలినవాళ్ళు కుంటి, గ్రుడ్డి, చెవిటి; మూగవాళ్ళుగా అయ్యారు. ఇట్లా అణుశక్తి జీవరాశికి నష్టాన్ని కలిగించింది.

అణ్వస్త్ర పరీక్షలు, వాటి ప్రయోగాలవల్ల మానవ నాశనానికి దారితీస్తున్నందువల్ల అగ్రరాజ్యాలు అణ్వస్త్రాలను నశింపచేయాలనే అంగీకారానికి వచ్చాయి. భారతదేశం కూడా అణుశక్తి రంగంలో కాలూనింది. హోమీబాబా ఆటంబాంబును తయారుచేశాడు.

అణ్వస్త్రాల పాటవ పరీక్షలను నిలిపివేయాలని ప్రపంచ శాంతికాముకులందరు అభిప్రాయపడుతున్నారు. లేకపోతే అవి ప్రపంచ వినాశనానికి దారి తీస్తాయని భయాందోళనలు వెలిబుచ్చుతున్నారు.

## 13. నాకు నచ్చిన కవి - శ్రీశ్రీ

"ఏ దేశ చరిత్ర చూచినా - ఏమున్నది గర్వకారణం !
నరజాతి చరిత్ర సమస్తం - పరపీడన పరాయణత్వం"

అని కొత్తగా గళమెత్తి సంచలనం రేకెత్తించిన మహాకవి శ్రీశ్రీ. శ్రీశ్రీ అనే రెండక్షరాలు తెలుగు కవిత్వంలో విప్లవం సృష్టించాయి. కలం పేరు శ్రీశ్రీ కాగా, అసలు పేరు శ్రీరంగం శ్రీనివాసరావు. "అనితరసాధ్యం నా మార్గం" అని చాటిన ప్రజాకవి శ్రీశ్రీ. భావకవిత్వంపై తిరుగుబాటు బావుటా ఎగురవేసి అభ్యుదయ ఉద్యమానికి నాంది పలికాడు. ఆ తర్వాత విప్లవ కవిత్వోద్యమానికి స్ఫూర్తినిచ్చాడు.

కాని శ్రీశ్రీ ప్రపంచాన్ని పరిశీలించిన కొద్దీ, పుస్తక పఠనం ఎక్కువైన కొద్దీ కొత్తదారులు తొక్కాలని ఉవ్విళ్ళూరాడు. తానే ప్రపంచాగ్నిగా మారాడు.

తాను కొత్త శైలిని ఎన్నుకొన్నాడు. "ఈ యుగం నాది" అని ఎలుగెత్తి చాటాడు. "సామాజిక దృక్పథాన్ని జాతీయస్థాయినుంచి అంతర్జాతీయస్థాయికి తీసుకువెళ్ళిన నాయకుడాయెనే. శ్రీశ్రీ "మహాప్రస్థానం" అనే గొప్పకావ్యం రాశాడు. మహాప్రస్థానం అంటే గొప్ప ప్రయాణం అని అర్థం. కమ్యూనిస్టు భావాలు గల శ్రీశ్రీ ఎర్రబావుటా ఎగరేస్తూ మరో ప్రపంచానికి పదండి అని మేల్కొలుపు పాడుతూ ఇలా పాడాడు.

సమాజంలోని ఎక్కువతక్కువల్నీ, బలవంతుల - ధనవంతుల అన్యాయాల్ని ఎదిరించిన శ్రీశ్రీ కర్మ సిద్ధాంతాన్ని తిరస్కరించాడు.

"దేశచరిత్రలు" అనే ఖండిక చారిత్రక వాస్తవికతని స్పష్టీకరిస్తుంది.

"తాజ్‌మహల్ నిర్మాణానికి - రాళ్ళెత్తిన కూలీ లెవరు ?

ప్రభువెక్కిన పల్లకి కాదోయ్ - అది మోసిన బోయీ లెవ్వరు ?"

అని మొట్టమొదటగా శ్రామికశక్తిని గుర్తించి సామ్యవాద సిద్ధాంతాన్ని ప్రకటించిన వాడు శ్రీశ్రీ.

"కదిలేదీ కదిలించేదీ

మారేదీ మార్పించేదీ

మునుముందుకు సాగించేదీ" కవిత్వమని శ్రీశ్రీ కొత్త నిర్వచనం ఇచ్చాడు.

ఆయన సమకాలీన సమాజాన్ని హేళన చేస్తూ సిరిసిరిమువ్వా అనే శతకం రాశాడు. కథలూ, నాటికలూ, వ్యాసాలూ, పీఠికలూ ... ఏది రాసినా శ్రీశ్రీ ముద్ర గాఢంగా కనిపిస్తూనే వుంటుంది.

సమాజాన్ని చైతన్య పరిచి, అభ్యుదయ కవిత్వానికి యుగకర్తగా వుండి, కొత్త తరానికి బాటలు వేసి, తెలుగు కవిత్వంలో నిలువెత్తు సంతకంగా నిలిచిన శ్రీశ్రీ ప్రజా కవి. సమాజకవి.

## 14. మతసామరస్యం

భారతీయ సమాజంలోని వ్యక్తులకు మతం అనేది పుట్టుక నుండి సంక్రమిస్తుంది. అదే విధంగా మతము యొక్క ప్రభావం వ్యక్తిపై పుట్టుక నుండి మరణించే వరకు ఉంటుంది. ప్రపంచంలో అధిక ప్రభావం కల్గిన ముఖ్యమైన మతాలన్నీ భారతదేశంలో వున్నాయి. ఎవరికి వారు వారి మతం గొప్పదిగా భావించడం జరుగుతుంది. ఒకనాటి సమాజాన్ని క్రమబద్ధం చేయడానికి, ఆనాటి సమాజంలో శాంతిభద్రతలు కాపాడుకోవడానికి మతాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. భారతదేశంలో ఉన్న మతాలను ఏడు రకాలుగా విభజించవచ్చు.

1) హిందూమతం, 2) ముస్లింమతం, 3) క్రైస్తవమతం, 4) బౌద్ధమతం, 5) జైనమతం, 6) సిక్కుమతం, 7) పార్సీ, 8) యూదుమతం. భారతీయ సమాజంలో హిందూమతం వారే ఎక్కువగా ఉన్నప్పటికీ అనేక కారణాలవల్ల మతాల మధ్య వ్యత్యాసాలు, సంఘర్షణలు రోజురోజుకు పెరిగిపోతున్నాయి. ఈ విధమైన మతతత్వానికి అనేక కారణాలున్నాయి. వాటిలో ముఖ్యమైనవి : 1) ప్రజలలో స్వార్థబుద్ధి 2) మహమ్మదీయులలో ఆర్థిక బలహీనతల కారణంగా మైనార్టీలకు ఎక్కువ సౌకర్యాలను కలిగించాలనే వారి వాదన 3) ప్రాంతీయతత్త్వం మొదలైన కారణాలవల్ల భారతీయ సమాజంలో మతతత్త్వం వెర్రితలలు వేస్తోంది. మతతత్వానికి మరొక ముఖ్యకారణం మతంతో రాజకీయాలు మిళితమై ఉండటం.

మతాన్ని రాజకీయాల్లో చేర్చటంవల్ల భారత్ నుండి పాకిస్థాన్ విడిపోయింది. నేడు సిక్కుమతం వారు భారత్ నుండి విడిపోయి స్వతంత్ర దేశంగా ఏర్పడతామని అనేక సంవత్సరాలుగా ఉద్యమిస్తూనే ఉన్నారు. మరో ప్రక్క 'రామజన్మభూమి - బాబ్రీమసీదు' వివాదం మతసమస్యగా తయారయింది. భారతదేశంలో మతకలహాలు తరచూ సంభవిస్తూనే ఉన్నాయి. అల్ప సంఖ్యాకులకు, అధిక సంఖ్యాకులకు మధ్య పరస్పర విశ్వాసం, సామరస్యం లోపించడంతో ఈ భయానక వాతావరణం ఏర్పడి అల్లర్లు, అలజడులు, ఆస్తినష్టం, ప్రాణనష్టం తరచు ఏర్పడుతూనే ఉన్నాయి. వివిధ రాజకీయ పక్షాలు పాక్షిక ప్రయోజనాల సాధనకోసం మతకలహాలను ఒక ఆయుధంగా ఉపయోగించుకొంటున్నాయి.

ఈ విధమైన పరిస్థితులను చక్కదిద్దాలంటే ప్రజలు చైతన్యవంతులై రాజకీయ నాయకుల బూటకపు మాటలకు మోసపోక పరమత సహనం కలిగియుండాలి. మత సామరస్యంతో అందరూ కలిసిమెలసి జీవించడం నేర్చుకోవాలి.

## 15. జనాభా సమస్య (కుటుంబ నియంత్రణ)

జనాభా ఎక్కువగుట వలన సమస్య ఏర్పడటాన్ని జనాభా సమస్య అంటారు.

"అమెరికాలో డాలర్లు పండును
ఇండియాలో సంతానం పండును"

అని తెలుగులో బాలగంగాధరతిలక్ అనే కవి వ్యంగ్యంగా భారతీయులకి సంతానంపై గల మక్కువ తెలిపాడు. జనాభా సమస్య ఏర్పడటానికి ఈ క్రింది కారణాలు ముఖ్యం 1) సంతానం ఎక్కువగా ఉండటం గొప్పదనంగా భావించడం. 2) ఆడపిల్లలు లేదా మగపిల్లలు కావాలనే కోరికలు. 3) చిన్నప్పుడే వివాహాలు చెయ్యటం. 4) నిరక్షరాస్యత. 5) మత విశ్వాసాలు.

ఇన్ని కారణాల వల్ల రాను రాను జనాభా ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోతోంది. జనాభా సమస్యను పరిష్కరించటానికి ప్రభుత్వం పటిష్ఠమైన ప్రణాళికా విధానం రూపొందించింది.

**జనాభా సమస్య నిర్మూలనకు తీసుకోవలసిన చర్యలు :**

1. 'కుటుంబ నియంత్రణ' ను అన్ని మతాల ప్రజలు పాటించేలా చర్యలు తీసుకోవాలి.
2. జనాభా సమస్య వల్ల ఏర్పడే నష్టాలను ప్రజలకు తేటతెల్లం చెయ్యాలి.
3. స్త్రీల కంటె పురుషులు కుటుంబ నియంత్రణ చికిత్స చేసుకోవటం తేలిక అని చెప్పాలి.
4. కుటుంబ నియంత్రణకి ప్రోత్సాహం కలిగించే సదుపాయాలు, సౌకర్యాలు కల్పించాలి.
5. ఆడయినా, మగయినా ఒకటేనన్న భావాన్ని కలిగించాలి.
6. కుటుంబ నియంత్రణ పాటించడం పాపమనే భావనని తొలగించాలి.

అప్పుడు మాత్రమే జనాభా పెరుగుదలను అరికట్టడం సాధ్యమవుతుంది. జనాభా సమస్య వల్ల నష్టాలు ఇవి

1. జనాభా పెరుగుదల వల్ల ఆహార సమస్య, నిరుద్యోగ సమస్య, కాలుష్య సమస్యల వంటివి ఎక్కువవుతాయి.
2. విద్యాలయాలలో సీట్లు లభించక విద్యావకాశాలు తగ్గిపోతాయి.
3. దేశ ఆర్థిక పరిస్థితి ఛిన్నాభిన్నమవుతుంది.
4. "అందరికీ ఆరోగ్యం" అనేది సాధ్యం కానేరదు.
5. సంతానం ఎక్కువగా వుంటే తల్లిదండ్రులపై భారం ఎక్కువై పిల్లల్ని సక్రమంగా పెంచి పోషించలేరు.
6. జనాభా ఇదే విధంగా పెరుగుతూవుంటే బట్టకీ, ఇంటికీ కూడా కరువు తప్పదు.

అందువల్ల ప్రభుత్వం జనాభా సమస్య నిర్మూలనకే అధిక ప్రాధాన్యం ఇవ్వాలి. 'చిన్న కుటుంబమే చింతలు లేని కుటుంబం' అని బోధించడమే కాదు. నాయకులు, అధికారులు తాము కూడా పాటించాలి. కుటుంబ నియంత్రణ పాటించని వారిని శిక్షించే చట్టం రూపొందించాలి. అప్పుడే దేశం ప్రగతి మార్గంలో పయనిస్తుంది.

## 16. విజ్ఞానయాత్రలు (విహార యాత్రలు)

విజ్ఞానయాత్రలు లోకజ్ఞానాన్ని కలిగించేవి. అయినా ఇవి వినోదయాత్రలుగా, విహారయాత్రలుగా వ్యవహారంలో వున్నాయి. అంటే కొన్ని ప్రత్యేకస్థలాలకి ప్రయాణం చేయటం వల్ల విజ్ఞానం సంపాదించవచ్చు. విజ్ఞానమే కాకుండా వినోదం కూడా లభిస్తుంది.

పుస్తక పఠనం వల్ల పుస్తక జ్ఞానం మాత్రమే లభిస్తుంది. లోకానుభవం, ప్రజల ఆచారవ్యవహారాలు, మన సంస్కృతి తెలుసుకోవాలంటే పర్యటనలు తప్పనిసరి. పుస్తకాలలో ఉన్న విషయాలను పూర్తిగా ఆకళింపు చేసుకోవాలంటే యాత్రలు చేయవలసి వుంది. ఉదాహరణకు నీటి నుంచి విద్యుత్ ఎలా లభిస్తోందో పుస్తకాలలో వివరంగా వుంటుంది. అది చదివితే కొంతమాత్రమే తెలుస్తుంది. అది కేవలం "bookish knowledge". జలవిద్యుత్ కేంద్రానికి వెళ్ళి, పనిచేసే విధానాన్ని పరిశీలించినప్పుడు అది సంపూర్ణ జ్ఞానం అవుతుంది. ముఖ్యంగా చరిత్ర, సైన్సు వంటి విషయాల అవగాహనకు యాత్రలు ఎంతో అవసరం.

విజ్ఞానయాత్రల వల్ల ముఖ్యమైన ప్రయోజనాలు – 1) లోకజ్ఞానం అలవడుతుంది. 2) మానసిక విశ్రాంతి లభిస్తుంది. 3) విభిన్న సంస్కృతుల్ని, భాషల్ని, జీవన విధానాల్ని తెలుసుకోవచ్చు. 4) పదిమందితో ఏవిధంగా మెలగాలో అనుభవం వస్తుంది. 5) స్నేహితులను పొందే అవకాశం లభిస్తుంది. 6) జాతి సమైక్యత, దేశసమైక్యతకి దోహదం చేస్తాయి. 7) కవులకి, చిత్రకారులకి, మానసిక రోగులకి స్ఫూర్తిని, ఉల్లాసాన్ని కలిగిస్తాయి.

ఇటువంటి విజ్ఞాన యాత్రల్లో చాలా రకాలున్నాయి–1) ప్రకృతికి సంబంధించినవి – ఊటీ, హిమాలయం, జోగ్ జలపాతం మొదలగునవి. 2) చారిత్రక సంబంధమైనవి–ఎల్లోరా, రామప్పగుడి, చార్‌మినార్ మొదలగునవి. 3) శాస్త్ర సంబంధమైనవి–బిర్లా ప్లానిటోరియం, పరిశ్రమలు, అణుకేంద్రాలు మొదలగునవి. 4) మత సంబంధమైనవి–కాశీ, మక్కా, వాటికన్, తిరుపతి మొదలగునవి.

ఈ యాత్రల పట్ల విద్యార్థి దశనుండే ఉత్సాహం ఏర్పరిచేలా చూడాలి. విద్యార్థిగా ఉన్నప్పుడే లోకజ్ఞానం అలవడితే జీవితం సంపన్నమవుతుంది - అర్థవంతమవుతుంది. ఉపాధ్యాయుల, విద్యార్థుల మధ్య సత్సంబంధాలు ఏర్పడతాయి. ఉపాధ్యాయుల వల్ల ఎన్నో విషయాలు తెలుసుకోవచ్చు. విద్యార్థులలో ఐకమత్యానికి కూడా ఈ యాత్రలు తోడ్పడతాయి.

విజ్ఞానయాత్రలు లేదా విహారయాత్రలు కేవలం యువకులకో లేదా విద్యార్థులకో, కళాకారులకో అనుకోవటం సరికాదు. అన్ని వయస్సులవాళ్ళకీ, అన్ని వృత్తులవాళ్ళకీ అవసరమే. కూపస్థమండూకం లాగా జీవించటం మానవుడి నైజం కాదు కాబట్టి విజ్ఞానయాత్రలు అత్యంతావశ్యకాలు.

## 17. వార్తాపత్రికలు

వార్తలను అందించే పత్రికలను "వార్తా పత్రికలు" (News papers) అంటారు. వార్తలను ఇంగ్లీషులో NEWS అంటారు గదా! ఆ అక్షరాలను బట్టి కొందరు ఈ విధమైన వివరణ ఇస్తారు - N అంటే North, E అంటే East, W అంటే West, S అంటే South. కాబట్టి ప్రపంచం నలుమూలలా జరిగే సంఘటనలను అందించేవి వార్తా పత్రికలు . అనే వివరణ సమంజసంగానే కనిపిస్తుంది.

ప్రాచీనకాలంలో వార్తలను చేరవేయటానికి మనుషుల్ని, జంతువుల్ని, పక్షుల్ని వాడేవారు. "వార్తాహరులు", "రాయబారులు" ఉండేవారు. కానీ విజ్ఞాన శాస్త్రం అభివృద్ధి చెందిన తర్వాత ముద్రణాయంత్రాలు వెలువడ్డాయి. అప్పటి నుంచి 'అచ్చు'కి ప్రాముఖ్యత లభించి వార్తా పత్రికల వ్యాప్తి జరిగింది.

ప్రపంచంలో మొట్టమొదటగా వెనిస్ నగరంలో వార్తాపత్రిక ప్రారంభించబడిందని చెప్తారు. సుమారు క్రీ.శ. 1620 నాటికి వార్తా పత్రికలు వచ్చినట్టు తెలుస్తోంది. భారతదేశంలో మొదటి వార్తాపత్రికగా "ఇండియా గెజిట్"అని కొందరు, "బెంగాల్ గెజిట్"అని మరికొందరు పేర్కొంటున్నారు. క్రీ.శ. 1850 నుంచి మన దేశంలో పత్రికల ప్రచురణ అధికమైంది. కాశీనాథుని నాగేశ్వరరావు, ముట్నూరి కృష్ణారావు, ఖాసా సుబ్బారావు, సి.వై. చింతామణి, గోరా, నార్ల వెంకటేశ్వరరావు, నండూరి రామమోహనరావు, పొత్తూరి వెంకటేశ్వరరావు, ఎ.బి.కె. ప్రసాద్ మొదలైనవారు సంపాదకులుగా తెలుగువార్తా పత్రికల ప్రాచుర్యానికి ఎంతో కృషి చేశారు.

ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఈనాడు, ఆంధ్రభూమి, వార్త అనే దినపత్రికలు తెలుగునాట విశేష ఆదరణ పొందాయి.

వార్తా పత్రికల వల్ల లాభాలు చాలా వున్నాయి. అవి : 1) మానవుడి మేధ వికసిస్తుంది. 2) ఆర్థిక, రాజకీయ, విద్యా, క్రీడ, వ్యవసాయ, సాహిత్యాదిరంగాలలోని విషయాలు క్షుణ్ణంగా తెలుసుకోవచ్చు. 3) సమాజంలో అట్టడుగున పడి కనిపించని వాస్తవాలెన్నో పత్రికల ద్వారా తెలుస్తాయి. 4) రచయితలకు, యువతకు, కళాకారులకు, విద్యార్థులకు, నిరుద్యోగులకు, వ్యాపారవేత్తలకు, రైతులకు ఇంకా సమాజంలోని అన్ని వర్గాల ప్రజలకు వార్తా పత్రికలు కరదీపికలు. 5) జాతీయాభివృద్ధికి, జాతి సమైక్యతకి దోహదపడతాయి. 6) ప్రభుత్వానికీ ప్రజలకీ మధ్య వారధి వలె తోడ్పడతాయి. అంటే ప్రభుత్వ పథకాలూ, లోపాలూ ప్రజలకి తెలియజేస్తాయి. ప్రజల కష్టనష్టాలూ, సమస్యలూ, అభిప్రాయాలూ ప్రభుత్వానికి తెలియజేస్తాయి.

కొన్ని పత్రికలు నిష్పాక్షికంగా ఉండి అధికారుల అవినీతిని, అక్రమాలని బహిరంగపరుస్తున్నాయి. మరికొన్ని అశ్లీలానికీ, నీతిబాహ్యమైన అంశాలకీ ప్రాధాన్యం ఇస్తున్నాయి. ప్రభుత్వం పత్రికా స్వేచ్ఛని కాపాడాలి. సంపాదకులు, పత్రికా నిర్వాహకులు పత్రికా స్వేచ్ఛను దుర్వినియోగం చెయ్యకుండా నైతిక బాధ్యత కలిగివుండాలి.

## 18. ఉగ్రవాదం

హింసాయుత మార్గాల ద్వారా తమ ఆశయాన్ని, లక్ష్యాన్ని, కోరికల్ని తీర్చుకోవాలనుకునేవారు ఉగ్రవాదులు అనబడతారు. ఈ ఉగ్రవాదుల వాదం ఉగ్రవాదం.

ప్రపంచవ్యాప్తంగా ఉగ్రవాదం ఒక పెద్ద సమస్యగా తయారయింది. "చీడపురుగు చేరి చెట్టు చెఱచు - కుత్సితుండు చేరి గుణవంతు చెఱచురా" అన్నట్లు ప్రపంచంలో అనేక ప్రాంతాలలో వ్యాపించిన ఈ ఉగ్రవాదం భారతదేశానికి కూడా వ్యాపించింది. ఉగ్రవాదానికి కారణాలు ప్రాంతాన్ని బట్టి, ప్రజల జీవన పరిస్థితులను బట్టి, ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులను బట్టి మారుతుంటాయి. కొంతమంది స్వార్థపరులైన రాజకీయ నాయకులు కూడా తెరచాటు నుండి ఈ ఉగ్రవాదాన్ని ప్రోత్సహిస్తుంటారు.

ఉగ్రవాదం అత్యంత ప్రమాదకరమయినది. దీన్ని అరికట్టాలంటే ఆయా దేశాలలోని ప్రజల ఆర్థిక, సాంఘిక సమస్యలను సమర్థవంతంగా పరిష్కరించాలి. తుపాకి గొట్టం ద్వారా వచ్చే మార్పు శాశ్వతమైనది కాదని, భావ విప్లవం ద్వారా వచ్చే మార్పు శాశ్వతమైనదనే అంశాన్ని ఉగ్రవాదులు గుర్తించేటట్లు చేయాలి. ప్రజల ఆశయాలకు, ఆకాంక్షలకు అనుగుణంగా ప్రభుత్వ పథకాలు రూపొందించి అమలు చేయాలి.

కులాల పేరిటో, మతాలపేరిటో, ప్రాంతాల పేరిటో దేశాన్ని విభజించాలనో, తమ కోరికలను తీర్చాలనో ఉగ్రవాదులు ప్రవర్తించటం జాతీయ సమైక్యతకు భంగం కలిగిస్తుంది. అందువల్ల జాతీయ సమైక్యతకు భంగం కలిగించే ఉగ్రవాదులను ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా అణచివేయాలి.

## 19. విద్యార్థులు - సంఘసేవ

విద్యార్థుల ప్రప్రథమ కర్తవ్యం విద్యాభ్యాసం అనటంలో సందేహం లేదు. కానీ విద్యార్థులు కూడా ఈ దేశపు పౌరులే. వాళ్ళూ సంఘజీవులే. సంఘంలో భాగస్వాములే. కాబట్టి సంఘసేవలో వాళ్ళకీ బాధ్యత వుంది. విద్యాభ్యాసానికి ఆటంకం లేకుండానే సంఘసేవ చేసే అవకాశాలున్నాయి.

"చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష" అని స్వార్థంగా జీవించటం సంఘజీవి లక్షణం కాదు. గురజాడ అన్నట్టు .

"సొంతలాభం కొంత మానుకు

పొరుగువాడికి తోడుపడవోయ్"

అన్న భావనైనా కనీసం వుండాలి. ఇతరులకి మనం తోడ్పడితే ఇతరులు మనకి తోడ్పడతారు. అదే సంఘీభావం అంటే.

సంఘసేవ ఎలా చెయ్యాలి ? ఏ పనులు చేస్తే సంఘసేవ అవుతుంది ? విద్యార్థులు చేయదగిన కార్యక్రమాలు ఏవి ? అంటే-

1) ప్రమాదాల బారినుండి కాపాడటం, 2) వృద్ధులకి, అంగవికలురకి చేయూతనివ్వటం, 3) ఆపదలో ఉన్నవారికి సహకారమందించటం, 4) విద్యాదానం చేయటం, 5) మురికివాడల్ని పరిశుభ్రం చెయ్యటం మొదలగునవి.

ఇవి ఏ విద్యార్థి అయినా చేయదగిన కనీస కార్యక్రమాలు. సంఘసేవకి పదవులు అక్కరలేదు. ధనమూ అంతగా అవసరం లేదు. సేవా తత్పరత వుంటే చాలు. మానవతా దృక్పథం వుంటే చాలు. కొందరు కీర్తికోసం, ప్రచారం కోసం సేవచేస్తున్నట్టు నటిస్తారు. అది స్వార్థ పూరితమైన ప్రవర్తన అవుతుంది. విద్యార్థులు అటువంటివారు కారు. నిజంగా తలుచుకుంటే విద్యార్థులు చేయలేనిది ఏమీ ఉండదు. ఉత్సాహం, బలం, ఆసక్తి గల విద్యార్థులే అసలైన సంఘసేవా పరాయణులుగా ఉంటారు. అందుకనే జాతీయ సేవా పథకం (National Service Scheme - NSF) విద్యాలయాలలో ప్రవేశపెట్టారు.

ప్రతి కళాశాలలోను ఈ జాతీయ సేవా పథకంలో చాలామంది విద్యార్థులు చేరి సంఘసేవ చేస్తున్నారు. హైస్కూల్సులో ఎన్.సి.సి., స్కౌట్స్‌లలో కూడా చేరి సంఘసేవ చేస్తున్నారు. ఒక విధంగా ప్రభుత్వ సంస్థలు, దేశసేవకు లనిపించుకొనే నాయకులు చేయని, చేయలేని పనులు విద్యార్థులు చేసి చూపించడం ప్రశంసనీయం.

విద్యార్థులు ఈ విధంగా సంఘసేవ చెయ్యటంలో వారికొక ఆత్మసంతృప్తి కలుగుతుంది. ఆత్మవిశ్వాసం ఏర్పడుతుంది. తమ దేశభక్తిని ప్రకటించుకొనే సువర్ణావకాశం సంఘసేవ. కార్యదీక్షా దక్షతలు అలవడతాయి. కాబట్టి విద్యార్థుల్ని సత్పౌరులుగా తీర్చిదిద్దే సంఘసేవా కార్యక్రమాలకి ప్రభుత్వం ప్రోత్సాహం ఇవ్వాలి.

## 20. మద్యపానం - అనర్థాలు

మత్తును, మదమును కలిగించేది మద్యం. కల్లు, సారావంటి స్వదేశీ పానీయాలు, విస్కీ బ్రాంది వంటి విదేశీ పానీయాలు కూడా మద్యాలే. వీటిని త్రాగడం మద్యపానం అంటారు. కాబట్టి అటువంటి పానీయాలు త్రాగరాదని చట్టం తీసుకువచ్చి అమలు చెయ్యాలనటమే "మద్యపాన నిషేధం" అంటారు.

స్వాతంత్ర్య సమరంలో మద్యపాన నిషేధం ఒక ఉద్యమంగా సాగింది. "కల్లు మానండోయ్ బాబు కళ్ళు తెరవండోయ్" అని తెలుగు కవులు ఎలుగెత్తి ప్రబోధించారు. మహాత్మాగాంధీ సంపూర్ణ మద్యపాన నిషేధం పాటించాలని 1925లోనే పిలుపునిచ్చారు. స్వాతంత్ర్యం సాధించిన పిమ్మట కూడా చాలా రాష్ట్రాలు మద్యపాన నిషేధాన్ని అమలు పరచటంలో తీవ్రంగా విఫలమయ్యాయి.

మద్యపానం వల్ల చాలా అనర్థాలున్నాయి.

1. మద్యపానం మనిషి కాలేయాన్ని క్షీణింపచేసి, అనారోగ్యానికి గురిచేస్తుంది.
2. మద్యపానం వలన నాడీ మండలం సరిగా పనిచేయక జ్ఞాపకశక్తి నశిస్తుంది.
3. తాగుడు అకాల మరణానికి కారణం అవుతుంది.
4. మద్యపానం వలన అసభ్య ప్రవర్తన ఏర్పడి సమాజంలో గౌరవాన్ని కోల్పోతారు.
5. మద్యపానం వలన ఆర్థికంగా చితికిపోయి కుటుంబం కష్టాలపాలౌతుంది.
6. మద్యపానం వలన సాంఘిక దురాచారాలు పెచ్చుపెరిగి మన సంస్కృతికి కళంకం ఏర్పడుతుంది.

ఈ దురలవాటు వలన వ్యక్తి ఆర్థికంగా, శారీరకంగా, నైతికంగా, మానసికంగా, సామాజికంగా పతనమవడమేగాక సమాజంలో, కుటుంబంలో తన స్థానాన్ని గూడా క్రమంగా కోల్పోతాడు. కాబట్టి దీనిని మననుండి పారద్రోలుటకు మనమందరం సమిష్టిగా కృషి చేద్దాం.

## 21. ఆధునిక సాంకేతిక ప్రగతి

మానవ జీవితంలో ఎలక్ట్రానిక్ వస్తువుల ఉపయోగం నిత్యకృత్యమయింది. గడియారం, రేడియో, టేప్ రికార్డర్, టి.వి., టెలిఫోన్, ఫ్రిజ్ ఇలా ఎన్నో ఎలక్ట్రానిక్ వస్తువుల జాబితాను చెప్పవచ్చు. ఇలాంటి ఎలక్ట్రానిక్ వస్తువుల జాబితాలోకి చెందిన వాటిలో కంప్యూటర్ ముఖ్యంగా పేర్కోదగింది. ఆధునిక సాంకేతిక ప్రగతికి నిదర్శనం కంప్యూటర్.

ఒకనాడు టెలిఫోన్ కనిపెట్టినందుకు, రేడియో తయారు చేసినందుకు ఆశ్చర్యపోయాం. ఇప్పుడు దేశ విదేశాలకు నేరుగా వెంటనే మాట్లాడే అవకాశం ఏర్పడింది. మూవింగ్ ఫోన్లు, ఎలక్ట్రానిక్ ఫోన్లు, కార్డ్‌లెస్ ఫోన్లు, సెల్యులర్ ఫోన్లు ప్రవేశించాయి. 'పేజర్' అనే అద్భుత సాధనం అందుబాటులోకి వచ్చింది. 'దూరదర్శన్' మనకి ఈనాడు అత్యవసర సాధనమయింది. ఇవన్నీ ఆధునిక సాంకేతిక ప్రగతికి నిదర్శనాలే. ప్రపంచాన్నే మన గుప్పెట్లోకి తీసుకొని వచ్చిన సెల్‌ఫోన్ గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు.

కంప్యూటర్‌ను కనుక్కోవడంతో ప్రపంచం పూర్తిగా మారిపోయింది. ఇది కంప్యూటర్ యుగం అనిపించుకుంటోంది. మనిషికన్నా వేగంగా చకచకా శాస్త్రీయంగా కంప్యూటర్లు పనిచేస్తున్నాయి. "ఇంతింతై వటుడింతయై ................" అన్నట్లుగా ఈనాడు కంప్యూటర్ అన్ని రంగాలలో విస్తరించింది. ఇప్పుడు ఎక్కడ చూసినా, ఎవరి నోట విన్నా కంప్యూటర్ తప్ప మరోమాట వినిపించదు. అలాగే ల్యాప్‌టాప్ కూడా.

మనిషి కొన్ని రోజుల్లోగానీ అందించలేని సమాచారం కంప్యూటర్ కొన్ని క్షణాల్లోనే అందిస్తుంది. కంప్యూటర్‌లోని ఇంటర్‌నెట్ సదుపాయంవల్ల ప్రపంచంలో ఏ మూలనైనా జరిగే వింతలూ విశేషాలూ క్షణాల్లో తెలుసుకోగలం. ఇంటర్‌నెట్‌లో ఉన్న గొప్ప సదుపాయం ఇ-మెయిల్ (E - mail). దీని ద్వారా మనం అనుకున్న సమాచారాన్ని కంప్యూటర్‌లో ఇంటర్‌నెట్ కలిగి ఉన్న మరొక వ్యక్తికి కొన్ని క్షణాల్లోనే అందజేయవచ్చు. ఈ విధంగా ఆధునిక సాంకేతిక ప్రగతి దినదినాభివృద్ధి చెందుతోంది.

## 22. నిరక్షరాస్యతా నిర్మూలనం (సంపూర్ణ అక్షరాస్యత)

నిరక్షరాస్యత అంటే చదవటం, వ్రాయటం చేతకాకపోవడం అని అర్థం. అట్టి నిరక్షరాస్యతను పోగొట్టి అందరిని అక్షరాస్యులుగా చేయటమే నిరక్షరాస్యతా నిర్మూలనం.

ప్రతి వ్యక్తి అక్షరాస్యుడైతేనే దేశం ప్రగతి పథంలో నడుస్తుంది. ముఖ్యంగా ప్రజాస్వామ్య దేశంలోని పౌరులందరూ అక్షరాస్యులైతేనే సరైన నాయకులను పరిపాలనాధికారులుగా ఎన్నుకోగలుగుతారు. అక్షరాస్యులు ఇతరుల మోసానికి అంత తేలికగా గురికారు.

మన దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన నాటి నుండి నేటి వరకు ఈ నిరక్షరాస్యతా నిర్మూలనకు ఎంతగానో కృషి చేస్తూనే ఉన్నారు. నిర్బంధ ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టారు. వయోజనులకు రాత్రి పాఠశాలలు ఏర్పరచారు. స్త్రీ విద్యను ప్రోత్సహించటానికి వారికి ప్రత్యేక పాఠశాలలు నెలకొల్పారు. అనియత విద్యాపథకం ప్రవేశపెట్టారు. వెనుకబడిన జాతులవారిని విద్యావంతులుగా చేయటానికై ఉచితంగా పాఠ్య గ్రంథాలను పంచిపెట్టి ప్రోత్సహిస్తున్నారు. ఇంకా అనేక విధాల అందరిని అక్షరాస్యులుగా చేయటానికి ప్రయత్నిస్తున్నారు. అయినా విద్యావంతుల శాతం ఇంకా తక్కువగానే ఉన్నది.

నిరక్షరాస్యతా నిర్మూలనం జరగాలంటే విద్యావంతుడైన ప్రతి వ్యక్తి మరొక పదిమందిని అక్షరాస్యులుగా చేయటానికి కృషి చేయాలి. ప్రభుత్వం కూడా ఆకాశవాణిని, దూరదర్శినిని, ఆడియో, వీడియో క్యాసెట్ల వంటి వాటిని బోధనోపకరణాలుగా ఉపయోగించి ప్రజలను విజ్ఞానవంతులుగా చేయాలి. అప్పుడే సంపూర్ణ అక్షరాస్యత సాధ్యమవుతుంది.

## 23. జాతీయ నాయకుడు (మహాత్మాగాంధీ)

మహాత్మాగాంధీ అసలుపేరు మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ. కానీ భారత ప్రజలు ఆత్మీయంగా 'బాపూజీ' అని పిలిచేవారు. 'మహాత్మా' అని గౌరవించేవారు. భారతజాతి మహాత్మాగాంధీని 'జాతిపిత' గా గౌరవించి కృతజ్ఞత ప్రకటించుకుంది.

గాంధీజీ దక్షిణాఫ్రికా వెళ్ళినప్పుడు అక్కడున్న భారతీయుల దాస్య వృత్తిని చూసి చలించిపోయాడు. ఆంగ్లేయుల ప్రవర్తన సహించలేక ఎదురుతిరిగాడు. ఎన్నో కష్టాలకు లోనయ్యాడు.

స్వదేశానికి తిరిగి వచ్చిన గాంధీజీ భారతీయుల బానిస బ్రతుకుల్ని చూసి సహించలేకపోయాడు. భారతమాత పరాయి పాలకుల సంకెళ్ళలో బందీగా ఉన్నందుకు గాంధీ తల్లడిల్లాడు. ఆంగ్లేయులపై స్వాతంత్ర్య సమరం ప్రకటించాడు. శాంతి, సత్యం, అహింస అనే ఆయుధాలతో స్వాతంత్ర్య సమరం చేపట్టాడు. స్వరాజ్య ఉద్యమానికి కాంగ్రెసు సంఘం స్థాపించాడు.

ఉప్పు సత్యాగ్రహం, క్విట్ ఇండియా, విదేశీ వస్తు బహిష్కరణ, సహాయ నిరాకరణ, ఖద్దరు ఉద్యమాలను చేపట్టి ఆంగ్లేయులను గుక్క తిప్పుకోనీకుండా గడగడలాడించాడు. సత్యాగ్రహం, నిరాహారదీక్షల ద్వారా భారతజాతిని జాగృతం చేసి ఆంగ్లేయుల గుండెలు దద్దరిల్ల జేశాడు.

అనేక జాతులు, కులాలు, మతాలు, భాషలు గల దేశ ప్రజల్ని ఒకే త్రాటి మీద నడిపించి, సమైక్యంగా పోరాటం సాగించాడు. గాంధీ నడిపించిన ఉద్యమం వల్ల 1947, ఆగస్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది. దుడ్డు కర్ర, అంగవస్త్రం, కిర్రు చెప్పులు గల గాంధీ ప్రపంచ దేశాలచేత జేజేలు అందుకున్నాడు.

## 24. ప్రపంచ శాంతి (విశ్వశాంతి)

శాంతి అంటే శమము లేదా ఓర్పు అని అర్థం. బాధలు, దుఃఖాలు, ప్రకృతి వైపరీత్యాలు, మానవ కల్పితమగు ఉపద్రవాలు ప్రాణికోటికి కష్ట నష్టాలు కలిగిస్తున్నాయి. లోకపు మనుగడకే ముప్పు తెచ్చిపెడుతున్నాయి. భూమండలంపై ఉన్న సమస్త ప్రాణులు ఎటువంటి ఉపద్రవాలు లేకుండా కూడు, గూడు, గుడ్డ కలిగి సుఖంగా జీవించడమే ప్రపంచ శాంతి.

సహజంగా ప్రకృతి వైపరీత్యాల వల్ల ప్రపంచ మానవాళికి కష్టాలు కలుగుతాయి. భూకంపాలు, వరదలు, తుఫానులు, అతివృష్టి, అనావృష్టి వంటి వాటి వల్ల ప్రజలు నానా ఇబ్బందులు పడతారు. వాటి వల్ల జరిగే నష్టాన్ని తగ్గించడానికి శాస్త్రజ్ఞులంతా కృషి చేస్తున్నారు.

మానవ కల్పితాలైన ఉపద్రవాలు నేడు ప్రపంచ శాంతికి తీరని ప్రమాదాన్ని తెచ్చిపెడుతున్నాయి. ఒక దేశంవారు మరో దేశంపై సాగించే యుద్ధాలు ఇటువంటివే. యుద్ధం వల్ల ఓడిపోయిన వారికే కాక గెలిచిన వారికి కూడా ఎంతో నష్టం కలుగుతుంది. 20వ శతాబ్దంలో జరిగిన రెండు ప్రపంచ యుద్ధాల వల్ల ప్రజలలో భయాందోళనలు పెరిగి అశాంతి వాతావరణం నెలకొంది. మొదటి ప్రపంచ యుద్ధం తరువాత నానాజాతి సమితి, రెండో ప్రపంచయుద్ధం తరువాత ఐక్యరాజ్య సమితి ఏర్పడ్డా అవి ప్రపంచ శాంతికి సరైన కృషిని కొనసాగించలేకపోయాయి.

నేడు శ్రీలంక తమిళుల సమస్య, దక్షిణాఫ్రికా వర్ణ వివక్షత, పంజాబ్‌లోని టెర్రరిస్టుల చర్యలు మొదలైనవి మరో ప్రపంచ యుద్ధానికి దారి తీస్తాయేమో అనే భయాందోళనలు కలిగిస్తున్నాయి.

నేడు ప్రపంచ శాంతి నెలకొల్పడానికై వివిధ దేశాలు గణనీయమైన కృషి చేస్తున్నాయి. అందులో భారతదేశం ఒకటి. ప్రపంచ దేశాల మధ్య స్నేహభావాన్ని పెంచి శాంతి చేకూర్చడానికి నెహ్రూగారి పంచశీల సిద్ధాంతాన్ని ఆచరించటం మంచిది.

## 25. బాలకార్మికులు

నిరక్షరాస్యత, కుటుంబ ఆర్థిక పరిస్థితులు, కరువు కాటకాల కారణంగా లక్షలాది పిల్లలు చిన్న వయస్సులోనే కార్మికులుగా చేరుతున్నారని అంతర్జాతీయ కార్మిక నిర్వహణ సంస్థ (ఐ.ఎల్.ఒ) తన సర్వేలో వెల్లడించింది.

ప్రపంచంలో ఏ దేశంలోనూ లేనంతగా భారతదేశంలో బాలకార్మిక వ్యవస్థ ఉందని ఐ.ఎల్.ఒ. నిర్వహించిన సర్వేలో తెలియజేసింది. దేశంలో ఆంధ్రప్రదేశ్‌లోనే అత్యధికంగా బాల కార్మికులు ఉన్నారని ఆ నివేదికలో పేర్కొన్నారు.

బాలకార్మిక వ్యవస్థను నిర్మూలించడానికి చర్యలు తీసుకుంటామని ప్రభుత్వం పలు సందర్భాలలో చేస్తున్న ప్రకటనలు కేవలం ప్రకటనలుగానే మిగిలిపోతున్నాయి. కాబట్టి నిర్దిష్టమైన ప్రణాళికను ఏర్పాటు చేసి అది అమలు జరిగేటట్లు చూడాలి. ప్రభుత్వం రూపొందించిన బాల కార్మిక నియంత్రణ చట్టం సరిగా అమలు అయ్యేట్లు చూడాలి.

భారతదేశంలో 8.7 కోట్ల మంది బాలలు పాఠశాలలకు వెళ్ళడం లేదని, వీరంతా ఇళ్ళలోను, కర్మాగారాల్లోను, పొలాల్లోను పని చేస్తున్నారని 'గ్లోబల్ మార్చ్ ఎగనెస్ట్ చైల్డ్ లేబర్' అనే అంతర్జాతీయ సంస్థ పేర్కొంది. కాబట్టి బాల కార్మికుల కోసం ప్రత్యేక పాఠశాలలు నెలకొల్పాలి. వాళ్ళు చదువుకొనే అవకాశం కల్పించాలి.

బాల కార్మికులను కూలివారుగానే చూస్తే వారు కార్మికులుగానే మిగిలిపోతారు. వారిలో ఉన్న యోగ్యతను, ప్రతిభను వెలికి తీసేందుకు సహకారం అందజేస్తే భవిష్యత్తులో ఒక మంచి నిపుణుడిని అందించేందుకు అవకాశం ఉంటుంది. కాబట్టి ప్రజలు కూడా బాల కార్మిక వ్యవస్థ నిర్మూలనకు సహకరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

## 26. జల సంరక్షణ

ప్రాణికోటి జీవించడానికి ఆహారం ఎంత ముఖ్యమో నీరు కూడా అంతే ముఖ్యమైనది. మానవుడు నిద్రలేచింది మొదలు ఏది లేకపోయినా కొంతవరకు సర్దుకుపోవచ్చునేమో కానీ 'నీరు' లేకపోతే గడవటం చాలా కష్టం.

పుష్కలంగా సహజవనరులు, జీవనదులు, పాడిపంటలు గల రాష్ట్రం మనది. అయినా అందరికీ సాగునీరు, త్రాగునీరు అందక అల్లాడిపోతున్నారు. దానికి కారణం నీటి నిర్వహణలో ఉన్న లోపమే. సకాలంలో తగిన వర్షాలు లేకపోవడం, పడిన వర్షపు నీటిని తగురీతిలో భూగర్భజలాల్లోకి ఇంకింపచేయలేకపోవడం తదితర కారణాలవల్ల రాష్ట్ర ప్రజలు తరచుగా తీవ్ర కరవు పరిస్థితులు ఎదుర్కోవలసివస్తున్నది. ఇటువంటి దయనీయ పరిస్థితులు భవిష్యత్తులో తలెత్తకుండా నీటి ప్రాధాన్యతను గుర్తించి తగు చర్యలు తీసుకోవాలి.

భూగర్భ జలమట్టాలు పెరిగి త్రాగునీరు, సాగునీరు సమస్యలన్నీ తీరిపోవాలంటే పడిన వర్షపు నీటిలో అధిక భాగం భూమిలోకి ఇంకేటట్లు చూడాలి. దీనికోసం ప్రజలందరూ సమిష్టిగా నీటి సంరక్షణ కోసం తగు చర్యలు చేపట్టాలి.

నీటి పరిరక్షణకు ఊట చెరువులు, కుంటలు తవ్వాలి. వాలుతల ప్రాంతాల్లో కాంటూరు కందకాలు ఏర్పాటు చేయాలి. ఇది వరకే ఉన్న కాలువలు, చెరువులు పూడిపోయి ఉంటే మరమ్మత్తులు చేయించి నీరు నిల్వ ఉండే సామర్థ్యాన్ని పెంచాలి.

## 27. మాతృభాషలో విద్యాబోధన

ఆంగ్లేయుల పాలనాకాలంలో ఆంగ్లభాష రాజభాష అయింది. అదే విద్యాలయాల్లో బోధనాభాషగా స్థిరపడిపోయింది. ప్రాంతీయ భాషల ప్రాధాన్యం తగ్గిపోయింది. మనకు స్వాతంత్ర్యం వచ్చి ఐదు దశాబ్దాలు దాటినా మనం పరభాషా దాస్యం చేస్తూనే ఉన్నాం.

ఏదైనా విషయం పూర్తిగా అవగాహన కావాలంటే అది మాతృభాషలోనే బోధించాలి. విద్యార్థులు ఏ భాషలో ఆలోచిస్తారో, కలలుకంటారో ఆ భాషలోనే విద్యాబోధన జరగటం మంచిది. పరభాషయైన ఇంగ్లీషులో బోధన జరిగితే అది నేర్చుకోడానికే చాలా శ్రమపడాలి. దాన్ని అర్థం చేసుకొని విషయాన్ని గ్రహించడం కష్టమవుతుంది. కాబట్టి విద్యార్థులు ఎక్కువ విజ్ఞానాన్ని సంపాదించాలంటే మాతృభాషలోనే విద్యాబోధన జరగాలి.

మాతృభాషలో బోధించడం వల్ల భాషాకాఠిన్యం తగ్గుతుంది. విషయం సులభంగా అర్థమవుతుంది. ఒకసారి విషయం అర్థమయిన **తరువాత** బట్టీ పట్టాల్సిన అవసరం ఉండదు. విద్యార్థి సొంత జవాబులు చెప్పగలుగుతాడు. స్వయంగా ఊహించి **రాయగలుగుతాడు.**

**అంతర్జాతీయ** భాషగా ఉన్న ఆంగ్లంలో కాకుండా మాతృభాషలో విద్యాభ్యాసం చేస్తే శాస్త్ర విజ్ఞానానికి దూరమవుతామని కొందరి భయం. రష్యా, ఫ్రాన్సు మొదలగు పాశ్చాత్య దేశాలలో అన్ని విషయాలు దేశభాషలలోనే బోధింపబడుతున్నాయి. అక్కడి విద్యార్థులు గొప్ప పరిశోధనలు చేసి శాస్త్ర విజ్ఞానంలో పేరు ప్రఖ్యాతులు పొందుతూనే ఉన్నారు. కాబట్టి లేనిపోని భయాలు, అనుమానాలు వదిలేసి మనవాళ్ళు కూడా మాతృభాషలోనే విద్యాబోధన చేయాలి.

## 28. సాంఘిక దురాచారాలు - విద్యార్థుల కర్తవ్యం

విద్యార్థులనగా విద్యను కోరేవారు. వారు కేవలం పాఠశాల, కళాశాల చదువులతోనే సంతృప్తి పడకుండా సమాజానికి ఉపయోగపడే సత్పౌరులు కావాలి. సంఘాన్ని సంస్కరించే సత్కార్యక్రమాలను అమలుపరచే సత్పౌరులు కావాలి.

సంఘంలో దురాచారాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. అంటరానితనం, మద్యపానం, ధూమపానం, మత్తుమందుల వాడకం, మూఢనమ్మకాలు, వరకట్నం, బాల్యవివాహాలు, వెట్టిచాకిరి, లంచగొండితనం, మతదురహంకారం వంటి దురాచారాలు సంఘంలో బాగా పేరుకు పోయాయి.

ప్రజలలో చాలామంది **నిరక్షరాస్యులు. వారిని** సరిదిద్ది వారిలో గల దురాచారాల్ని నిర్మూలించడంలో విద్యార్థులు తమ వంతు కృషి చేయాలి. విద్యార్థులు సాంఘిక దురాచారాన్ని చీల్చి చెండాడే వేటగాండ్రు కావాలి. సాంఘిక దురాచారాలను గురించి ప్రజలకు వివరించి చెప్పి వానిని ప్రజలు మానేటట్లు చేయడం విద్యార్థుల కర్తవ్యం.

N.C.C., N.S.S., స్కౌటింగ్, రెడ్‌క్రాస్ మొదలైన సంస్థల ద్వారా విద్యార్థులు ఈ సాంఘిక సేవలో పాలు పంచుకోవచ్చు. విద్యార్థులు తలచుకుంటే దేశంలోని ప్రజల దురాచారాన్ని తప్పక నిర్మూలించగలరు. కాబట్టి విద్యార్థులు ఆదర్శ జీవితం గడుపుతూ సాంఘిక దురాచారాన్ని సమూలంగా నిర్మూలించడం తమ కర్తవ్యంగా భావించాలి.

## 29. నదీజలాల సంరక్షణ

నేలలో విత్తనాలు చల్లి నీటి కోసం నింగివైపు చూసే ఎన్నో గ్రామాలు నేటికీ మన దేశంలో ఉన్నాయి. నదీజలాల అదుపు, పొదుపు లేకపోవడం వల్ల అవి సముద్రం వైపు పరుగులు తీస్తున్నాయి. దాంతో సాగునీటికీ, తాగునీటికీ తీవ్రమైన కొరత ఏర్పడుతోంది.

నదులకు ఆనకట్టలు కట్టి దేశాన్ని సస్యశ్యామలం చేయాల్సిన పథకాలు రూపొందించారు. కానీ అవి ఆర్థిక, రాజకీయ, పర్యావరణ కారణాల వల్ల నత్తనడక నడవడమో, నీరుకారిపోవడమో సంభవిస్తోంది. దీనికి ఉదాహరణగా నర్మదా ప్రాజెక్టును చెప్పుకోవచ్చు. నెర్రెలు విచ్చిన భూమినీ, దాహంతో పిడచకట్టుకుపోయిన నోళ్ళనీ ఆదుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది. లేకపోతే మానవ మనుగడకే ముప్పు వాటిల్లుతుంది. అందువల్ల నదీజలాల సంరక్షణ చేపట్టి సాగునీటికీ, తాగునీటికీ కొరత లేకుండా చూడాలి.

పెరుగుతున్న జనాభాతో పాటు జలవనరులు పెరగడం అసాధ్యం. కాబట్టి ప్రస్తుత పరిస్థితుల్లో ఏ దేశానికైనా రెండే ప్రత్యామ్నాయాలు ఉన్నాయి. ఒకటి అందుబాటులో ఉన్న వనరుల్ని పొదుపుగా వాడటం. రెండోది అభివృద్ధిపరచడం సాధ్యం కాకపోయినా, ప్రస్తుత స్థాయిని పరిరక్షించడం. అందువల్ల నదీజలాల సంరక్షణ గావించి, పొదుపుగా వాడుకోవడం సరైన మార్గం.

నదులపైన నిర్మించే ఆనకట్టలు, బహుళార్థక ప్రయోజనాలు సాధించే పథకాలు, నదుల అనుసంధానం, వివిధ రాష్ట్రాల మధ్య నదీజలాల పంపిణీ లాంటివి, వివిధ కారణాలవల్ల త్వరగా పూర్తికావడం లేదు. అందుమూలంగా మనదేశంలోని వివిధ ప్రాంతాలు వర్షాల మీదే ఆధారపడుతున్నాయి. సకాలంలో వర్షాలు పడక నానా యాతనలు పడాల్సివస్తోంది. కాబట్టి దేశం సుభిక్షంగా ఉండాలంటే నదీజలాలు వృథా కాకుండా సంరక్షించుకోవాల్సిన బాధ్యత దేశ ప్రజలందరిపైనా ఉంది.

## 30. నవ సమాజ నిర్మాణంలో విద్యార్థుల పాత్ర

ప్రజల లేదా జాతుల సమూహాన్ని సమాజం అంటారు. నూతన సమాజ నిర్మాణం కోసం విద్యార్థులు పోషించాల్సిన పాత్ర ఎంతయినా ఉందనడంలో అతిశయోక్తి లేదు. 'నేటి విద్యార్థులే రేపటి పౌరులు' కదా.

వ్యక్తుల, సమాజాల అభివృద్ధిలో అక్షరాస్యత (విద్య) ప్రధానపాత్ర వహిస్తుంది. మన సమాజంలో 'విద్య లేని వాడు వింత పశువు' అనే నానుడి కూడా వాడుకలో ఉంది. వివిధ సందర్భాలలో వ్యక్తులయొక్క అసహాయతకు నిరక్షరాస్యత కారణమవుతుంది. కాబట్టి విద్యార్థులు తాము ఒక పక్క చదువుకుంటూనే మరొక పక్క నిరక్షరాస్యులను అక్షరాస్యులుగా మార్చడానికి పాటుపడాలి.

మనమంతా భారతీయులం. 'భిన్నత్వంలో ఏకత్వం' అనేది మనదేశ విశిష్టత. కాబట్టి కుల, మత, ప్రాంతీయతత్వ, భాషా భేదాలతో నిమిత్తం లేకుండా మెలగుతూ విద్యార్థులు నవసమాజ నిర్మాణానికి ఆదర్శవంతులుగా మెలగాలి. ప్రజలలో లౌకిక విలువలను, విశాల దృక్పథాలను పెంపొందించాలి.

విద్యార్థులు సాంఘిక దురాచారాలను నిర్మూలించాలి. మూఢ నమ్మకాలను పారద్రోలాలి. జాతీయ సమైక్యత, దేశ సమగ్రత వంటివి అభివృద్ధి చేయాలి. మానవ సేవయే మాధవ సేవగా భావిస్తూ, సామాజిక సేవా దృక్పథం కలిగి ఉండాలి. విద్యా, వైజ్ఞానిక, శాస్త్ర, సాంకేతికాది వివిధ రంగాలలో దేశాభివృద్ధికి పాటుపడుతూ దేశభక్తిని ప్రదర్శించాలి.

నవ సమాజ నిర్మాణానికి విద్యార్థులు చిత్త శుద్ధి, అంకిత భావంతో పని చేయాలి. నిర్దుష్ట ప్రణాళిక, విస్పష్ట కార్యాచరణ వ్యూహం కలిగి ఉండాలి. "వట్టి మాటలు కట్టిపెట్టి గట్టి మేల్ తలపెట్టాలి."

## 31. ఇంధన వనరులు

బొగ్గు, గ్యాస్, చమురు, విద్యుచ్ఛక్తి మొదలైన ఇంధనాలతో మన నిత్యజీవితం ముడిపడి ఉంది. మనం అభివృద్ధి సాధించడమనేది ఇంధన వనరుల సమర్థ వినియోగం మీదే ఆధారపడి ఉంటుంది.

ఇంధన వనరులు రెండు రకాలు. 1 - సాంప్రదాయిక వనరులు 2. సాంప్రదాయికేతర వనరులు.

బొగ్గు, గ్యాస్, చమురు మొదలైనవి సాంప్రదాయిక వనరులు. సౌరశక్తి, గాలిశక్తి, జలప్రవాహశక్తి, భూగర్భ ఉష్ణశక్తి, సముద్రజలాల ఉష్ణప్రవణత శక్తి మొదలైనవి సాంప్రదాయికేతర వనరులు.

సాంప్రదాయిక ఇంధనాలైన బొగ్గు, గ్యాస్, చమురు మొదలైన వాటిని వాడేసుకుంటున్నందువల్ల ఇవి తిరిగి లభ్యంకావు కాబట్టి ప్రపంచ దేశాలు ఇంధన సంక్షోభాన్ని ఎదుర్కొనే పరిస్థితిని తట్టుకోవలసి వస్తుంది. కాబట్టి సాంప్రదాయికేతర ఇంధనాల వినియోగానికి ఆలోచనలు వచ్చాయి.

సౌరశక్తి, జలప్రవాహశక్తి, గాలి శక్తి అనే మూడింటిని సహజ ప్రత్యామ్నాయ ఇంధనాలుగా గుర్తించారు. బొగ్గు, చమురులా కాకుండా ఇవి వాతావరణ కాలుష్యానికి అతి తక్కువ పరిమాణంలో దోహదపడతాయని తెలుసుకున్నారు. ప్రత్యామ్నాయ ఇంధనాల వల్ల ఇంటి అవసరాలకు సరిపడే శక్తిని ఉత్పాదించుకోవచ్చు.

పశువుల పేడ నుంచి గోబర్ గ్యాస్‌ను ఉత్పత్తి చేసుకొన్నట్లయితే వంట చేయడం సులభమవుతుంది. ఇంధన సంక్షోభానికి ప్రత్యామ్నాయ ఇంధన వనరులు గొప్ప పరిష్కారం. కాలుష్య బెడద కూడా బాగా తగ్గిపోతుంది. మనకు లభిస్తున్న ఇంధన వనరులను పొదుపుగా వినియోగించుకుంటే దేశం అభివృద్ధి పథంలో సాగిపోతుంది.

## 32. వాతావరణ కాలుష్యం

'ఆరోగ్యమే మహాభాగ్యం' అన్నారు పెద్దలు. వాతావరణం పరిశుభ్రంగా ఉండి, చక్కటి ఆరోగ్యకరంగా ఉంటే మానవుని జీవితం ఆనందదాయకంగా ఉంటుంది. మానవునికి హానికరమైన పదార్థాలు వాతావరణంలో కలిసి ఉంటే దానిని వాతావరణ కాలుష్యం అంటారు.

వివిధ కర్మాగారాలు, పరిశ్రమలు, లెక్కలేనన్ని మోటారువాహనాలు, మురికినీరు మొదలైనవి వాతావరణ కాలుష్యానికి కారణాలు. కర్మాగారాల వల్ల నదులన్నీ మురికినీరుతో నిండిపోయి జలకాలుష్యం ఏర్పడుతోంది. పరిశ్రమలవల్ల గాలి కలుషితమవుతోంది. మోటారువాహనాల వల్ల నగరాలలోను, పట్టణాలలోను ధ్వని కాలుష్యం ఎక్కువవుతోంది.

వాతావరణ కాలుష్యం చాలా భయంకరంగా తయారయింది. పారిశ్రామికీకరణ వల్ల ఈ సమస్య మరీ ఘోరంగా తయారయింది. వాతావరణ కాలుష్యం మానవుని మనుగడకే పెద్ద సవాలుగా పరిణమించింది. దీనివల్ల ఉదరకోశవ్యాధులు, ఊపిరితిత్తుల వ్యాధులు, కేన్సర్, గుండెజబ్బుల వంటి వ్యాధులు పెరిగిపోతున్నాయి.

వాతావరణ కాలుష్య నివారణకు ప్రభుత్వం ప్రత్యేకమైన ప్రణాళికలు తయారుచేసి అమలు చేయాలి. పరిశ్రమలు, కర్మాగారాలు మానవుల నివాసాలకు దూరంగా నెలకొల్పాలి. ప్రతివ్యక్తి తనయింటినీ, పరిసరాలను పరిశుభ్రంగా ఉంచుకోవాలి. అవకాశం ఉన్నచోట మొక్కలను విరివిగా పెంచాలి. ఐక్యరాజ్యసమితి, ప్రపంచ ఆరోగ్యసంస్థలు పరిశోధనలు చేసి వాతావరణ కాలుష్య నివారణకు తగు సూచనలు చేయాలి.

## 33. కరువు - నివారణోపాయాలు

అనావృష్టి వల్ల కరువు వస్తుంది. కరువును క్షామం అని కూడా అంటారు. సామాన్య వర్షపాతంలో 75% కన్న తక్కువ వర్షపాతం ఉండే స్థితిని 'కరువు'గాను, 50% కన్న తక్కువ వర్షపాతం ఉండేస్థితిని 'తీవ్రమైన కరువు' గాను భారత వాతావరణ శాఖ నిర్వచించింది.

ఋతుపవనాల నియమరహిత స్వభావం వల్ల దేశంలో ఏదో ఒకచోట ప్రతి సంవత్సరం తరచుగా కరువులు సంభవిస్తున్నాయి. ఎక్కువగా వాయువ్య భారతదేశం, ఆ తరువాత దక్షిణ మరియు మధ్య భారతదేశంలో తరుచుగా కరువులు సంభవిస్తున్నాయి.. రాజస్థాన్, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, బీహార్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్, గుజరాత్, కర్ణాటక, తమిళనాడులు అతిగా కరువులు సంభవించే రాష్ట్రాలు.

**నివారణోపాయాలు :**

1. కరువు పీడిత ప్రాంతాలలో భూమిశిస్తు పూర్తిగా తొలగించడం గానీ, తగ్గించడం గానీ చేయాలి.
2. క్షామపీడిత ప్రాంతాలలో ప్రజలు తిరిగి వ్యవసాయం చేసుకొనేందుకు వీలుగా ఆర్థిక సహాయం అందించడం, నీటి పారుదల సౌకర్యాలు కల్పించడం వంటివి చేయాలి.
3. ఆయా ప్రాంతాలను బట్టి ఏయే పంటలు వేస్తే బాగా పండుతాయో వ్యవసాయదారులకు సూచనలివ్వాలి.
4. పండిన పంటలకు మార్కెటింగ్ సౌకర్యం కలిగించాలి.
5. తుఫానులు వచ్చినపుడు తట్టుకొని నిలబడి పంటనిచ్చే కొత్తరకాలను శాస్త్రజ్ఞులు కనిపెట్టాలి.
6. వాతావరణ సమతౌల్యాన్ని కాపాడాలి.

కరువు నష్టాలను తగ్గించేందుకు భారత ప్రభుత్వం "కరువుకు గురయ్యే ప్రాంతాల ప్రణాళిక" [Drought prone area programme] ప్రవేశపెట్టింది. ఈ ప్రణాళికలో నీటిపారుదల, మృత్తికా పరిరక్షణ వనీకరణ మొదలగు పథకాలున్నాయి. ప్రభుత్వమేకాకుండా ప్రజలు కూడా మానవతా దృష్టితో కరువుపీడిత ప్రాంతీయులను ఆదుకోవడం తమ కర్తవ్యంగా భావించాలి.

## 34. విద్యారంగం - కంప్యూటర్

ఈనాడు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కంప్యూటర్ మన జీవితంలో ఓ భాగం అయింది. విద్యా, వైద్య, వ్యాపార, వ్యవసాయ, సమాచార, సాంకేతిక రంగాలలో ఈ కంప్యూటర్లు ప్రముఖపాత్ర వహిస్తున్నాయి. కంప్యూటర్‌ను ఉపయోగించి ఇంటర్‌నెట్ అనే సౌకర్యం ద్వారా ప్రపంచంలో జరుగుతున్న విషయాలన్నింటిని మన ఇంట్లోని కంప్యూటర్ ముందు కూర్చొని తెలుసుకోవచ్చు. ఇంతటి అద్భుతశక్తి కంప్యూటర్‌కు ఉండబట్టే, విద్యారంగంలో నేడు కంప్యూటర్‌కు మిక్కిలి ప్రాధాన్యం లభించింది.

నేడు కె.జి. నుండి పి.జి. వరకు ఏదో ఒక రూపంలో కంప్యూటర్ విద్య అభ్యసిస్తూనే ఉన్నారు. కంప్యూటర్ విద్యలో వివిధ కోర్సులు నేర్పడానికి ప్రైవేటు విద్యాసంస్థలు పోటీపడుతున్నాయి. బోధనోపకరణాలలో కంప్యూటర్ ప్రముఖ స్థానాన్ని వహించింది. అభ్యాసకులు తమకు కావాల్సిన నైపుణ్యాలను, విజ్ఞానాన్ని కంప్యూటర్ల ద్వారా పొందుతున్నారు.

కంప్యూటర్‌పై విద్యాబోధనవల్ల విద్యార్థులలో సృజనాత్మకత, ఊహాశక్తి పెంపొందుతాయి. ఉపాధ్యాయులకు బోధనాసామర్థ్యం అభివృద్ధి చెందుతుంది. తరగతి గదిలో ఉపాధ్యాయుని బోధనను అందరు విద్యార్థులు సమానంగా గ్రహించలేరు. అటువంటివారికి నిదానంగా అభ్యసనం చేసుకొనే అవకాశం కంప్యూటర్ ద్వారా లభిస్తుంది. ఎప్పుడు కావాలంటే అప్పుడు నేర్చుకొనే అవకాశం ఉంది. కంప్యూటర్ విద్య అభ్యసించినవారికి వారివారి శక్తి సామర్థ్యాలను, మేధాసంపత్తిని బట్టి దేశవిదేశాలలో మంచి ఉద్యోగాలు లభించే అవకాశం ఉంది. కాబట్టి విద్యారంగంలో కంప్యూటర్ పాత్ర చాలా విశిష్టమైనదిగా చెప్పవచ్చు.

## 35. అందరికీ విద్య (సంపూర్ణ అక్షరాస్యత)

"విద్య లేనివాడు వింత పశువు" అని పెద్దలంటారు. చదవడం, రాయడం, లెక్కలు నేర్చుకోటమే అక్షరాస్యత. విద్యనేర్చినవాడు అన్ని రంగాలలో రాణిస్తాడు. విద్య దాచిపెట్టుకున్న ధనం లాంటిది. విద్య నేరిస్తే సుఖసంతోషాలు కల్గుతాయని విశ్వాసం. అందువల్లనే అందరూ చదువుకోవాలి.

ఇతర దేశాలతో పోల్చి చూస్తే మనదేశంలో చదువుకున్న వారి శాతం చాలా తక్కువ. దీనికి కారణాలు ప్రజల్లో చైతన్యం లేకపోవడం, మరియు పేదరికం. స్వాతంత్ర్యం లభించిననాటి నుండి ప్రతి పౌరుడికీ చదివే అవకాశాలు కల్పించాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి. చిన్నతనంలో చదువుకోలేక వయసు వచ్చిన వారికి అక్షర జ్ఞానం కలిగించే ప్రయత్నాలు కూడా జరుగుతున్నాయి.

మనదేశంలో కూడా మన రాష్ట్రం అక్షరాస్యతలో ఇతర రాష్ట్రాల కంటే చాలా వెనుకబడి ఉంది. ప్రభుత్వం 'అక్షర భారతి' మిషన్ ద్వారా సంపూర్ణ అక్షరాస్యత సాధించడానికి ప్రణాళికలు సిద్ధం చేసి అమలు పరుస్తోంది. నిరంతర విద్యాభ్యాసానికి బాపూజీ విజ్ఞాన కేంద్రాలను నెలకొల్పింది. అయినా విద్యాభివృద్ధికి చేయాల్సింది ఇంకా ఎంతో ఉంది.

1) ప్రీస్కూలు విద్యను విస్తరించాలి. తద్వారా ఐదేళ్ళ వయసున్న పిల్లలందరినీ పాఠశాలలకు రప్పించాలి.
2) పిల్లలందరూ పాఠశాలల్లో చేరి మధ్యలో బడి మానేయకుండా ఉండేటట్లు చూడాలి.
3) వయోజనులకు అవకాశాలను మెరుగుపరచాలి. వారు ప్రాథమిక విద్యా ప్రమాణాలు పొందగలగాలి. వారు నిత్య విద్యార్థులుగా మారాలి.
4) విద్య అందుబాటులో లేని సామాజిక గ్రూపులు, ప్రాంతాలకు వెళ్ళాలి. స్త్రీ పురుష అక్షరాస్యతలో వ్యత్యాసాన్ని తగ్గించాలి.
5) ఆకాశవాణి, దూరదర్శన్, ఆడియో, వీడియో, కంప్యూటర్ వంటి వాటిని బోధనోపకరణాలుగా ఉపయోగించాలి.
6) స్కూల్ కాంప్లెక్స్‌ల ఏర్పాటు, కమ్యూనిటీ లెర్నింగ్ సెంటర్లను బలోపేతం చేయాలి.

బాలకార్మిక వ్యవస్థ నిర్మూలన జరగనిదే సంపూర్ణ అక్షరాస్యత సాధించలేమనే వాస్తవాన్ని ప్రతి ఒక్కరూ గ్రహించాలి. ప్రభుత్వం ప్రవేశపెట్టిన 'బడిబాట' కార్యక్రమం నిరంతరంగా సాగిపోవాలి. ప్రభుత్వ విధానాలు, కార్యక్రమాల లక్ష్యసాధనలో ప్రజలందరు భాగస్వామ్యం వహించి, అకుంఠిత దీక్షతో ముందుకు సాగినపుడే సంపూర్ణ అక్షరాస్యతను సాధించగలుగుతాం.

"చదువు - చదివించు - చదువును కొనసాగించు".

## 36. ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు

'దేశభాషలందు తెలుగులెస్స' అని శ్రీకృష్ణదేవరాయలు అన్నాడు. అంతకంటే ముందే క్రీడాభిరామంలో 'దేశభాషలందు తెలుగులెస్స' అని శ్రీనాథుడు చెప్పాడు. తెలుగు భాష తెలిసిన పాశ్చాత్యులు కూడా మన తెలుగును 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అని ప్రశంసించారు. భాష రూపు మాసిపోతే జాతి అంతరించిపోతుంది. కాబట్టి మన తెలుగుభాషను మనమే కాపాడుకోవాలి.

నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథుడు, పోతన వంటి మహాకవులెందరో తెలుగుభాషను సుసంపన్నం చేశారు. తరువాత వచ్చిన మరెందరో కవులు, గాయకులు, రచయితలు, వివిధ కళాకారులు తెలుగుభాషకు వన్నెలు చిన్నెలు కూర్చినవారే. తెలుగుభాషలో మరే భాషయందు లేని సహజ మాధుర్యం ఉంది. మన మాతృభాష తెలుగులోని మాధుర్యాన్ని తల్లిదండ్రులే పిల్లలకు దూరం చేస్తున్నారు. పరభాషా వ్యామోహంలో పడి తెలుగును నిర్లక్ష్యం చేస్తున్నారు. 1956లో ఆంధ్రప్రదేశ్ అవతరిస్తే ఆ తరువాత పది సంవత్సరాలకు తెలుగును అధికార భాషగా ప్రకటించారు. విద్య, పాలన, శాసనం, చట్టం అన్నీ తెలుగు భాషలోనే జరగాలి. కానీ అలా జరగటంలేదు. ఇరుగుపొరుగు రాష్ట్రాలవారు తమ మాతృభాషకు అన్ని రంగాలలో పెద్దపీట వేస్తుండగా, మన ప్రభుత్వం మాత్రం అంతగా శ్రద్ధ వహించడంలేదు. అధికార భాషా సంఘం ఒక ఉత్సవ విగ్రహంలా తయారయింది.

మన తెలుగుకు ప్రాచీన భాష హోదా లభించినందులకు సంతోషించాలి. కానీ మన తెలుగును మనం ఎంతవరకు ఆదరిస్తున్నామో ఎవరికి వారే ప్రశ్నించుకోవాలి. తెలుగు భాషోద్యమ సమాఖ్య, తెలుగుభాషా చైతన్య సమితి వంటి సంస్థలు తెలుగు భాషాభివృద్ధికి తెలుగు మనుగడకు కావిస్తున్న కృషి అభినందనీయం.

## 37. విద్య - ప్రయోజనం

'విద్య' అంటే 'చదువు' అనే అర్థంలో మనం వాడతాం. 'విద్య' అంటే విజ్ఞానం కలిగించేదని అర్థం. 'విద్యలేని వాడు వింత పశువు' అని పెద్దలంటారు. విద్య నేర్చినవాడు అన్ని రంగాలలో రాణిస్తాడు.

ప్రతి వ్యక్తికి సహజంగా పుట్టుకతోడనే కొన్ని శక్తులుంటాయి. విద్య అనేది ఆ శక్తులను బయటికి తెచ్చి వికాసాన్ని కలిగిస్తుంది. విద్యావంతుడు ఇతరులపై ఆధారపడక తన జీవితాన్ని తాను సుఖవంతంగా గడుపుకోగలుగుతాడు. కాబట్టి అందరూ చదువుకోవాలి.

విద్య కల్పవృక్షం లాంటిది. అది అన్ని కోరికలను తీరుస్తుంది. తల్లిలాగా రక్షిస్తుంది. తండ్రిలాగా హితాన్ని బోధిస్తుంది. భార్యలాగా దుఃఖాన్ని పోగొట్టి ఆనందాన్ని చేకూరుస్తుంది. కీర్తిని అంతటా వ్యాపింపచేస్తుంది.

విద్య శీలసంపదను పెంచుతుంది. నైతిక విలువలను పెంపొందిస్తుంది. విద్య వ్యక్తి యొక్క సంపూర్ణ మూర్తిమత్వానికి సహాయపడుతుంది. విద్య క్రమశిక్షణకు పునాది వంటిది. మూర్ఖుడు తన ఇంట్లోనే గౌరవింపబడతాడు. ప్రభువు తన గ్రామంలోనే గౌరవింపబడతాడు. రాజు తన రాజ్యంలోనే గౌరవింపబడతాడు. కాని విద్యావంతుడు అంతటా గౌరవింపబడతాడు. అందుకే 'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' అన్నారు.

విద్య స్వదేశంలో మిత్రుని వంటిది. పరదేశంలో బంధువు లాంటిది. విద్యా ధనం సర్వ ధనాలలోకి ప్రధానమైనది. అందుకే విద్యాసంపద ఉంటే మిగిలిన సంపదలన్నీ దానివల్ల సాధించవచ్చు. ప్రతి వ్యక్తి విద్యావంతుడైతే దేశం ప్రగతిపథంలో నడుస్తుంది.



# భావావిష్కరణలు

## (Qn. No. 17 to 20 – 4 Marks)

*1. క్రింది వచనాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి :*

గాంధీ మహాత్ముడు పోరుబందరులో జన్మించాడు. అక్కడ అతని బాల్యంలో చదువు ఏ మాత్రమూ సాగలేదు. అతని తండ్రి పోరుబంధరు నుండి రాజకోట వచ్చి కొత్త ఉద్యోగంలో చేరాడు. అక్కడ గాంధీ విద్యార్థి జీవితం ప్రారంభం అయింది. అతడు ముందుగా సబర్బను స్కూలులోను, ఆ తరువాత హైస్కూలులోను చేరి చదువుకున్నాడు. విద్యార్థి దశలో అతను ఎక్కువ బిడియంతో ఉండి ఎవరితోను కలసి మెలిసి ఉండేవాడు కాదు. ఒకనాడు పరీక్షాధికారి అయిదు మాటలు చెప్పి వాటి వర్ణక్రమాన్ని వ్రాయమన్నాడు. వాటిలో కెటిల్ అనే మాటను గాంధి తప్పుగా వ్రాశాడు.

*ప్రశ్నలు :*

1. గాంధీ ఎక్కడ జన్మించాడు?
2. అతడు ఏయే స్కూళ్లల్లో చదువుకొన్నాడు?
3. విద్యార్థి దశలో అతను ఎలా ఉండేవాడు?
4. అతడు పరీక్షలో దేనిని తప్పుగా వ్రాశాడు?

**సమాధానాలు :**

1. గాంధీ పోరుబందరులో జన్మించాడు.
2. అతడు రాజకోటలోని సబర్బను స్కూలులోను, ఆ తరువాత హైస్కూలులోను చదువుకొన్నాడు.
3. విద్యార్థి దశలో అతను ఎక్కువ బిడియంతో ఉండి, ఎవరితోను కలిసి మెలిసి ఉండేవాడు కాదు.
4. అతడు పరీక్షలో 'కెటిల్' అనే మాటను తప్పుగా వ్రాశాడు.

*2. క్రింది గద్యభాగం చదివి ఇచ్చిన ప్రశ్నలకు సమాధానాలు రాయండి.*

"కవిత్వం, సంగీతం, నృత్యం, చిత్రలేఖనం, శిల్పం. ఈ ఐదింటిని లలిత కళలంటారు. ఈ కళల్లో కృష్ణరాయలకు తగినంత చొరవ ఉండేది. ఆయన ఆస్థానంలో కవులు, గాయకులు, నాట్యకారులు, చిత్రకారులు, శిల్పులు ఉండేవారు. వారు తమ తమ కళలను అద్భుతరీతిలో ప్రదర్శించి రాయల మన్ననలందుకొనేవారు. కళలు మానవుని హృదయాన్ని స్పందింపజేసే స్వభావం కలవి. కళలను ఆనందించలేనివాడు రాయిలాగే జడుడని చెప్పవచ్చు".

*ప్రశ్నలు :*

1. లలితకళ లేవి?
2. కవులు రాయల మన్ననలందుకొనడానికి గల కారణమేమి?
3. కళలను ఆనందించలేని వాడు రాయిలాగే జడుడు అంటే అర్థం ఏమిటి?
4. సంగీతం పాడేవారిని గాయకులంటారు. అలాగే చిత్రాలను వేసే వారిని ఏమంటారు?

**సమాధానాలు:**

1. కవిత్వం, సంగీతం, నృత్యం, చిత్రలేఖనం, శిల్పం అనే అయిదూ లలిత కళలు.
2. కవులు తమతమ కవితలను అద్భుత రీతిలో రచించేవారు. కాబట్టి రాయల మన్నన లందుకొనేవారు.
3. కళలను ఆనందించలేనివాడు హృదయ స్పందనలేని మూర్ఖుడని అర్థం.
4. చిత్రాలను వేసేవారిని చిత్రకారులు అంటారు.

*3. క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.*

'ఇరాన్' అనే మాటకు 'ఆర్యానాం' అని అర్థం. అంటే 'ఆర్యుల యొక్క' అని అర్థం. 'ఆర్య' అనే పదం ప్రాచీన పర్షియాలో ఉందనీ. ఆర్య, ఇరాన్ అనే పదాలకు సామ్యం ఉందనీ, పశ్చిమ దేశాల్లోని 'Eire' కీ ఆర్య శబ్దానికీ సామ్యం ఉందనీ బాషామ్ అనే చరిత్రకారుడి అభిప్రాయం. ఇట్లా సుదీర్ఘకాలంలో గుంపులుగా వచ్చిన ఆర్యులు ఒక భాషకూ ఒక జాతికీ చెందినవారు కారు. అందువల్ల ఆర్యజాతి అంటూ

ఒకటి లేదని ఆధునిక చరిత్రకారులు నిర్ధారణ చేశారు. క్రీ.పూ. 1500 నాటికి హిందూకుష్ పర్వత సానువులలో నుంచి భారతదేశానికి వచ్చిన ఆర్యులు సంచారులైన పశుపాలకులు. భారతదేశంలో మొదట వీరు ఉన్నది పశ్చిమోత్తర ప్రాంతం, అంటే పంజాబ్, సింధు ప్రాంతాలు. ఆ ప్రాంతాన్ని సప్తసింధు అన్నారు.

ప్రశ్నలు :

1. 'ఇరాన్' అంటే అర్థం ఏమిటి ?
2. 'ఆర్య' శబ్దం గురించి బాషామ్ అభిప్రాయం ఏమిటి ?
3. ఆర్యులు ఒకజాతి వారేనా ?
4. ఆర్యులు మొదట భారతదేశం ఎప్పుడు వచ్చారు ? అప్పటి వారి స్థితి ఏమిటి ?

సమాధానములు :

1. 'ఇరాన్' అంటే 'ఆర్యానాం' అని అర్థం. 'ఆర్యుల యొక్క' అని అర్థం.
2. 'ఆర్య' అనే పదం ప్రాచీన పర్షియాలో ఉందనీ, ఆర్య, ఇరాన్ అనే పదాలకు సామ్యం ఉందనీ, పశ్చిమ దేశాల్లోని 'Eire' కీ ఆర్య శబ్దానికీ సామ్యం ఉందనీ బాషామ్ అభిప్రాయం.
3. ఆర్యులు ఒక జాతివారు కాదు.
4. ఆర్యులు మొదట భారతదేశం క్రీ.పూ. 1500లో వచ్చారు. అప్పటి వారి స్థితి సంచారులైన పశుపాలకులు.

### 4. క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.

జనపదం అంటే పల్లెటూరు. జనపదాలలో ఉండేవారు జానపదులు. వారు పాడుకొనే పాటలు లేదా గేయాలను జానపద గేయాలంటారు. వీటినే ఇంగ్లీషులో ఫోక్ సాంగ్స్ అంటారు. ఉత్తర భారతదేశంలో జానపద గేయాలను 'లోక్ గీత్' లేదా 'లోక్ సాహిత్య' అంటారు. జానపద గేయానికి ఒక ప్రత్యేక కవి ఉండదు. జానపద గేయం సమిష్టి సంపద. శిష్ట సాహిత్యంలాగా కాక, జానపద సాహిత్యం పలువురి చేతులలో పెరిగినది. ఇది దాని మొదటి లక్షణం. గేయ రచనా కాలం స్పష్టంగా ఉండకపోవడం మరో లక్షణం. నదీనదాలూ, వాగులూ, వంకలూ మనకు ఉపయోగపడక, సముద్రం పాలయినట్లే జానపద గేయ స్రవంతి కూడా చాలా భాగం మనకు అందలేదు. ఇకనైనా దాన్ని ఉపయోగించి, భద్రపరచవలసిన అవసరం ఉంది.

ప్రశ్నలు :

1. జానపదులు అంటే ఎవరు ?
2. జానపద గేయాన్ని ఉత్తర భారతీయులేమని అంటారు ?
3. ఇంగ్లీషులో జానపద గేయాల్నేమని అంటారు ?
4. జానపద సాహిత్యం ప్రథమ లక్షణం ఏమిటి ?

సమాధానములు :

1. జనపదాలలో ఉండేవారు జానపదులు.
2 జానపద గేయాలను ఉత్తర భారతీయులు 'లోక్ గీత్' లేదా 'లోక్ సాహిత్య' అంటారు.
3. ఇంగ్లీషులో జానపద గేయాల్ని "ఫోక్ సాంగ్స్" అంటారు.
4. సమిష్టి సంపదయై, పలువురి చేతులలో పెరుగుట జానపద సాహిత్యపు ప్రథమ లక్షణము.

### 5. క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.

బ్రౌనును ఒక వ్యక్తిగా గాక, పెద్ద సాహిత్య సంస్థగా భావించడం అవసరం. యుగసంధ్యలో నిలిచిన ఈ వ్యక్తి అనేకానేక తాళపత్ర లిఖిత ప్రతులను సేకరించి, అవి ఎక్కడున్నాసరే, ఎంత ధనవ్యయమైనా సరే, లెక్క పెట్టకుండా, తన ఉద్యోగుల ద్వారా సంపాదించాడు. కొందరు పండితులను సమీకరించి, వారికి జీతభత్యాలిచ్చి, శుద్ధప్రతులు వ్రాయించి, కొన్నిటికి అర్థతాత్పర్యాలు సిద్ధం చేయించాడు. 'విశ్వదాభిరామ వినురవేమ' పద్యం తెలియని తెలుగువాడు లేదు. అయితే ఈ పద్యాలను మొదట తెలుగువాళ్ళకు పరిచయం చేసినది విదేశీయుడైన బ్రౌను. బ్రౌను పేరు స్మరించగానే మనకు ముందు స్ఫురించేది బ్రౌను నిఘంటువు. ఈ కృషి 1832లో ఆరంభించబడి 1853లో పూర్తి అయి ప్రథమ ముద్రణమయింది. ఈ కృషిలో బ్రౌను ఏనుగుల వీరాస్వామి సహాయం పొందాడు. వీరాస్వామి రచించిన కాశీయాత్ర గురించిన పుస్తకం చారిత్రకదృష్ట్యా విలువైనది.

ప్రశ్నలు :

1. తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు బ్రౌనును ఎట్లా పరిగణించడం భావ్యం ?
2. బ్రౌను సంపాదించిన పుస్తకాలను ఏమంటారు ?
3. పండితులతో బ్రౌను చేయించిన పనులేమిటి ?
4. నిఘంటువు ప్రథమ ముద్రణ ఎప్పుడు వచ్చింది ?

సమాధానములు :

1. తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు బ్రౌనును ఒక వ్యక్తిగా కాక, పెద్ద సాహిత్య సంస్థగా పరిగణించడం భావ్యం.
2. బ్రౌను సంపాదించిన పుస్తకాలను 'తాళపత్ర లిఖితప్రతులు' అంటారు.
3. పండితులతో బ్రౌను శుద్ధప్రతులు వ్రాయించి, కొన్నిటికి అర్థ తాత్పర్యాలు సిద్ధం చేయించాడు.
4. నిఘంటువు ప్రథమ ముద్రణ 1853లో వచ్చింది.

*6. క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.*

విజ్ఞాన శాస్త్రం ఎంతో పెరిగింది. దానివల్ల మనుషుల ఆలోచనలో మార్పు వచ్చింది. దాని ఫలితంగా జీవన విధానంలో చాలా మార్పులు వచ్చాయి. ఆ మార్పులన్నీ సాహిత్య ప్రక్రియల్లో కనపడుతూ ఉంటాయి. సామాన్య మనుషుల జీవితం, వాళ్ళ జీవితంలో సమస్యలు చిత్రించి, పరిష్కారం సూచించడమే సాహిత్యప్రక్రియలు చెయ్యవలసిన పని అనే భావం ఏర్పడింది. అందువల్ల సాహిత్యం ఇదివరకటిలాగా పండితులకు, జమీందారులకు పరిమితం కాదు. సాహిత్యం కేవలం చదివి ఆనందించడానికే అన్న అభిప్రాయాలు మారిపోయాయి. సామాన్యులలోకి సాహిత్యం వచ్చేసింది. అందుకు అనువైన ప్రక్రియలే కథానిక, నాటిక, ప్రహసనం, నవల మొదలైనవి. అందుకే వీటిలోని భాష వినగానే అర్థమయ్యేటంతగా సరళంగా ఉండటం ప్రధాన లక్షణమైంది. అంతేకాక రోజువారీ జీవితంలో సామాన్య ప్రజలు మాట్లాడే భాషే 'వ్యావహారికం' అనే పేరున ఒక స్పష్టమైన రూపంతో పత్రికలవల్ల బాగా ప్రచారం అయింది. ముఖ్యంగా నాటకాల్లో నాటికల్లో కథ అంతా పాత్రల సంభాషణ ద్వారానే జరుగుతుంది కనుక, ఆయా పాత్రలకు ఉచితమైన భాష ఆయా పాత్రల చేత పలికించడం అనేది ముఖ్యమైన లక్షణమైంది. ఉదాహరణకి, ఒక నాటికలో ఏమీ చదువుకోని ఒక పల్లెటూరి మనిషి గ్రాంథికభాషలో సంభాషణ జరిపినట్లు రచయిత రాస్తే ఆ నాటిక లక్ష్యమే దెబ్బతిని హాస్యాస్పదం అవుతుంది.

ప్రశ్నలు :

1. దేనివల్ల మనుషుల ఆలోచనలో మార్పు వచ్చింది ?
2. సాహిత్య ప్రక్రియలు చెయ్యవలసిన పని ఏమిటి ?
3. భాషకు ప్రధాన లక్షణం ఏమిటి ?
4. వ్యావహారికం అంటే ఏమిటి ?

సమాధానములు :

1. విజ్ఞాన శాస్త్రం వల్ల మనుషుల ఆలోచనలో మార్పు వచ్చింది.
2. సామాన్య మనుషుల జీవితం, వాళ్ళ జీవితంలో సమస్యలు చిత్రించి, పరిష్కారం సూచించడమే సాహిత్య ప్రక్రియలు చెయ్యవలసిన పని.
3. వినగానే అర్థమయ్యేటంతగా సరళంగా ఉండటం భాషకు ప్రధాన లక్షణం.
4. రోజువారీ జీవితంలో సామాన్య ప్రజలు మాట్లాడే భాషే వ్యావహారికం అనబడుతుంది.

*7. క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.*

భాష నేర్చుకోవడం రెండు రకాలు. భాష కోసం భాష, విషయం కోసం భాష. భాషా స్వరూప స్వభావాలను సమగ్రంగా అధ్యయనం చేయడం మొదటి రకంలోనిది. శాస్త్ర సాంకేతిక విషయాలను, సాహిత్య సాంస్కృతిక విషయాల వంటి వాటినీ అధ్యయనం చెయ్యడం రెండో రకంలోనిది. అలాగే భాష కూడా రెండు రకాలుగా తయారయింది. ప్రాచీన (కావ్య) భాష, ఆధునిక (ప్రమాణ) భాష. సాహిత్యంలో తరతరాల వారసత్వాన్ని అవగాహన చేసుకొని ఆనందించడానికి ప్రాచీన భాష ఉపయోగిస్తుంది. కాని దాన్ని గురించి చెప్పడానికీ, రాయడానికీ ఆధునిక భాషే కావాలి. ఎందువల్లనంటే ఏ కాలంలో జీవించేవాడి ఆలోచనా, అలవాట్లూ ఆ కాలంనాటి భాషలోనే సాగుతుంటాయి కనుక. ప్రాచీన భాష ప్రయోజనం పరిమితం. ఆధునిక భాష ప్రయోజనం అపరిమితం. వివిధ శాస్త్ర విషయాలను వివరించడానికే కాదు, పూర్వ భాషా సాహిత్యాలను వివరించడానికి కూడా ఆధునిక భాషే కావాలి.

ప్రశ్నలు :

1. భాష ఏయే రకాలుగా నేర్చుకొంటాము ?
2. భాష ఎన్ని రకాలుగా తయారయింది ?
3. ప్రాచీన భాష ఎందుకు ఉపయోగిస్తుంది ?
4. ఆధునిక భాష ఉపయోగం ఏమిటి ?

సమాధానాలు :

1. భాష కోసం భాష, విషయం కోసం భాష అని భాషను రెండు రకాలుగా నేర్చుకొంటాం.
2. ప్రాచీన (కావ్య) భాష, ఆధునిక (ప్రమాణ) భాష అని భాష రెండు రకాలుగా తయారయింది.
3. సాహిత్యంలో తరతరాల వారసత్వాన్ని అవగాహన చేసుకొని ఆనందించడానికి ప్రాచీన భాష ఉపయోగిస్తుంది.
4. వివిధ శాస్త్ర విషయాలను వివరించడానికి, పూర్వ భాషా సాహిత్యాలను వివరించడానికి ఆధునిక భాష ఉపయోగపడుతుంది.

*8. క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.*

వీరభద్రారెడ్డికి అంకితంగా కాశీఖండం రచించిన శ్రీనాథుడు పోతనకు సమకాలికుడు. శ్రీనాథుడు కాశీఖండ, భీమఖండ పురాణాలను తెనిగించినా, వానిని స్వతంత్రించి ప్రబంధాలవలె తెనిగించాడు. భీమఖండం, గోదావరి తీరదేశ దివ్యవైభవ వర్ణనా గ్రంథమని చెప్పవచ్చు. కాశీఖండం ప్రౌఢాంధ్ర కవితా పరిజ్ఞానానికి చదువదగిన ప్రబంధం. 'శివరాత్రి మాహాత్మ్యం' అనే గ్రంథాన్ని కూడా శ్రీనాథుడే రచించాడు. శ్రీనాథునకు ప్రౌఢకవి పాకం మీద ప్రీతి ఎక్కువ. ఆయన 'హరవిలాసం' రచించి అవచి తిప్పయ్య సెట్టికి అంకితమిచ్చాడు. 'కవి సార్వభౌముడు'గా ప్రసిద్ధి చెందిన శ్రీనాథుడు 15వ శతాబ్దికి చెందినవాడు.

ప్రశ్నలు :

1. శ్రీనాథుడు రచించిన గ్రంథాలేవి ?
2. శ్రీనాథుడు ఎవరి సమకాలికుడు ?
3. శ్రీనాథుడు తన 'హరవిలాసం' కావ్యాన్ని ఎవరికి అంకిత మిచ్చాడు ?
4. శ్రీనాథుడు ఏ కాలంలోని వాడు ?

సమాధానాలు :

1. శ్రీనాథుడు కాశీఖండం, భీమఖండం, శివరాత్రి మాహాత్మ్యం, హరవిలాసం మొదలైన గ్రంథాలను రచించాడు.
2. శ్రీనాథుడు పోతనకు సమకాలికుడు.
3. శ్రీనాథుడు తన హరవిలాస కావ్యాన్ని అవచి తిప్పయ్య సెట్టికి అంకితమిచ్చాడు.
4. శ్రీనాథుడు 15వ శతాబ్దిలోని వాడు.

*9. క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.*

నిరుద్యోగ సమస్య నిజమునకు నిరక్షరాస్యుల వలన నేర్పడినది కాదు. విద్యావంతుల విషయముననే ఇది తీరని సమస్యగా పరిణమించినది. ఈ విద్యావంతులు కుర్చీలలో కూర్చుండి గుమాస్తా పని చేయుటకే కుతూహలపడుచున్నారు. చదివిన చదువు కూడ అందుకే ఉపకరించుచున్నది. కావున మన విద్యా విధానము కొంత మారవలయును. విద్యావంతులు వృత్తి విద్యల నభ్యసించుట మేలు. ప్రభుత్వమువారి ప్రోత్సాహముతో వారు కుటీర పరిశ్రమలను నెలకొల్పుటయే ఈ సమస్యకు తగిన పరిష్కారము. వృత్తి విద్యల నభ్యసించినవారికి ప్రభుత్వమువారి తోడ్పాటు తప్పక లభించి తీరును.

ప్రశ్నలు :

1. నిరుద్యోగ సమస్య ఎవరి వలన ఏర్పడినది ?
2. చదివిన చదువు ఎందుకుపయోగపడుచున్నది ?
3. నేటి విద్యావిధానములో ఎట్టి మార్పు రావలెను ?
4. ప్రభుత్వమువారు ఎవరికి తోడ్పడుచున్నారు ?

సమాధానములు :

1. నిరుద్యోగ సమస్య విద్యావంతుల వలన ఏర్పడినది.
2. చదివిన చదువు గుమాస్తా పని చేయుటకే ఉపయోగపడుచున్నది.
3. విద్యావంతులు వృత్తి విద్యల నభ్యసింపజేయునట్లు నేటి విధానములో మార్పు రావలయును.
4. వృత్తి విద్యల నభ్యసించినవారికి ప్రభుత్వము వారు తోడ్పడుచున్నారు.

***10. క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.***

పరిణయవేళ పుట్టినింటి వారు ధూతాంబకు వెలలేని రత్నాలహారమును బహుకరించిరి. దానిని ఆమె వ్రతదానమను నెపమున మైత్రేయునకిచ్చెను. తన భర్తకే దానిని ఆతడిచ్చుననియు, పోయిన సువర్ణభాండమునకు బదులు దానికంటె పదిమడుంగులు ఎక్కువ వెలగల తన రత్నాలహారమును తన భర్త వసంతసేనకు పంపుననియు ధూతాంబ తలచెను. తాను స్వయముగనే తన భర్తకిచ్చుచో అది స్త్రీ ధనమని యెంచి అతడు గ్రహించక పోవచ్చును. కావున ఆమె మైత్రేయుని ద్వారా దానిని పంపుటకు ఉపాయమును పన్నెను.

సుగుణవతియగు ధూతాంబ యొక్క పవిత్రాశయము నెరింగిన మైత్రేయు డాహారమును తీసికొనిపోయి చారుదత్తునకిచ్చెను. అనుకూలవతియగు భార్యవల్ల భర్తయొక్క కీర్తి ప్రతిష్ఠలు అభివృద్ధి నందునని పల్కి అతడు తనకు స్త్రీ విత్తమునకు ఆశపడవలసిన దుర్గతి పట్టెనని మిక్కిలి సిగ్గుచెందెను.

ప్రశ్నలు :

1. ధూతాంబ ఎవరికేమి ఇచ్చెను ?
2. ధూతాంబ భర్త పేరేమి ?
3. తన భర్త దేనికి బదులు ఏమి ఇచ్చునని ధూతాంబ తలచెను ?
4. తాను స్వయముగా ఇచ్చుటకు ధూతాంబ ఏల సంశయించెను ?

సమాధానాలు :

1. ధూతాంబ మైత్రేయునకు వెలలేని రత్నాలహారమును దానముగా ఇచ్చెను.
2. ధూతాంబ భర్త పేరు చారుదత్తుడు.
3. తన భర్త సువర్ణభాండమునకు బదులు పదిమడుంగులు ఎక్కువ వెలగల తన రత్నాలహారమును వసంతసేన కిచ్చునని తలచెను.
4. తాను స్వయముగా భర్తకిచ్చుచో అది స్త్రీధనమని అతడు గ్రహింపడేమోనని ధూతాంబ సంశయించెను.

***11. క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.***

నిర్ణీత పద్ధతుల్లో చేసే పదాల కూర్పునే వ్యాకరణం అంటారు. మాటల నిధిని నిఘంటువు అంటారు. ఇంకోరకంగా చెబితే భాష అంటే నిఘంటు వ్యాకరణాల సంప్రయోగం. వ్యాకరణ సూత్రాలు అమూర్తం. భాషావ్యవహర్త భాషాగ్రహణక్రమంలో ఈ సూత్రాలు ఏర్పరచుకొంటాడు. ఈ వ్యాకరణ సూత్రాలను నిర్మించుకోవటం వల్లనే వ్యవహర్త భాషా వ్యవహారం చెయ్యగలుగుతున్నాడని ఇటీవలి భాషా పరిశోధకులు నమ్ముతున్నారు. వ్యవహర్త భాషా ప్రయోగ దక్షతకు అతడు నిర్మించుకున్న వ్యాకరణమే మూలభూతం. ఈ వ్యాకరణ స్వరూపాన్ని ప్రత్యక్షంగా దర్శించలేం. పరోక్షంగా గ్రహించాల్సిందే. అందుకే దీన్ని మనోవ్యాకరణం అందాం.

ప్రశ్నలు :

1. వ్యాకరణం అని దేన్ని అంటారు ?
2. వ్యాకరణ సూత్రాలు ఎక్కడ నుంచి వస్తాయి ?
3. రచయిత చెబుతున్న వ్యాకరణాన్ని మనోవ్యాకరణమని ఎందుకనాలి ?
4. రచయిత వాదించే పద్ధతిలో నిఘంటువు అని దేనినంటారు ?

సమాధానములు :

1. నిర్ణీత పద్ధతుల్లో చేసే పదాల కూర్పునే వ్యాకరణం అంటారు.
2. వ్యాకరణ సూత్రాలు అమూర్తం. అవి భాషాగ్రహణక్రమం నుంచి వస్తాయి.
3. వ్యాకరణ స్వరూపాన్ని ప్రత్యక్షంగా దర్శించలేం, పరోక్షంగా గ్రహించాల్సిందే. అందువల్ల రచయిత చెబుతున్న వ్యాకరణాన్ని మనోవ్యాకరణం అనాలి.
4. రచయిత వాదించే పద్ధతిలో మాటల నిధిని నిఘంటువు అంటారు.

**12. క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.**

పరభాషల ద్వారా కాక మాతృభాష ద్వారా విద్యాబోధన చేయుటయే సహజమైన పద్ధతియని వాదించి వంగభాషలో బాలురకు ఉపయుక్తమగు వాచకములను, శాస్త్రగ్రంథములను రచించిన విద్యావేత్త ఈశ్వరచంద్రుడు. అతనివలె ఒకవైపు సంఘసంస్కరణ చేయుచు, మరొకవైపు భాషాసేవ చేసిన మహనీయుడు మన వీరేశలింగం పంతులు. పంతులుగారికి దక్షిణదేశవిద్యాసాగరుడను బిరుదు కలదు. విద్యాసాగరుడును, పంతులుగారును పరస్పరము ఉత్తరములు వ్రాసికొనుచుండెడివారు. ఈశ్వరచంద్రుని వలన వంగదేశమును, పంతులుగారి వలన తెలుగుదేశమును వాసిగాంచినవి.

**ప్రశ్నలు :**

1. విద్యాబోధన చేయుటకు సహజమైన పద్ధతి యేది ?
2. ఈశ్వరచంద్రుడు ఏ భాషలో వాచకములు వ్రాసెను ?
3. పంతులుగారి బిరుదు ఏమి ?
4. విద్యాసాగరుడును, పంతులుగారును ఏమి చేసెడివారు ?

**సమాధానములు :**

1. మాతృభాష ద్వారా విద్యాబోధన చేయుట సహజమైన పద్ధతి.
2. ఈశ్వరచంద్రుడు వంగభాషలో వాచకములు వ్రాసెను.
3. పంతులుగారికి దక్షిణదేశ విద్యాసాగరుడు అని బిరుదు కలదు.
4. వారిద్దరును ఉత్తరములు వ్రాసికొనెడివారు.

**13. క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.**

బౌద్ధ వాఙ్మయము నందును, గాథలయందును నాగార్జునుని నామము తరచు వినవచ్చుచుండును. చైనా, టిబెట్టు దేశములందు గూడా ఈ మహనీయుని ప్రశంస మిక్కుటముగా వినవచ్చును. నాగార్జున నామధారులగు ప్రసిద్ధ మహాపురుషులిరువురు గలరు. వారిలో నొకడు క్రీ.శ. రెండవ శతాబ్ది యందు జీవించి యుండెను. ఇతడు ఆంధ్ర శాతవాహన చక్రవర్తియగు యజ్ఞశ్రీశాతకర్ణికి సమకాలికుడు. రెండవ నాగార్జునుడు క్రీ.శ. ఆరవ శతాబ్దియందు జీవించి యుండెను. ఇరువురును ఆంధ్రదేశమున బౌద్ధమత ప్రచారము గావించిన యాచార్యపురుషులే. మొదటి నాగార్జునుడు "నాగర్జున బోధిసత్త్వుడు", "నాగార్జున పూస"యని మిగుల ప్రసిద్ధి వహించినాడు. ఈతడు బుద్ధుని తరువాత మరల అంతటివాడని విదేశములందు కూడా ప్రఖ్యాతి గాంచెను. ఈతడు శ్రీపర్వతమున నివసించువాడని టిబెట్టు దేశమున ప్రచారమందున్న యొక గాథ వలన తెలియుచున్నది. నాగార్జున కొండకు పూర్వకాలమున శ్రీపర్వతమను పేరు ప్రసిద్ధముగానుండెను. నాగార్జున బోధిసత్త్వుడు నివసించి యుండుటచే ఈ కొండకు తరువాత నాగార్జున కొండయను పేరు వచ్చెను.

**ప్రశ్నలు :**

1. నాగార్జునుని ప్రశంస యెక్కడ విన్పించును ?
2. ప్రథమ నాగార్జునుని సమకాలికుడెవరు ?
3. నాగార్జునుని బిరుదులేవి ?
4. నాగార్జునుని నివాసస్థానమేది ?

**సమాధానములు :**

1. నాగార్జునుని ప్రశంస బౌద్ధ వాఙ్మయమునందును, గాథలయందును, టిబెట్టు, చైనా దేశములందును వినిపించును.
2. ఆంధ్ర శాతవాహన చక్రవర్తియగు యజ్ఞశ్రీ శాతకర్ణి ప్రథమ నాగార్జునుని సమకాలికుడు.
3. మొదటి నాగార్జునునికి "నాగార్జున బోధిసత్త్వుడు", "నాగార్జున పూస" యను బిరుదులు కలవు.
4. నేడు నాగార్జున కొండయని వ్యవహరింపబడుచున్న శ్రీపర్వతమున నాగార్జునుడు నివసించెనందురు.

**14. క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.**

రెడ్డి రాజ్యమునకుఁ దొలి పురుషుఁడగు కాటమ వేమారెడ్డిగారెట్టి జగద్దేయకీర్తులో ఇంచుమించుగా కొండవీటి రెడ్డి రాజ్యమునకు తుదివాఁడనదగిన పెదకోమటి వేమారెడ్డిగారు గూడ అట్టివారే. ఇంచుమించుగా క్రీ.శ. 1404 నుండి 1420 దాఁక పెదకోమటి వేమారెడ్డి

కొండవీటి రాజ్యము నేలెను. ఈయనకు రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము ప్రబల విరోధిగా నుండెను. కాటమ వేమారెడ్డిగారివలె ఈయన స్వయంగా గొప్ప విద్వాంసుడు. కవి సార్వభౌముండయిన శ్రీనాథుని ఆస్థాన విద్యాధికారిగాఁ చేసికొని పోషించిన మహాభాగ్యశాలి. ప్రబంధ పరమేశ్వరుని, కవి సార్వభౌము నాస్థాన కవులుగా ఆదరించి పోషించు మహా భాగ్యము ప్రోలయ వేమారెడ్డిగారికిని, నీ పెదకోమటి వేమారెడ్డిగారికిని చిరకాలము లభించినది. ఈ వేమారెడ్డిగారికి "సర్వజ్ఞ చక్రవర్తి" యని బిరుదు కలదు.

*ప్రశ్నలు :*

1. రెడ్డి రాజ్యమునకు తొలి పురుషుఁడెవరు ?
2. కొండవీటి రెడ్డి రాజ్యమునకు తుది చక్రవర్తి ఎవరు ?
3. పెదకోమటి వేమారెడ్డి పరిపాలనా కాలమేది ?
4. శ్రీనాథునకు గల బిరుదు ఏమి ?

*సమాధానములు :*

1. రెడ్డి రాజ్యమునకు తొలి పురుషుడు కాటమ వేమారెడ్డి.
2. కొండవీటి రెడ్డి రాజ్యమునకు తుది చక్రవర్తి పెదకోమటి వేమారెడ్డి.
3. పెదకోమటి వేమారెడ్డి పరిపాలనా కాలము క్రీ.శ. 1404 నుండి 1420 వరకు.
4. శ్రీనాథునకు గల బిరుదు కవిసార్వభౌముడు.

**15. *క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.***

వీరేశలింగం పంతులుగారు ప్రధానంగా సంఘసంస్కర్త. ప్రజలు అలవాటు పడిన విషయములలోగల చెడ్డ నెత్తి చూపుటకు సాహిత్యము నుపయోగించినాడు. సంఘమును సంస్కరించి చైతన్యవంతము చేయుటకు ప్రయత్నించినాడు. సాహిత్యములో ఎన్నో నూతన ప్రక్రియలకు ఆద్యుడైనాడు. ముఖ్యముగా స్త్రీ జనోద్ధరణకు ఈయన చేసిన సేవ సాటిలేనిది. ఆయన సాహిత్యములో సౌందర్యాంశ లోపించినదను విమర్శ వచ్చినది. గురజాడ రచనలో కళాత్మకత సంస్కరణతో పెనవేసుకొనినది. ఆయన తన సాహిత్య లక్ష్యము సామాన్యులకు చేరువ కావలెనని వాడుక భాష నుపయోగించినాడు. సమాజం లోపాలను వ్యంగ్యముగా దుయ్యబట్టినాడు. కాని కందుకూరివలె సూటిగా విమర్శించలేదు. కందుకూరిగారు ప్రధానంగా సంఘసంస్కర్త. గురజాడ ప్రధానంగా కళాకారుడు.

*ప్రశ్నలు :*

1. వీరేశలింగం ఎట్టివాడు ?
2. ఆయన ఏ విషయములో ఆద్యుడు ?
3. ఆయన సాహిత్యములోని లోపమేమి ?
4. వాడుక భాషను ఎవరు ఎందుకు వాడినారు ?

*సమాధానములు :*

1. వీరేశలింగం ప్రధానంగా సంఘసంస్కర్త.
2. సాహిత్యంలో ఎన్నో నూతన ప్రక్రియలకు ఆయన ఆద్యుడు.
3. ఆయన సాహిత్యంలో సౌందర్యాంశ లోపించినదని పలువురి విమర్శలు.
4. గురజాడ వారు సాహిత్యము జనసామాన్యులకు చేరువ కావలయునని వాడుక భాష నుపయోగించినారు.

**16. *క్రింది గద్యభాగమును చదివి ఈయబడిన ప్రశ్నలకు ఒక్కొక్క వాక్యములో సమాధానములు వ్రాయండి.***

ఆంధ్రులు ప్రాచీన కాలంనుంచీ నివసించిన భూఖండం ఆంధ్రదేశం. దీని విస్తీర్ణం దాదాపు రెండు లక్షల డెబ్బైయేడు చదరపు కిలోమీటర్లు. దీనిలో నివసించే ఆంధ్రుల జనాభా 1979 లెక్కల ప్రకారం అయిదు కోట్ల ముప్పై లక్షలు. ఈ ప్రదేశం మొత్తం భారత రిపబ్లిక్‌లో ఆంధ్రప్రదేశ్ అని వ్యవహరింపబడుతున్నది. ఇది పందొమ్మిదో శతాబ్దంలో రాజకీయ కారణాలవల్ల మూడు ముక్కలుగా విభాజనం కావడం జరిగింది. అందులో ఒకటి సర్కారు ప్రాంతమనీ, రెండవది దత్తమండలమనీ, మూడవది తెలంగాణా ప్రాంతమనీ పిలవబడ్డవి. తెలంగాణా ప్రాంతం అప్పుడు నిజాం పాలన క్రిందికి రాగా, మిగిలిన భాగం అంగ్లేయుల పాలనలో ఉండేది. అందువల్ల తెలంగాణా ప్రాంతం తెలుగు

భాష మీద ఆనాటి పాలక భాషయిన ఉర్దూ ప్రభావం ఎక్కువగా ఉంది. కోస్తా, రాయలసీమలలోని తెలుగు మీద ఆనాటి పాలకభాష ఆంగ్లం తన ప్రభావాన్ని చూపింది. రాజకీయ కారణాలచేత ఈ విధంగా 'మూడు భాగాలుగా పరిగణించబడిన ఆంధ్రదేశం' స్వతంత్రం వచ్చి, స్వరాష్ట్రసాధన సాగిన తర్వాత కూడా మూడు భాగాలుగా చూడబడ్డది. ఈ భిన్నదృష్టి కేవలం పరిపాలన సౌలభ్యం కోసం, ఆర్థిక సమన్వయ సాధన కోసం మాత్రమే కాని; సాంస్కృతికంగానూ, భాషా పరంగానూ ఈ మూడు ప్రాంతాలమధ్య గణనీయమైన భేదం ఉన్నందువల్ల మాత్రం కాదు. మన రాష్ట్రానికి ప్రస్తుతం ఈశాన్య దిశలో ఒరిస్సా, ఉత్తరాన ఛత్తీస్‌ఘడ్‌లు, పశ్చిమాన మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాలూ, దక్షిణాన తమిళనాడు, తూర్పున బంగాళా ఖాతం ఎల్లలుగా ఉన్నాయి. అంటే తెలుగు భాషతో సరిహద్దులో ప్రత్యక్ష సంబంధం కలిగిన పొరుగు భాషలు ఒరియా, హిందీ, మరాఠీ, కన్నడ, తమిళాలు.

*ప్రశ్నలు :*

1. ఆంధ్ర దేశంలో పందొమ్మిదో శతాబ్దంలో విభాజ్యమయిన మూడు ప్రాంతాలు ఏవి ?
2. పందొమ్మిదో శతాబ్దంలో ఆంధ్ర దేశంలోని మూడు ప్రాంతాల భాష మీద ఏయే ఇతర భాషలు ప్రభావం చూపాయి ? ఎందువల్ల?
3. స్వతంత్రం వచ్చి స్వరాష్ట్ర సాధన సాగిన తర్వాతకూడా ఆంధ్ర దేశాన్ని మూడు భాగాలుగా ఎందుకు చూస్తున్నారు ?
4. ఆంధ్రప్రదేశ్‌కి ఎల్లలుగా ఏయే రాష్ట్రాలున్నాయి ?

*సమాధానములు :*

1. ఆంధ్రదేశంలో పందొమ్మిదో శతాబ్దంలో విభాజ్యమయిన మూడు ప్రాంతాలలో ఒకటి సర్కారు ప్రాంతం, రెండవది దత్తమండలం, మూడవది తెలంగాణా ప్రాంతం.
2. పందొమ్మిదో శతాబ్దంలో తెలంగాణా ప్రాంతం నిజాం పాలనలో ఉండటం చేత అక్కడి తెలుగు భాషమీద ఉర్దూ తన ప్రభావం చూపింది. కోస్తా, రాయలసీమ ప్రాంతాలు ఆంగ్లేయుల పాలనలో ఉండటం చేత అక్కడ ఆంగ్లం తన ప్రభావాన్ని చూపింది.
3. స్వతంత్రం వచ్చి, స్వరాష్ట్ర సాధన సాగిన తర్వాత కూడా ఆంధ్ర దేశాన్ని రాజకీయ కారణాల చేత మూడు భాగాలుగా చూస్తున్నారు.
4. ఆంధ్రప్రదేశ్‌కు ఈశాన్య దిశలో ఒరిస్సా, ఉత్తరాన ఛత్తీస్‌ఘడ్, పశ్చిమాన మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాలూ, దక్షిణాన తమిళనాడు, తూర్పున బంగాళాఖాతం ఎల్లలుగా ఉన్నాయి.

### *17. క్రింది గద్యభాగం చదివి దాని కింద ఇచ్చిన ప్రశ్నలకు సమాధానములు వ్రాయండి.*

చేమకూర వేంకటకవి రఘునాథరాయల ఆస్థాన కవి. విజయవిలాస ప్రబంధాన్ని ఆ రాజుకే అంకితమిచ్చాడు. వేంకటకవి మొదటి రచన సారంగధర చరిత్ర. ఇది చంపూ పద్ధతిలో వ్రాయబడింది. విజయవిలాసమంత ఖ్యాతిని సారంగధర పొందలేదు. విజయవిలాసం మధుర గుళిక వంటి ప్రబంధం. దీనిలో మూడాశ్వాసాల్లో అర్జునుడు వరుసగా ఉలూచి, చిత్రాంగద, సుభద్రలను వివాహమాడే వృత్తాంతాలను కవి రచించాడు. "ప్రతి పద్యమునందు చమత్కృతి కలుగం జెప్పనేర్తువు" అని రాఘునాథనాయకుడు వేంకటకవిని ప్రస్తుతించాడు.

ప్రశ్నలు :

1. చేమకూర వేంకటకవి ఎవరి ఆస్థానంలోని వాడు ?
2. వేంకటకవి మొదటి రచన ఏది ?
3. రఘునాథనాయకుడు వేంకటకవిని ఏమని ప్రస్తుతించాడు ?
4. చేమకూర వేంకటకవి రచించిన గ్రంథాలలో మిక్కిలి ఖ్యాతిని పొందినదేది ?

సమాధానములు :

1. చేమకూర వేంకటకవి రఘునాథరాయల ఆస్థాన కవి.
2. వేంకటకవి మొదటి రచన సారంగధర చరిత్ర.
3. రఘునాథనాయకుడు వేంకటకవిని "ప్రతిపద్యమునందు చమత్కృతి కలుగంజెప్పనేర్తువు" అని ప్రస్తుతించాడు.
4. చేమకూర వేంకటకవి రచించిన గ్రంథాలలో 'విజయవిలాసం' మిక్కిలి ఖ్యాతి పొందినది.

# అపరిచిత పద్యములు - ప్రశ్నలు

**(Q.No. 21, 22, 23, 24 – 4 Marks)**

**1. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాలుగు ప్రశ్నలకూ సమాధానాలు వ్రాయండి.**

తలనుండు విషము ఫణికిని
వెలయంగాఁ దోఁక నుండు వృశ్చికమునకున్
దల తోఁక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ!

**ప్రశ్నలు :**

1. ఫణికి విషం ఎక్కడ ఉంటుంది?
2. దేనికి విషం తోకలో ఉంటుంది?
3. ఖలునకు విషం ఎక్కడ ఉంటుంది?
4. ఈ పద్యం ద్వారా మనకు ఏం తెలుస్తోంది?

**సమాధానాలు :**

1. ఫణికి విషం తలలో ఉంటుంది.
2. వృశ్చికానికి (తేలుకు) విషం తోకలో ఉంటుంది.
3. ఖలునకు విషం నిలువెల్లా (శరీరమంతా) ఉంటుంది.
4. ఈ పద్యం ద్వారా మనకు ఖలుని స్వభావం తెలుస్తోంది.

**2. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాలుగు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవుళ్ళు
నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు
సజ్జ జొన్న కూళ్ళు సర్పంబులు, దేళ్ళు
పల్లె నాటి సీమ పల్లెటూళ్ళు.

**ప్రశ్నలు :**

1. నాగులేరు ఏ సీమలో ప్రవహిస్తున్నది?
2. సర్పాలు, తేళ్ళు ఎక్కడ ఎక్కువగా కనిపిస్తాయి ?
3. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.
4. ఈ పద్యంలోని శబ్దాలంకారమేమిటో రాయండి.

**సమాధానాలు :**

1. నాగులేరు పల్నాటి సీమలో ప్రవహిస్తున్నది.
2. సర్పాలు, తేళ్ళు పల్నాటి పల్నెటూళ్ళలో ఎక్కువగా కనిపిస్తాయి.
3. ఈ పద్యానికి 'పల్నాటి పల్లెటూళ్ళు' అని పేరు పెట్టవచ్చు.
4. ఈ పద్యంలోని శబ్దాలంకారం వృత్త్యనుప్రాసం.

**3. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాలుగు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

అక్షరంబు వలయు కుక్షి జీవనులకు
నక్షరంబు జిహ్వ కిక్షు రసము
అక్షరంబు తన్ను రక్షించు గావున
నక్షరంబు లోక రక్షితంబు.

ప్రశ్నలు :

1. మానవులకు ఏం కావాలి?
2. అక్షరం జిహ్వకు ఎటువంటిది?
3. అక్షరం దేనిని రక్షిస్తుంది ?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

సమాధానాలు :

1. మానవులకు అక్షరం (విద్య) కావాలి.
2. అక్షరం జిహ్వకు చెరకురసం వంటిది.
3. అక్షరం తనను (చదువుకున్నవానిని) రక్షిస్తుంది.
4. ఈ పద్యానికి శీర్షిక 'అక్షరాలు నేర్చుకో'.

**4. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాలుగు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

కందుకము వోలె సుజనుడు
క్రిందంబడి మగుడ మీదికి న్నెగయుఁ జుమీ
మందుడు మృత్పిండమువలె
గ్రిందంబడి యడగియుండుఁ గృపణత్వమునన్.

ప్రశ్నలు :

1. సుజనుడు ఎట్టివాడు ?
2. మందుడు ఎట్టివాడు ?
3. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.
4. ఈ పద్యంలోని అర్థాలంకారాన్ని రాయండి.

సమాధానాలు :

1. సుజనుడు కందుకం (బంతి) లాంటివాడు.
2. మందుడు మృత్పిండం (మట్టిముద్ద) లాంటివాడు.
3. ఈ పద్యానికి శీర్షిక 'సుజనుడు – మందుడు'
4. ఈ పద్యంలో ఉపమాలంకారం ఉంది.

**5. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

కలహపడునింట నిలువదు
కలుముల జవరాలు కానఁ గలకాలం బే
కలహములులేక సమ్మతి
మెలఁగంగా నేర్చెనేని మేలు కుమారీ !

ప్రశ్నలు :

1. కలహపడే ఇంట్లో ఏం నిలువదు ?
2. కలకాలం ఎలా మెలగాలి ?
3. ఈ పద్యం ఎవరిని సంబోధిస్తూ చెప్పబడింది ?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

సమాధానాలు :

1. కలహపడే ఇంట్లో లక్ష్మి (సంపద) నిలువదు.
2. కలకాలం ఏ విధమైన కలహాలు లేకుండా మెలగాలి.

3. ఈ పద్యం కుమారీని సంబోధిస్తూ అంటే ఆడపిల్లలను సంబోధిస్తూ చెప్పబడింది.
4. ఈ పద్యానికి శీర్షిక 'కలహం వద్దు'

**6. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

తనిసిరే వేల్పు లుదధి రత్నముల చేత ?
వెఱచిరే ఘోర కాకోల విషము చేత ?
విడిచిరే యత్న మమృతంబు వొడుముదనుక ?
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు.

**ప్రశ్నలు :**

1. ఉదధి రత్నముల చేత తృప్తి చెందనివా రెవరు ?
2. నిపుణమతులు ఎటువంటి వారు ?
3. వేల్పులు దేన్ని చూసి భయపడలేదు ?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

**సమాధానాలు :**

1. వేల్పులు ఉదధి రత్నములచేత తృప్తి చెందలేదు.
2. నిపుణమతులు తాము అనుకున్న కార్యం నెరవేరే వరకు తమ ప్రయత్నాన్ని వదలరు.
3. వేల్పులు ఘోర కాకోల విషాన్ని చూసి భయపడలేదు.
4. ఈ పద్యానికి శీర్షిక 'నిపుణమతుల లక్షణం'

**7. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

విద్యచే భూషితుండయి వెలయుచున్నఁ
దొడరి వర్జింపనగుఁ జుమీ దుర్జనుండు
చారు మాణిక్య భూషిత శస్త మస్త
కంబయిన పన్నగము భయంకరము గాదె.

**ప్రశ్నలు :**

1. చదువుకున్నప్పటికీ విడువదగినవాడు ఎవరు ?
2. ఎటువంటి పాము భయంకరమైనది ?
3. ఈ పద్యంలోని దుర్జనుడు దేనితో పోల్చబడ్డాడు ?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

**సమాధానాలు :**

1. దుర్జనుడు చదువుకున్నప్పటికీ విడుదగినవాడు.
2. మణులచేత అలంకరింపబడిన శిరస్సుగల పాము భయంకరమైనది.
3. ఈ పద్యంలో దుర్జనుడు పాముతో పోల్చబడ్డాడు.
4. ఈ పద్యానికి శీర్షిక 'దుర్జనుడితో స్నేహం పనికిరాదు'.

**8. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

రాజు చేతి కత్తి రక్తంబు వర్షించు
సుకవి చేతి కలము సుధలు కురియు
ఆత దేల గలుగు యావత్ప్రపంచంబు
నీత దేల గలుగు ఇహము పరము

ప్రశ్నలు :

1. రాజు చేతి కత్తి దేన్ని వర్షిస్తుంది?
2. సుధలు కురిపించునది ఏది?
3. యావత్ప్రపంచాన్ని పరిపాలించగలిగింది ఎవరు?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

సమాధానాలు :

1. రాజు చేతి కత్తి రక్తాన్ని వర్షిస్తుంది
2. సుకవి చేతి కలము సుధలు కురిపిస్తుంది.
3. రాజు యావత్ప్రపంచాన్ని పరిపాలించగలడు.
4. ఈ పద్యానికి శీర్షిక 'రాజు – సుకవి'

**9. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

అల్పుడెపుడు బల్కు నాడంబరముగాను
సజ్జనుండు బల్కు చల్లగాను
కంచుమ్రోగునట్లు కనకంబు మ్రోగునా
విశ్వదాభిరామ వినురవేమ !

ప్రశ్నలు :

1. అల్పుడు మాట్లాడే తీరు ఎలాంటిది ?
2. సజ్జనుడు ఎలా మాట్లాడుతాడు?
3. కంచు మ్రోగునట్లు మ్రోగనిదేది?
4. ఈ పద్యం వల్ల తెలిసిందేమిటి ?

సమాధానాలు :

1. అల్పుడు మాట్లాడే తీరు ఆడంబరంగా ఉంటుంది.
2. సజ్జనుడు చల్లగా మాట్లాడుతాడు.
3. కంచు మ్రోగునట్లు మ్రోగనిది బంగారం.
4. ఈ పద్యంవల్ల మనకు అల్పుడు, సజ్జనుడు మాట్లాడే తీరు తెలుస్తోంది.

**10. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

కుసుమ గుచ్ఛంబునకుఁబోలె బొసగు శౌర్య
మానవంతున కివి రెండు మహితగతులు
సకలజన మస్తక ప్రదేశములనైన
వనమునందైన జీర్ణభావంబుఁ గనుట

ప్రశ్నలు :

1. శౌర్య మానవంతుడు ఎవరితో పోల్చబడ్డాడు?
2. కుసుమ గుచ్ఛం ఎక్కడ అలంకరింపబడుతుంది ?
3. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.
4. ఈ పద్యంలోని అలంకారం రాయండి.

సమాధానాలు :

1. శౌర్య మానవంతుడు పుష్పగుచ్ఛంతో పోల్చబడ్డాడు.
2. కుసుమ గుచ్ఛం సమస్త ప్రజల శిరస్సులందు అలంకరింపబడుతుంది.
3. ఈ పద్యానికి శీర్షిక 'శౌర్యవంతుని లక్షణం'
4. ఈ పద్యంలో 'ఉపమాలంకారం' ఉంది.

**11. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

ద్యుమణి పద్మాకరము వికచముగఁ జేయుఁ
గుముద హర్షంబు గావించు నమృతసూతి,
యర్థితుడుగాక జలమిచ్చు నంబుధరుదు;
సజ్జనులు దారె పరహితాచరణమతులు.

ప్రశ్నలు :

1. పద్మాకరమును వికసింపజేసేది ఎవరు?
2. చంద్రుడు వేటిని వికసింప జేస్తాడు?
3. కోరకుండానే నీటిని ఇచ్చేది ఎవరు?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

సమాధానాలు :

1. సూర్యుడు (ద్యుమణి) పద్మాకరమును వికసింపజేస్తాడు.
2. చంద్రుడు కలువలను వికసింపజేస్తాడు.
3. కోరకుండానే నీటిని ఇచ్చేది మేఘుడు.
4. ఈ పద్యానికి శీర్షిక 'పరోపకారుల స్వభావం'.

**12. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

ఎఱుక గలవారి చరితలు
గఱచుచు సజ్జనుల గోష్ఠి గదలక ధర్మం
బెఱుగుచు నెఱిగినదానిని
మఱువ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్.

ప్రశ్నలు :

1. ఎవరి చరిత్ర తెలుసుకోవాలి ?
2. ధర్మాన్ని ఎక్కడ నుంచి తెలుసుకోవాలి.
3. దేనిని అనుష్ఠించాలి ?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

సమాధానాలు :

1. జ్ఞానవంతుల చరిత్ర తెలుసుకోవాలి.
2. ధర్మాన్ని సజ్జనుల నుంచి తెలుసుకోవాలి.
3. ధర్మాన్ని అనుష్ఠించాలి.
4. ఈ పద్యానికి శీర్షిక 'నీతిబోధ'.

**13. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

మొదలఁ జూచినఁ గడు గొప్ప పిదపఁ గుఱుచ,
యాదిఁ గొంచెము తర్వాత నధిక మగుచుఁ
దనరు, దిన పూర్వ పరభాగ జనితమైన
ఛాయపోలిక గుజన సజ్జనుల మైత్రి.

**ప్రశ్నలు :**

1. కుజనుల మైత్రి ఎటువంటిది?
2. సజ్జనుల మైత్రి ఎటువంటిది ?
3. కుజన, సజ్జనుల మైత్రిని కవి దేనితో పోల్చాడు ?
4. ఈ పద్యం వల్ల మనకు ఏం తెలుస్తుంది?

**సమాధానాలు :**

1. కుజనుల మైత్రి ఉదయకాలపు నీడవలె మొదట ఎక్కువగా ఉండి తరువాత తగ్గిపోతూ వుంటుంది.
2. సజ్జనుల మైత్రి సాయంకాలపు నీడవలె మొదట తక్కువగా ఉండి తరువాత పెరుగుతూ వుంటుంది.
3. కవి కుజనుల మైత్రిని ఉదయకాలపు నీడతోను, సజ్జనుల మైత్రిని సాయంకాలపు నీడతోను పోల్చి చెప్పాడు.
4. ఈ పద్యం వల్ల మనకు సజ్జనుల మైత్రి మంచిదని తెలుస్తోంది.

**14. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

అఘము వలన మరల్చు, హితార్థ కలితుఁ
జేయుఁ గోప్యంబు దాచుఁ, బోషించు గుణము,
విడువ డాపన్ను, లేవడివేళ నిచ్చు,
మిత్రు డీ లక్షణమ్ముల మెలగుచుండు.

**ప్రశ్నలు :**

1. మిత్రుడు దేని నుండి మరలిస్తాడు?
2. మిత్రుడు ఎట్టివారిని విడిచిపెట్టడు ?
3. మిత్రుడు పోషించేది ఏది ?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

**సమాధానాలు :**

1. మిత్రుడు పాపం నుండి మరలిస్తాడు.
2. మిత్రుడు ఆపదలో నున్నవారిని విడిచిపెట్టడు.
3. మిత్రుడు సద్గుణాన్ని పోషిస్తాడు.
4. ఈ పద్యానికి శీర్షిక 'మిత్ర లక్షణం'.

**15. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చుఁ
దిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చుఁ
జేరి మూర్ఖుల మనసు రంజింపరాదు.

**ప్రశ్నలు :**

1. ఇసుక నుండి ఏమి తీయవచ్చు?
2. మృగతృష్ణలో ఏమి త్రాగవచ్చు?
3. ఎవరి మనసు రంజింపజేయలేము?
4. ఈ పద్యం వల్ల ఏమి తెలుస్తోంది ?

**సమాధానాలు :**

1. ఇసుక నుండి నూనె తీయవచ్చు.
2. మృగతృష్ణలో నీరు త్రాగవచ్చు.
3. మూర్ఖుని మనసు రంజింప జేయలేము.
4. ఈ పద్యం వల్ల మూర్ఖుని మనస్సు మార్చలేమని తెలుస్తోంది.

**16. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

కమలములు నీటఁ బాసినఁ
కమలాప్తుని రశ్మి సోఁకి కమలిన భంగిన్
తమ తమ నెలవులు తప్పినఁ
దమ మిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ!

**ప్రశ్నలు :**

1. కమలములు నీటిని విడిచిపెట్టి బయటికి వస్తే ఏం జరుగుతుంది?
2. ఎప్పుడు మిత్రులు శత్రువులౌతారు?
3. తామరలకు మిత్రుడెవరు?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

**సమాధానాలు :**

1. కమలములు నీటిని విడిచిపెట్టి బయటికి వస్తే సూర్యరశ్మిసోకి వాడిపోతాయి.
2. తమ తమ స్థానాలను విడిచిపెడితే మిత్రులు శత్రులౌతారు.
3. తామరలకు మిత్రుడు సూర్యుడు.
4. ఈ పద్యానికి శీర్షిక 'స్థానబలం'.

**17. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

రోషావేశము జనులకు
దోషము తలపోయ విపుల దుఃఖకరము నౌ;
రోషము విడిచిన యెడ సం
తోషింతురు బుధులు హితము దోఁపఁ గుమారా!

**ప్రశ్నలు :**

1. జనులకు దోషమైనది ఏది?
2. మిక్కిలి దుఃఖాన్ని కలిగించేది ఏది?
3. దేన్ని విడిచిపెడితే బుధులు సంతోషిస్తారు?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

**సమాధానాలు :**

1. జనులకు దోషమైనది రోషావేశం.
2. మిక్కిలి దుఃఖాన్ని కలిగించేది రోషావేశం.
3. రోషావేశాన్ని విడిచిపెడితే బుధులు సంతోషిస్తారు.
4. ఈ పద్యానికి శీర్షిక 'కోపం పనికిరాదు.'

**18. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

పూజకన్న నెంచ బుద్ధి ప్రధానంబు
మాటకన్న నెంచ మనసు దృఢము
కులముకన్న మిగుల గుణము ప్రధానంబు
విశ్వదాభిరామ! వినురవేమ!

**ప్రశ్నలు :**

1. పూజకంటె ముఖ్యమైనది ఏది?
2. మాటకంటె దృఢమైనది ఏది?
3. కులముకంటె ప్రధానమైనది ఏది?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

**సమాధానాలు :**

1. పూజకంటె ముఖ్యమైనది బుద్ధి.
2. మాటకంటె దృఢమైనది మనస్సు.
3. కులముకంటె ప్రధానమైనది గుణం.
4. ఈ పద్యానికి శీర్షిక 'దేనికంటె ఏది ప్రధానం ?

**19. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

తను లోకము గొనియాడగ
విని యుబ్బడు సజ్జనుండు వెండియుఁ గడు మే
లొనరించుఁ గీడొకించుక
యును దనదెసఁ దోఁపనీక యుడుపుచు వచ్చున్.

**ప్రశ్నలు :**

1. లోకం తనను పొగిడితే పొంగిపోనివాడు ఎవరు ?
2. సజ్జనుడు లోకానికి ఏం చేస్తాడు?
3. తనవల్ల ఏమాత్రం హాని కలుగకుండ చూసేవాడు ఎవరు ?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

**సమాధానాలు :**

1. లోకం తనను పొగిడితే పొంగిపోనివాడు సజ్జనుడు.
2. సజ్జనుడు లోకానికి మేలు చేస్తాడు.
3. తనవల్ల ఏమాత్రం హాని కలుగకుండ చూసేవాడు సజ్జనుడు.
4. ఈ పద్యానికి శీర్షిక 'సజ్జన స్వభావం'.

**20.** **క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

సద్గోష్ఠి సిరియు నొసగును
సద్గోష్ఠియె కీర్తిఁబెంచు; సంతుష్టియు నా
సద్గోష్ఠియె యొనగూర్చును;
సద్గోష్ఠియె పాపములను చఱచు కుమారా!

**ప్రశ్నలు :**

1. సద్గోష్ఠి దేన్ని ఇస్తుంది?
2. కీర్తిని పెంచేది ఏది?
3. పాపములను పోగొట్టేది ఏది?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

**సమాధానాలు :**

1. సద్గోష్ఠి సంపదను ఇస్తుంది.
2. కీర్తిని పెంచేది సద్గోష్ఠి.
3. పాపములను పోగొట్టేది సద్గోష్ఠి.
4. ఈ పద్యానికి శీర్షిక 'సద్గోష్ఠి ప్రయోజనం'

**21.** **క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

పాలను గలసిన జలమును
బాల విధంబుననె యుండు c బరికింపంగా
బాల చవిc జెరచుc గావున
బాలసుcడగు వాని పొందు వలదుర సుమతీ!

**ప్రశ్నలు :**

1. పాలతో కలిసిన నీరు ఎలా ఉంటుంది?
2. పాల రుచిని చెడగొట్టేది ఏది?
3. ఎవరితో స్నేహం చేయగూడదు?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

**సమాధానాలు :**

1. పాలతో కలిసిన నీరు పాలలాగానే ఉంటుంది.
2. పాలరుచిని చెడగొట్టేది అందులో కలిసిన నీరు.
3. చెడ్డవారితో స్నేహం చేయగూడదు.
4. ఈ పద్యానికి శీర్షిక 'దుర్జన స్నేహం'.

**22.** **క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

మేడిపండు చూడ మేలిమై యుండును
పొట్ట విచ్చి చూడ పురుగు లుండు
పిరికివాని మదిని బింక మీలాగుర
విశ్వదాభిరామ వినురవేమ !

**ప్రశ్నలు :**

1. పిరికివాడు దేనితో పోల్చబడ్డాడు ?
2. మేడిపండు పైకి ఏ విధంగా ఉంటుంది ?

3. మేడిపండు లోపల ఎలా ఉంటుంది ?
4. ఈ పద్యంవల్ల తెలిసిందేమిటి ?

**సమాధానాలు :**

1. పిరికివాడు మేడిపండుతో పోల్చబడ్డాడు.
2. మేడిపండు పైకి చక్కగా ఉంటుంది.
3. మేడిపండు లోపల పురుగులుంటాయి.
4. ఈ పద్యం వల్ల పిరికివాని లక్షణం తెలుస్తోంది.

**23. క్రింది పద్యాన్ని చదివి దాని క్రింద ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు రాయండి.**

కనక పర్వతమున కాపురంబుండిన
నమర విభునికైన నాసపోదు
కనక కుండలములు కర్ణునర్థింపడా
విశ్వదాభిరామ ! వినురవేమ !

**ప్రశ్నలు :**

1. కనక పర్వతం మీద కాపురమున్న దెవరు?
2. కర్ణుని యాచించింది ఎవరు?
3. కర్ణుని వద్ద ఏమి ఉన్నాయి?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

**సమాధానాలు :**

1. కనక పర్వతం మీద కాపురమున్నది ఇంద్రుడు.
2. కర్ణుని యాచించింది ఇంద్రుడు.
3. కర్ణుని వద్ద కనక కుండలాలు ఉన్నాయి.
4. ఈ పద్యానికి శీర్షిక "ఆశ"

**24. క్రింది పద్యాన్ని చదివి ఇచ్చిన నాల్గు ప్రశ్నలకు జవాబులు వ్రాయండి.**

వెలలేని సిరులకంటెను
నిల నారోగ్యంబు లెస్స, యేలికయైనన్
బలమగు రోగము గల్గిన
నలతియు సౌఖ్యంబు గాంచఁడయ్య కుమారా!

**ప్రశ్నలు :**

1. అధికమైన సంపదలకంటె గొప్పది ఏది?
2. రాజైనా ఆరోగ్యం లేకపోతే ఏమి పొందలేడు ?
3. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.
4. ఈ పద్యం ఎవరిని సంబోధిస్తూ చెప్పబడింది?

**సమాధానాలు :**

1. అధికమైన సంపదలకంటే ఆరోగ్యం గొప్పది.
2. రాజైనా ఆరోగ్యం లేకపోతే సుఖాన్ని పొందలేడు.
3. ఈ పద్యానికి శీర్షిక 'ఆరోగ్యమే మహాభాగ్యం!'
4. ఈ పద్యం కుమారుని సంబోధిస్తూ చెప్పబడింది.

అ) 1, 2, 3, 4 ప్రశ్నలు (అపరిచిత గద్య ప్రశ్నలకు సమాధానాలు)

1) ఎయిడ్స్ అనేది నేడు అతిభయంకరమైన వ్యాధిగా పరిణమించింది. ఇది హెచ్.ఐ.వి. వల్ల సంభవిస్తుంది. హెచ్.ఐ.వి. అంటే హ్యూమన్ ఇమ్యునో డెఫిషియన్సీ వైరస్ అని. ఇది మనిషిలోని రోగ నిరోధక శక్తిని క్షీణింపజేసే సూక్ష్మక్రిమి. ఎయిడ్స్ వ్యాధి మొదట 1981 లో అమెరికాలో కనిపెట్టబడింది. ఇప్పుడు మన దేశంలో లక్షల మంది ఈ వ్యాధితో బాధపడుతున్నారు. ఈ వ్యాధి సోకినవారితో కరచాలనం చేసిన, ఆడిన, పని చేసిన ఈ వ్యాధి సోకదు. కాబట్టి ఎయిడ్స్ ఉన్నవారిని కూడా జనసామాన్యంలో కలుపుకొని వారిలో ఆత్మస్థైర్యం పెంచాలి.

ప్రశ్నలు :

1. నేడు అతిభయంకరమైన వ్యాధిగా పరిణమించినది ఏది ?
2. హెచ్.ఐ.వి. అనగా నేమి ?
3. ఎయిడ్స్ వ్యాధి మొదట ఏ దేశంలో కనిపెట్టబడింది ?
4. ఎయిడ్స్ వ్యాధిగ్రస్తులలో ఎలా ఆత్మస్థైర్యం పెంచాలి ?

జవాబులు:–

1.
2.
3.
4.

2) విద్యార్థికి క్రమశిక్షణ చాలా అవసరం. ఒక క్రమపద్ధతి ప్రకారం తన పనులన్నీ తానే చేసుకోవాలి. ఇతరులపై ఆధారపడకూడదు. ఎప్పటి పని అప్పుడే చేయాలి. వాయిదా వేయకూడదు. ఆత్మనిగ్రహాన్ని అలవరచుకోవాలి. చీటికీమాటికీ కోపం తెచ్చుకోగూడదు. తోటివారిని చూసి ఈర్ష్య పడకూడదు. అసూయపడకూడదు. చదువులోనూ, సత్ప్రవర్తనలోనూ తోటివారిని మించాలనే పట్టుదలతో కృషిచేయాలి. అంతేకాని వాళ్ళు నీకంటే ముందున్నారని అసూయపడకూడదు. నీకంటే ముందున్న వారిపట్ల అసూయకూడనట్లే నీకంటే వెనుకబడిన వారిపట్ల చులకనభావం కూడా ఉండకూడదు. వాళ్ళకు తగిన ప్రోత్సాహం ఇవ్వాలి. ఆత్మ విశ్వాసాన్ని విద్యార్థులు పెంపొందించుకోవాలి.

ప్రశ్నలు :

1. విద్యార్థికి ఏది అవసరం ?
2. విద్యార్థి దేనిని అలవరచుకోవాలి ?
3. ఏ విషయంలో పట్టుదలతో కృషిచేయాలి ?
4. ఎవరిపై చులకనభావం ఉండకూడదు ?

జవాబులు:–

1.
2.
3.
4.

3) తెలుగు భాషలో కావ్యరచన నన్నయతో మొదలయింది. తిక్కనాదులు విస్తృతం చేశారు. బమ్మెర పోతన భాగవతాన్ని తెనిగించాడు. పెద్దనాదులు ప్రబంధ రచన చేశారు. తిరుపతి వేంకట కవులు అవధాన విద్యలో వీరవిహారం చేశారు. వెయ్యేళ్ళ నుంచి నేటికీ పద్యం నిలదొక్కుకొని విరాజిల్లుతూ ఉంది.

ప్రశ్నలు :

1. తొలి తెలుగు కావ్యం ఎవరు వ్రాశారు ?
2. భాగవతాన్ని తెలుగులో వ్రాసిందెవరు ?
3. ఎంత కాలం నుంచి పద్యం నిలిచి ఉంది ?
4. తిరుపతి వేంకటకవులు ఏ విద్యలో ప్రసిద్ధులు ?

జవాబులు:–

1.
2.
3.
4.

4) శ్రీశ్రీ అసలు పేరు శ్రీరంగం శ్రీనివాసరావు. ఆయన భావ కవిత్వంపై తిరుగుబావుటా ఎగురవేసి అభ్యుదయ ఉద్యమానికి నాంది పలికాడు. ఆ తరువాత విప్లవ కవిత్వమునకు స్ఫూర్తినిచ్చాడు. "అనితర సాధ్యం నా మార్గం" అని చాటిన ప్రజాకవి. "మహాప్రస్థానం" కావ్యం, "సిరిసిరిమువ్వ" శతకం శ్రీశ్రీకి మంచి కీర్తిప్రతిష్ఠలు సంపాదించి పెట్టినవి. ఆయన సమాజాన్ని చైతన్యపరిచే రచనలెన్నో చేశాడు. అందుకే సాహిత్య విమర్శకులు ఆయనను అభ్యుదయ కవిత్వానికి యుగకర్త అంటారు.

ప్రశ్నలు :

1. శ్రీశ్రీ అసలు పేరేమి ?
2. ఆయన అభ్యుదయభావాలు దేనికి స్ఫూర్తినిచ్చాయి ?
3. తన రచనా శైలి విషయంలో ఆయన ఏమి చాటుకున్నారు ?
4. శ్రీశ్రీకి కీర్తిప్రతిష్ఠలు తెచ్చిన రచనలు ఏవి ?

జవాబులు:–

1.
2.
3.
4.

5) గాంధీ మహాత్ముడు పోరుబందరులో జన్మించాడు. అక్కడ అతని బాల్యంలో చదువు ఏ మాత్రము సాగలేదు. అతని తండ్రి పోరుబందరు నుండి రాజకోట వచ్చి కొత్త ఉద్యోగంలో చేరాడు. అక్కడ గాంధీ విద్యార్థి జీవితం ప్రారంభం అయింది. అతడు ముందుగా సబర్బను స్కూలులోను, ఆ తరువాత హైస్కూలులోను చేరి చదువుకున్నాడు. విద్యార్థి దశలో అతను ఎక్కువ బిడియంతో ఉండి ఎవరితోను కలిసిమెలిసి ఉండేవాడు కాదు. ఒకనాడు పరీక్షాధికారి అయిదు మాటలు చెప్పి, వాటి వర్ణక్రమాన్ని వ్రాయమన్నాడు. వాటిలో "కెటిల్" అనే మాటను గాంధీ తప్పుగా వ్రాశాడు.

ప్రశ్నలు :

1. గాంధీ ఎక్కడ జన్మించాడు ?
2. అతడు ఏ యే స్కూళ్లలో చదువుకున్నాడు ?
3. విద్యార్థి దశలో అతను ఎలా ఉండేవాడు ?
4. అతడు పరీక్షలో దేనిని తప్పుగా వ్రాసాడు ?

జవాబులు:–

1.
2.
3.
4.

6) కవిత్వానికి లేని కొత్త సమస్య ఒకటి ఇప్పుడు తలెత్తింది. కవిత్వానికి "ఛందస్సు అవసరమా ? అనవసరమా ?" ఛందస్సు అంటే ఇక్కడ గణ, యతి, ప్రాసలతో నిబద్ధమైన పద్య నియమావళి. అప్పకవీయమూ తదితర గ్రంథాలలో ఉన్నది. నన్నయ మొదలుకొని తిరుపతి వేంకటకవుల వరకు పండిత కవులు అనుసరించిరి. భావకవులు గేయఛందస్సును అనుసరించినా ఈ పద్యఛందస్సును తిరస్కరించలేదు.

ప్రశ్నలు :

1. ఛందస్సు అనగా నేమి ?
2. గేయఛందస్సు ననుసరించిన వారెవరు ?
3. ఇప్పుడు తలెత్తిన సమస్య ఏది ?
4. భావకవులు వేనిని తిరస్కరించలేదు ?

జవాబులు:–

1.
2.
3.
4.

"క్రింది పద్యం చదివి దాని క్రింద ఇచ్చిన ప్రశ్నలకు సమాధానం వ్రాయండి."

1. *గంగిగోవు పాలు గరిటెడైనను చాలు*
   *కడివెడైన నేమి ఖరము పాలు*
   *భక్తి కలుగు కూడు పట్టెడైనను చాలు*
   *విశ్వదాభిరామ వినుర వేమ.*

ప్రశ్న కు ఎదురుగా జవాబులను వ్రాయుము

ప్రశ్నలు :

1. ఏ పాలు గరిటెడు చాలు ?
2. ఖరము అనగా నేమి ?
3. పట్టెడు ఎటువంటి తిండి కావాలి ?
4. ఈ పద్యానికి మకుటం ఏమిటి ?

ప్రశ్న కు ఎదురుగా జవాబులను వ్రాయుము

2. *అక్షరంబు వలయు కుక్షి జీవనులకు*
   *అక్షరంబు జిహ్వ కిక్షు రసము*
   *అక్షరంబు తన్ను రక్షించు గావున*
   *నక్షరంబు లోక రక్షితంబు.*

ప్రశ్నలు :

1. మానవులకు ఏమి కావాలి ?
2. అక్షరంబు జిహ్వకు ఎటువంటిది ?
3. అక్షరము దేనిని రక్షిస్తుంది ?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

ప్రశ్న కు ఎదురుగా జవాబులను వ్రాయుము

3. *పూజకన్న నెంచ బుద్ధి ప్రధానంబు*
   *మాటకన్న నెంచ మనసు దృఢము*
   *కులముకన్న మిగులు గుణము ప్రధానంబు*
   *విశ్వదాభిరామ వినుర వేమ.*

ప్రశ్నలు :

1. పూజకన్నా ముఖ్యమైనది ఏది ?
2. మాట కన్నా దృఢమైనది ఏది ?
3. కులము కంటే ప్రధానమైనది ఏది ?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

ప్రశ్న కు ఎదురుగా జవాబులను వ్రాయుము

4. రాజు చేతి కత్తి రక్తంబు వర్షించు
సుకవి చేతి కలము సుధలు గురియు
అతడేల గలుగు యావత్ప్రపంచంబు
నీతడేల గలుగు ఇహము పరము.

ప్రశ్నలు :

1. రాజు చేతి కత్తి దేనిని వర్షిస్తుంది ?
2. సుధలు కురిపించునది ఏది ?
3. యావత్ప్రపంచాన్ని పరిపాలించగలిగింది ఎవరు ?
4. ఈ పద్యానికి శీర్షికను సూచించండి.

ప్రశ్న కు ఎదురుగా జవాబులను వ్రాయుము

5. కందుకమువోలె సుజనుడు
క్రిందంబడి మగుడ మీదికి న్నెగయుఁ జుమీ
మందుడు మృత్పిండము వలె
గ్రిందంబడి యడగియుండుఁ గృపణత్వమునన్.

ప్రశ్నలు :

1. సుజనుడు ఎట్టివాడు ?
2. మందుడు ఎట్టివాడు ?
3. ఈ పద్యానికి శీర్షిక సూచించండి.
4. ఈ పద్యంలో ఉన్న అర్థాలంకారమేది ?

6) అనగననగ రాగమతిశయిల్లుచునుండు
తినగతినగవేము తీయనుండు
సాధనమున పనులు సమకూరుధరలోన
విశ్వదాభిరామ వినురవేమ.

ప్రశ్నలు :

1. రాగము ఎలా అభివృద్ధి చెందుతుంది ?

2. తినగా తినగా తీయగా ఉండేది ఏది ?

3. పనులు ఎలా సమకూరుతాయి ?

4. ఈ పద్యమునకు శీర్షిక ఏమి ?

7) కసవుచే నీటిచే మోదకలన చేత
బ్రతుకు మృగమీన సజ్జన ప్రకరమునకు
శబరకైవర్తసూచకజనులు జగతి
కారణములేని పగవారు కారెదలప.

ప్రశ్నలు :

1. కసవుచే బ్రతుకునవేవి ?

జ.

2. సజ్జనులు ఏది కలిగియుండుట చేత బ్రతుకుతారు ?

జ.

3. మీనములకు శత్రువులెవరు ?

జ.

4. ఈ పద్యములోని అలంకారమేది ?

జ.

8) ఆడకుమసత్యభాషలు
కూడకుగొఱగాని వాని గొంకక యొరులె
గ్గాడిన నెదురుత్తరమీ
జూడకు వినివినని వాని చొప్పున జనుమీ.

ప్రశ్నలు :

1. ఏది మాట్లాడకూడదు ?

జ.

2. ఎవరితో స్నేహము చేయకూడదు ?

జ.

3. ఇతరులు నిందించిన ఏమి చేయాలి ?

జ.

4. ఈ పద్యమునకు శీర్షిక ఏది ?

జ.

9) ఎఱుకగలవారి చరితలు
గఱచుచు సజ్జనుల గోష్ఠి గదలక ధర్మం
బెఱుగుచు నెఱిగిన దానిని
మఱువక నుష్ఠించునది సమంజస బుద్ధిన్.

ప్రశ్నలు :

1. ఎవరి చరిత్ర తెలుసుకోవాలి ?

జ.

2. ధర్మము ఎలా తెలుసుకోవచ్చును ?

జ.

3. సమంజస బుద్ధితో దేనిని అనుష్ఠించాలి ?

జ.

4. ఈ పద్యమునకు శీర్షిక సూచించండి.

జ.

10) తివిరి యిసుమున తైలంబు దీయవచ్చు
తవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చు
తిరిగి కుందేటికొమ్ము సాధించవచ్చు
చేరి మూర్ఖుని మనసు రంజింపరాదు.

ప్రశ్నలు :

1. తైలము ఎచ్చట నుంచి తీయవచ్చును ?

జ.

2 ఎచట నీరు కూడా త్రాగవచ్చును ?

జ.

3. కుందేటి కొమ్ము ఎలా సాధించవచ్చును ?

జ.

4. ఈ పద్యమునకు శీర్షిక ఏది ?

జ.

11) ధనము కూడబెట్టి ధర్మంబుసేయక
తాను తినక లెస్సదాచుగాక
తేనెటీగ గూర్చి తెరువరికీయదా
విశ్వదాభిరామ వినురవేమ !

ప్రశ్నలు :

1. తేనెటీగ తేనె కూడబెట్టి ఎవరికిస్తుంది ?

జ.

2. తాను తినక, ధర్మము చేయక కూడబెట్టు వారినేమందురు ?

జ.

3. పై పద్యములో నీతి ఏమిటి ?

జ.

4. పై పద్య రచయిత ఎవరు ?

జ.

12) అఘమువలన మరల్చు హితార్థకలితు
జేయు గోప్యంబుదాచు, బోషించుగుణము
విడువడాపన్నులేవడి వేళనిచ్చు
మిత్రుడీ లక్షణంబుల మెలగుచుండు.

ప్రశ్నలు :

1. మిత్రుడు దేనినుంచి మరల్చును ?

జ.

2. మిత్రుడు ఏమి దాచుతాడు ?

జ.

3. మిత్రుడు ఎవరిని విడువడు ?

జ.

4. ఈ పద్యమునకు శీర్షిక ఏది ?

జ.

13) ధరణి ధేనువు బిదుకంగ దలచితేని
జనులబోషింపుమధిపవత్సములమాడ్కి
జనులు పోషింపబడుచుండ జగతికల్ప
లతలెఱుంగున సకల ఫలంబులొసగు.

ప్రశ్నలు :

1. అధిపులు ఎవరిని పోషించాలి ?

జ.

2. జగతి ఏమి ఇచ్చును ?

జ.

3. ధరణి దేనితో పోల్చబడింది ?

జ.

4. పై పద్యమునకు శీర్షిక ఏది ?

జ.

14) అక్షరంబు వలయుకుక్షి జీవనులకు
అక్షరంబు జిహ్వ కిక్షురసము
అక్షరంబు తన్నురక్షించుగావున
అక్షరంబు లోకరక్షితంబు.

ప్రశ్నలు :

1. మానవులకు కావలసినది ఏది ?

జ.

2. అక్షరము నాలుకకు ఎటువంటిది ?

జ.

3. అక్షరము ఎవరిని రక్షిస్తుంది ?

జ.

4. ఈ పద్యమునకు శీర్షిక ఏమి ?

జ.

15) మొదలజూచిన గడుగొప్ప పిదపగుఱచ
ఆదికొంచెము తర్వాత నధికమగుచు
తనరుదినపూర్వపర భాగజనితమైన
ఛాయపోలిక కుజన సజ్జనులమైత్రి.

ప్రశ్నలు :

1. కుజనుల మైత్రి ఎలా ఉంటుంది ?

జ.

2. సజ్జనుల మైత్రి ఎలా ఉంటుంది ?

జ.

3. కుజనుల మైత్రిని దేనితో పోల్చాడు ?

జ.

4. ఈ పద్యమునకు శీర్షిక ఏమి ?

జ.

16) తరువు లతిరసఫలభారగుఱుత గాంచు
నింగివ్రేలుచు నమృత మొసంగుమేఘుడు
ద్ధతులు గారు బుధులు సమృద్ధి చేత
జగతినుపకర్తలకునిది సహజగుణము.

ప్రశ్నలు :

1. చెట్లు ఏమిస్తాయి ?

జ.

2. మేఘుడు ఎక్కడ ఉంటాడు ?

జ.

3. ఎవరు గర్వముగా ఉండరు ?

జ.

4. ఈ పద్యమునకు శీర్షిక ఏమి ?

జ.

## (సొంతవాక్య ప్రయోగాలు)

1. పొంగిపొర్లు (ఉప్పొంగు) :-
2. సలాంకొట్టు (వీడ్కోలు చెప్పు) :-
3. అపురూపం (ప్రేమగా, జాగ్రత్తగా) :-
4. ప్రాధేయపడు (ప్రార్థించు) :-
5. ఇంటిల్లిపాది (ఇంట్లోనివారంతా) :-
6. పెనవేసుకొను (అల్లుకొను) :-
7. పగటికలలు (అసంభవాలు) :-
8. విడ్డూరం (వింత) :-
9. తలదన్ను (మించిపోవు) :-
10. అయోమయం (గందరగోళం) :-
11. యథాప్రకారం (ఎప్పటిలాగే) :-
12. తామరతంపర (విపరీతంగా పెరగటం) :-
13. కాలక్షేపం (కాలం గడపడం) :-
14. ఇంచుమించు (సుమారు) :-
15. పుంఖానుపుంఖాలు (ఒకదాని వెంబడిఒకటి) :-
16. భగీరథ ప్రయత్నం (గొప్పకార్యదీక్ష) :-
17. గొడ్డలిపెట్టు (పెద్దదెబ్బ) :-
18. ఆపాదమస్తకం (శరీరమంత) :-

19. రసాభాసం (గందరగోళం) :-

20. అట్టుడికినట్లు (కల్లోలంపొందడం) :-

21. పుస్తకాలపురుగు (పుస్తకాలు ఎక్కువగా చదవడం) :-

22. అరునూరగు (ఏది ఏమైన) :-

23. వేలెత్తిచూపు (ఆక్షేపించు) :-

24. పదేపదే (మాటిమాటికి) :-

25. తండోపతండాలు (లెక్కలేనన్ని) :-

26. ఉనికిపట్టు (నివాసం) :-

27. ఆటపట్టించు (ఎగతాళి చేయు) :-

28. అందెవేసిన చేయి (మంచినేర్పరి) :-

29. గగనకుసుమము (అసంభవమైనది) :-

30. కత్తిమీదసాము (కష్టమైన పని) :-

1. దోపిడీ చేయు :-
2. ప్రాథేయపడు :-

3. ఇంటిల్లిపాది :-
4. పెనవేసికొను :-
5. కుదుటపడు :-
6. తిరుగుమొహం :-

7. పగటికలలు :-
8. సంప్రదింపులు :-

9. తలదన్ను :-

10. మృత్యువాత పడు :-

11. విశృంఖల విహారం :-

12. తామరతంపర :-

13. కాలక్షేపం :-

14. అడ్డదారిపట్టు :-

15. పుంఖానుపుంఖాలు :-

16. భగీరథ ప్రయత్నం :-

17. గొడ్డలిపెట్టు :-

18. ఆపద్ధర్మం :-

19. ఆపాదమస్తకం :-

20. ఒరవడిదిద్దు :-

21. వేలెత్తిచూపు :-

22. పుస్తకాల పురుగు :-

23. ఆరునూరగు :-

24. నిమ్మకు నీరెత్తినట్లు :-

25. తండోపతండాలు :-

26. ఉనికిపట్టు :-

27. అట్టహాసం :-

28. సతమతం :-

29. ఆటపట్టించు :-

30. ప్రియభాషలు :-

31. అవిరామం :-

32. వలలు వేయడం :-

33. విచ్చలవిడి :-

34. పొంగిపొర్లు :-

35. సలాంకొట్టు :-

36. చేజారిపోవు :-

37. వీధిపాలుజేయు :-

38. చిక్కుబడిపోవు :-

39. అపురూపం :-

40. అక్కున చేర్చుకొను :-

41. గగనకుసుమం :-

42. అందెవేసిన చేయి :-

43. అయోమయం :-

44. ఇంచుమించు :-

45. రసాభాసం :-

## ఆధునిక వచనంలోనికి పరివర్తన

1. ఇందయుండిన నగ్నిభయంబు సంశయితంబు.

జ.

2. ప్రాణభయంబున గగనంబున కెగసి చనెను.

జ.

3. ఇప్పుడ ఎటయేని బోయె.

జ.

4. ఈ పరతంత్ర జీవనము నెట్లు భరింతురు ?

జ.

5. తత్పురుష సమాసమునకే వ్యధికరణమని పేరు కలదు.

జ.

6. రాయీ రప్పా కాలికి తగులుచుండును.

జ.

7. మావలని మోహంబు విడచి యరుగుము.

జ.

8. మీ వ్యవసాయంబ గడించి పెట్టవలె మీ వాల్లభ్యమున్.

జ.

9. ఆగ్రహమింత సూపిన ప్రయత్నము సర్వము రిత్తవోవును.

జ.

10. చీకటులు కూర్చెనందమ్ము లోకమునకు.

జ.

11. తక్కిన వానితో పాటదియు పండును.

జ.

12. అతని వ్యాపారము న్యాయమార్గమున సాగుచున్నది.

జ.

13. మంటలు వేగముగా వ్యాపించుచున్నవి.

జ.

14. పవనాంధోలోకమున్ చేరె గంగా కూలంకష.

జ.

15. అటుల బిత్తర పోయెదవేమి ?

జ.

16. ఇంచుమించుగా పదునైదు వర్షములు గడచినవి.

జ.

17. బేలా ! ధనుర్బాణపాణినై నీ చెంత నేనుంటిని గదా ! నీకేల భయం ?

జ.

18. ఈ వ్యాసకర్తలకు ఆ కొండజిలో చేరుటకధికారము గలదు.

జ.

19. పురుషుడు న్యాయము దప్పక విద్యాధనంబులు గడింపవలెను.

జ.

20. వనంబు పక్షులెయ్యడబడి చచ్చి తేలెన్.

జ.

1. చండీశ్వరీదేవి జలజలా పారించె శాత్రవుల రక్తంబు.

జ.

2. జరిత గగనంబున కెగసి చనెను.

జ.

3. రణంబిది విక్రమింపుడీ.

జ.

4. నా జీవితములో అది ఒక సువర్ణావకాశము

జ.

5. మా వలని మోహంబు విడిచి యరుగుము.

జ.

6. ఇంద యుండిన నగ్ని భయంబు నంశయితము.

జ.

7. ప్రాణ భయంబున గగనంబున కెగసి చనెను.

జ.

8. ఈ పరతంత్ర జీవనాన్ని ఎట్లు భరింతురు ?

జ.

9. మీ వ్యవసాయంబ గడించి పెట్టవలె మీ వాల్లభ్యమున్.

జ.

10. ఆగ్రహమింత సూపిన ప్రయత్నము సర్వము రిత్తవోవును.

జ.

11. మంటలు వేగముగా వ్యాపించుచున్నది.

జ.

12. అతని వ్యాపారము న్యాయ మార్గమున సాగుతున్నది.

జ.

13. పదేపదే చదివినచో పద్యము తప్పక అర్థమగును.

జ.

14. పురుషుడు న్యాయము దప్పక విద్యా ధనంబులు గడింపవలెను.

జ.

15. అక్కడ నున్న నౌకరులందరును నవ్వినారు.

జ.

16. అటుల బిత్తర పోయెదవేమి ?

జ.

17. కొందరుపన్యాసముల మూలమున నాపని చేయుదురు.

జ.

18. చూత్కార పరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నమున్ దెల్పెడిన్.

జ.

19. బేల ! ధనుర్బాణపాణినై నీచెంత నేనుంటిని గదా, నీకేల భయము.

జ.

20. ఇంచుమించు పదునైదు వర్షములు గడిచినవి.

జ.

21. కులము కన్న గుణము ప్రధానంబు.

జ.

22. కష్టములును, సుఖములునుకావడి కుండల వంటివి.

జ.

23. ఆ చోట వర్ధింపు మమరజన్మము నీది.

జ.

24. కావున నీవు మెచ్చిన చోటికి బోవనోపము.

జ.

## వ్యతిరేకార్థక వాక్యాలు

1. వింకిల్‌కు పరమాణు విచ్ఛేదన అంతగా నచ్చింది.

జ.

2. ఈ బిలంలో మీరు ప్రవేశించండి.

జ.

3. అందరూ ఒక్కసారిగా మాట్లాడుతున్నారు.

జ.

4. పుస్తకాలతో కాలక్షేపం ఆయనకు ఇష్టం.

జ.

5. వదరుబోతు వ్యాసాలకు, సాక్షి వ్యాసాలకు సామ్యం ఉంది.

జ.

6. మీ కృషియే మీకు అధికారాన్నిస్తుంది.

జ.

7. అతను రేపు రావచ్చు.

జ.

8. రవి నిన్న వచ్చాడు.

జ.

9. ప్రభుత్వానికి డాలర్లు కావాలి.

జ.

10. నేను వచ్చే సంవత్సరం కాలేజీలో చేరతాను.

జ.

11. చేనేత వారోత్సవాల అంకెలూ, వివరాలు తెలిశాయి.

జ.

12. పై కప్పీలో ఇరుక్కున్న తీగె సవరించబడింది.

జ.

13. భారత క్రికెట్టు జట్టు ప్రపంచకప్పు గెల్చుకుంది.

జ.

14. నాలో చురుకుదనమూ, జిజ్ఞాసా ఉన్నాయి.

జ.

15. బాల్యం ఎప్పుడూ శాశ్వతంగా ఉంటుంది.

జ.

16. వాళ్లకు వలలు వెయ్యడం చేతనవుతుంది.

జ.

17. కవులకు కొన్ని అభిమాన పదాలుంటాయి.

జ.

18. ప్రబలమైన యంత్రాలను అతనికి చూపారు.

జ

19. ప్రపంచమంతా జ్ఞానప్రకాశాన్ని పొందాలి.

జ.

20. సముద్రం పిల్లలతో ఆడుకుంటుంది.

జ.

21. సూర్యుడు తూర్పు దిక్కున ఉదయిస్తాడు.

జ.

22. మాట్లాడడానికి నీకు అన్ని భాషలు వస్తాయి.

జ.

23. అన్ని పనులకు అదే ఆధారము

జ.

24. నాటకం రసాభాస కాలేదు.

జ.

25. ఆమె బాగా వంట చేయలేదు.

జ.

1. రైతు బజార్లో కూరగాయలు చౌకధరలకు లభించుచున్నవి.

జ.

2. అతడు రేపు రావచ్చు.

జ.

3. రేవతికి సంగీతమంటే ఇష్టం లేదు.

జ.

4. మీ కృషియే మీకు రాజ్యాధికారము నిస్తుంది.

జ.

5. ప్రవరుడు హిమాలయాలను చూసి ఆనందించెను.

జ.

6. రాజకీయవేత్తలు నైతికవిలువలను కాపాడుతున్నారు.

జ.

7. నేటి విద్యార్థులలో క్రమశిక్షణ లోపించింది.

జ.

8. ఆమె చెడుమాటలు వింటుంది.

జ.

9. కవులకు కొన్ని అభిమాన పదాలు ఉంటాయి.

జ.

10. రవి నిన్న వచ్చాడు.

జ.

11. వాడు రేపు రావచ్చు.

జ.

12. సముద్రతీరంలో పిల్లలు ఆడుకుంటున్నారు.

జ.

13. చిట్టికి తగని భయం వేసింది.

జ.

14. రాజకీయవేత్తలలో మేధావులున్నారు.

జ.

15. అతడు తప్పుగా ప్రవర్తించాడు.

జ.

16. పిల్లలకు ఇష్టమైన పదార్థాలు కొన్ని ఉన్నాయి.

జ.

17. పెద్దలు చీటికిమాటికి తిడుతూ ఉంటారు.

జ.

18. ప్రపంచమంతా జ్ఞాన ప్రకాశాన్ని పొందాలి.

జ.

19. లక్ష్మీబాయి తల్లిదండ్రులు పెట్టిన పేరు కూడా నిలుపుకోలేకపోయింది.

జ.

20. రచయిత బొందుమల్లెలమ్మి ధనికులను దోపిడీ చేయదలచాడు.

జ.

## ప్రత్యక్ష కథనాన్ని, పరోక్ష కథనంలోకి మార్చుట.

1. "నా పుస్తకాలు, కాగితాలు ఏవి ? ఎవరు తీశారు ?" అని అంబేద్కర్ కేకలు వేసేవాడు.

జ.

2. "నేను మా ఊరిలో పదవ తరగతి వరకు చదివాను." అన్నాడు రవి.

జ.

3. "నాకు కోపం వచ్చినా అది శాశ్వతంగా ఉండదు" అని గాంధీజీ అన్నారు.

జ.

4. "నేను ఎవరిని యాచించను" అని అంబేద్కర్ అన్నారు.

జ.

5. "నాకెవరున్నారు, నేనెవరికి కావాలి" అని లక్ష్మీబాయి కుమిలిపోయేది.

జ.

6. "ఆపేరంటే ఇప్పటికీ నాకెంతో ఇష్టం". అంది లక్ష్మీబాయి.

జ.

7. "నాతో ఇన్ని బేరాలు లేవు" అని రచయిత అన్నాడు.

జ.

8. "నాకే వ్యసనాలు లేవు. శీలసంవర్ధనంలో అభిమాన పడతాను" అని అంబేద్కర్ అన్నాడు.

జ.

9. "నేను కఠినుడనని అందరూ అంటారు. నిజానికి నేను చాలా శాంతస్వభావం కలవాడిని" అని అంబేద్కర్ తనను గురించి చెప్పుకున్నాడు.

జ.

10. "నా పాటలంటే అందరికీ ఇష్టమే. అయితే నాకంటె బాగా పాడగలిగినవారు ఎందరో ఉన్నారు" అని ఒక గాయకుడు అన్నాడు.

జ.

1. సత్యభామ రుక్మిణితో "మన భర్తకు ఇలాంటి స్థితి పట్టింది గాదా ! అన్న నీ ఆవేదనలో నీ ధ్యానం నిలకడ తప్పింది" అన్నది.

జ.

2. "నాపాటలంటే అందరికీ ఇష్టమే. అయితే నా కంటే బాగా పాడగలిగినవారు ఎందరో ఉన్నారు." అని ఒక గాయకుడన్నారు.

జ.

3. జైల్లో ఖైదీలందరికీ కవర్లిచ్చినప్పుడు "నాకెవరున్నారు ? నేనెవరికి కావాలి ?" అని లక్ష్మీబాయి కుమిలిపోయింది.

జ.

4. "నాతో ఇన్ని బేరాలు లేవు." అని రచయిత అన్నాడు.

జ.

5. "నేను ఆవకాయ లేనిదే ముద్ద ఎత్తను." అని చెప్పాడు.

జ.

6. "అందరూ విద్య నేర్వండి." అని ప్రభుత్వం అంటున్నది.

జ.

7. "నేను మా ఊళ్ళో పదవతరగతి దాకా చదివాను." అని రవి అన్నాడు.

జ.

8. "నేను మా ఊళ్ళో నాల్గవతరగతి దాకా చదివాను." అని లక్ష్మీబాయి తన ఆత్మకథలో వ్రాసుకున్నది.

జ.

9. "త్వరగా దిగవయ్యా, ఆలస్యమవుతుంది." అని స్టేషన్ మాస్టరు పార్వతీశంతో అన్నారు.

జ.

10. అంబేద్కర్ "నేను ఎవరిని యాచించను." అంటారు.

జ.

11. జరితారి తల్లితో "అమ్మా నీవు బ్రతికి యున్న మా వంటి పుత్రులను పొందవచ్చును." అని అన్నాడు.

జ.

12. "నాపుస్తకాలు, కాగితాలు ఏవి ? ఎవరు తీశారు ?" అని అంబేద్కర్ కేకలు వేసేవాడు.

జ.

## పరోక్ష కథనాన్ని ప్రత్యక్ష కథనంలోకి మార్చుట

1. తాను ఘటకేశ్వరంలో పుట్టిపెరిగానని లక్ష్మీబాయి అన్నారు.

జ.

2. తన మల్లెలు ఎంతోమంది యువతులు ధరించారని, తాను రసజీవినని రచయిత అన్నాడు.

జ.

3. ఆయన సౌమ్యంగా అమ్మా అంటూ, ఆమెను అలా చేయవద్దనీ, తనకలాంటివి ఇష్టం ఉండవనీ, తనకాళ్ళు ముట్టుకోవద్దని వారించేవాడు.

జ.

4. తమ నాగరికతా ప్రగతిని గురించి అతని అభిప్రాయమేమిటని రిపోర్టర్ వింకిల్‌ను ప్రశ్నించాడు.

జ.

5. తన జీవిత నిర్మాతలు గురువులు ముగ్గురనీ, ఆరాధ్య దేవతలు ముగ్గురనీ అంబేద్కర్ అన్నాడు.

జ.

6. గంభీరమైన తన ముఖం చూసి, ఎవరూ తనతో స్నేహం చేయడానికి ఇష్టపడరని అంబేద్కర్ అంటుండేవారు.

జ.

7. తాను జైలు నుండి విడుదలై హైదరాబాదు వెళ్లినప్పుడు తనకు ఘనస్వాగతం లభించిందని లక్ష్మీబాయి చెప్పింది.

జ.

8. తన రచనలలో తన జీవితం ఉంటుందని ఒక రచయిత తన మిత్రునితో అంటున్నాడు.

జ.

9. తనను చూస్తే అందరూ భయపడతారు. కాని తన దగ్గరకు రాకుండా పోరు అని సుబ్బారావు అన్నాడు.

జ.

10. అతను ఆవకాయలేనిదే ముద్ద ఎత్తనని చెప్పాడు.

జ.

### గీతగీచిన మాటను ప్రధానం చేసి వ్రాయుట

1. వ్యర్థపదాలను కవులు పాదపూరణకై ఉపయోగించారు.

జ.

2. మీ అమ్మ నీకోసం ఎన్ని వ్రతాలు, నోములు నోచిందో.

జ.

3. చేనేత పనివాళ్లు తిండిలేక మలమల మాడిపోతున్నారు.

జ.

4. ఆ చిత్రమంటే ఇప్పటికీ నాకెంతో ఇష్టం.

జ.

5. ఇప్పుడు ఆ పెత్తందారులే చేనేత సప్తాహాలు చేస్తున్నారు.

జ.

6. నేను పదవతరగతి దాకా హైదరాబాద్‌లో చదువుకున్నాను.

జ.

7. ఈనాటికీ ఆయన చదువుకోని జ్ఞాని అని అనుకుంటాను.

జ.

8. నా మల్లెలు ఎంతో మంది యువతులు ధరించారు.

జ.

9. శ్రీకృష్ణదేవరాయలు విజయనగరాన్ని పాలించిన రాజులందరిలో శ్రేష్ఠుడు.

జ.

10. సాక్షివ్యాసాలు ఆంధ్రదేశమంతటా ప్రాచుర్యం పొందాయి.

జ.

11. ఇపుడందరికీ కంప్యూటర్ జ్ఞానం అవసరమౌతుంది.

జ.

12. ఆ పిలకంటే పార్వతీశంకు చాలా ఇష్టం.

జ.

13. ఆ పేరంటే ఇప్పటికీ నాకెంతో ఇష్టం.

జ.

14. నేను పదిరూపాయలు పెట్టి ఈ పుస్తకం కొన్నాను.

జ.

15. పార్వతీశం రైలులో ప్రయాణం చేసాడు.

జ.

16. ప్రాంప్టరు చెవిలో ఊదాడు.

జ.

17. తాతను నేనే పెద్ద దోపిడీ చేసాను.

జ.

18. నాయకులు కళ్లున్నా చూడలేని స్థితిలో ఉన్నారు.

జ.

19. నా జీవితంలో అది ఒక సువర్ణావకాశం.

జ.

20. జనమంతా పగలబడి నవ్వుతూ గోల చేస్తున్నారు.

జ.

1. <u>శ్రీ కృష్ణదేవరాయలు</u> విజయనగరాన్ని పాలించిన రాజులందరిలో శ్రేష్ఠుడు.

జ.

2. సాక్షి వ్యాసాలు <u>ఆంధ్రదేశమంతటా</u> ప్రాచుర్యం పొందాయి.

జ.

3. <u>తిండిలేక</u> చేనేతపని వాళ్ళు ఎలకల్లా మాడిపోతున్నారు.

జ.

4. స్థానం నరసింహారావుగారు <u>స్త్రీ పాత్రతో</u> నాటకరంగంలో ప్రఖ్యాతి చెందినాడు.

జ.

5. <u>ప్రాంప్టరు</u> చెవిలో ఊదాడు.

జ.

6. నేను <u>పదవ తరగతి</u> దాకా <u>హైదరాబాదు</u>లో చదువుకున్నాను.

జ.

7. నాజీవితంలో <u>అది</u> ఒక సువర్ణావకాశం.

జ.

8. <u>నామల్లెలు</u> ఎంతో మంది యువతులు ధరించేరు.

జ.

9. ఇప్పుడందరికీ <u>కంప్యూటర్ జ్ఞానం</u> అవసరమౌతుంది.

జ.

10. <u>అంబేద్కర్</u> పుస్తకాల గురించి అమితంగా బాధపడ్డాడు.

జ.

11. <u>ఆ ఏలకంటే</u> పార్వతీశంకు చాలా ఇష్టం.

జ.

12. <u>తెలుగులో</u> నూటికి తొంభై మార్కులు వచ్చాయి.

జ.

13. తుఫాను <u>హఠాత్తుగా</u> విరుచుకుపడింది.

జ.

14. ఈ నాటికీ <u>ఆయన చదువుకోని జ్ఞాని</u> అని అనుకుంటాను.

జ.

15. ఈ గది కూడా <u>హోటలుకు</u> తగినట్టుంది.

జ.

16. <u>లక్ష్మీబాయిని</u> శారదానికేతనంలో చేర్పుకుంటామని లక్ష్మీనారాయణ అన్నారు.

జ.

## కర్మణి వాక్యాన్ని కర్తరి వాక్యంగా, కర్తరి వాక్యాన్ని కర్మణి వాక్యంగా మార్చుట

కర్తరి 1. చంద్రమతి వేషమును స్థానం నరసింహారావు ధరించారు.

కర్మణి.

కర్మణి 2. ఆ పద్యం పూర్తి కాకముందే కప్పీలో ఇరుక్కున్న తీగ సవరించబడింది.

కర్తరి.

కర్తరి 3 వాల్మీకి రామాయణాన్ని రచించాడు.

కర్మణి.

కర్తరి 4. ఆధునాతన భవనంలో రిప్‌వాన్‌ను ఉంచారు.

కర్మణి.

కర్తరి 5. కొన్ని సమస్యలు వాటంతటవే పరిష్కారమవుతాయి.

కర్మణి.

కర్తరి 6. పోతన రచించిన భాగవతము గొప్ప గ్రంథము.

కర్మణి.

కర్తరి 7. వివిధ కవులు సుభాషితాలను రచించారు.

కర్మణి.

కర్తరి 8. వీటిని రచించి ఇంచుమించుగా పదిహేను సంవత్సరములు గడచినవి.

కర్మణి.

కర్తరి 9. సప్తాహాలు సమస్యలను పరిష్కరించవు.

కర్మణి.

కర్తరి 10. అతి నవీన పద్ధతులపై ఆదర్శ గృహమును నిర్మించిరి.

కర్మణి.

కర్తరి 11. డీప్‌ఫ్రిజ్ నుండి అప్పుడే బయటకు తెచ్చిన ఆహారాన్ని సేవిస్తాడు.

కర్మణి.

కర్తరి 12. పార్వతీశం సామగ్రిని సర్దుకున్నాడు.

కర్మణి.

కర్తరి 13. అతని చెల్లెలుగా పరిచయం అయిన నా యింటిపేరు అదేగా వ్రాసుకున్నారు.

కర్మణి.

కర్తరి 14. అంబేద్కర్ పరిపూర్ణ జ్ఞానాన్ని సంపాదించాడు.

కర్మణి.

కర్తరి 15. నేను పుస్తకమును చదివాను.

కర్మణి.

1. నేను బడికి రాక ముందే గంట కొట్టబడెను.

జ.

2. తెలుగులో కవిత్రయంచే మహాభారతం అనువదించబడెను.

జ.

3. వాల్మీకిచే రామాయణాన్ని రచించబడెను.

జ.

4. మనుచరిత్ర అల్లసాని పెద్దనచే రచించబడెను.

జ.

5. సామాగ్రి పార్వతీశం చేత సర్దుకొనబడెను.

జ.

6. వివిధ కవులచే సుభాషితాలను రచించబడ్డాయి.

జ.

7. అతని చేత పుస్తకం వ్రాయబడింది.

జ.

8. నాచే పుస్తకము చదువబడెను.

జ.

9. ఆ పద్యం పూర్తిగాక ముందే పై కప్పులో ఇరుక్కున్న తీగె సవరించబడింది.

జ.

10. అతని చెల్లెలుగా పరిచయం కాబడిన నా ఇంటి పేరు అదేగా వ్రాసుకున్నారు నిర్వాహకులు.

జ.

11. అధునాతన భవనంలో రిప్‌వాన్ ఉంచబడ్డాడు.

జ.

12. అది నవీన పరికరాలతో నిర్మించబడిన ఆదర్శ గృహము.

జ.

క్రింది సామాన్య వాక్యాలను సంశ్లిష్ట వాక్యంగా మార్చండి

1. నామల్లెలు ఎంతోమంది యువతులు ధరించారు. ఎంతో ఆనందించారు.

జ.

2. లక్ష్మీబాయి గుంటూరు వచ్చింది. లక్ష్మీబాయి శారదానికేతనంలో చేరింది.

జ.

3. లక్ష్మీబాయి ఘటకేశ్వరంలో పుట్టింది. ఘటకేశ్వరంలో పెరిగింది.

జ.

4. వింకిల్ పట్టణ విహారం చేసాడు. వింకిల్ అనేక వింతలను చూసాడు.

జ.

5. సుమన్ పాట పాడుతున్నాడు. సుమన్ స్నానం చేస్తున్నాడు.

జ.

6. ప్రవరుడు హిమాలయములకు వెళ్ళాడు. హిమాలయముల సౌందర్యము చూశాడు.

జ.

7. పార్వతీశం రైలు ఎక్కాడు. సామాను లోపల పెట్టాడు.

జ.

8. సీత బజారుకి వెళ్ళింది. సీత చీరలు కొన్నది.

జ.

9. జరిత ఆకాశమునకు ఎగిరి వెళ్ళింది. జరిత ఆందోళనతో చూస్తున్నది.

జ.

10. విజయశ్రీని వరించండి. మాతృదుఃఖాన్ని తొలగించండి.

జ.

11. పిల్లలు సముద్రతీరాన ఆడుకుంటున్నారు. ఇసుకతో ఇళ్ళు కట్టుకుంటున్నారు.

జ.

12. అతనిపై ప్రశ్నల వర్షము కురిపించారు. సమాధానములు తెలుసుకుంటున్నారు.

జ.

13. అంబేద్కర్ అమెరికా వెళ్ళాడు. తనతో ఇరవై నాల్గు పెట్టెల పుస్తకాలు తెచ్చుకున్నాడు.

జ.

14. వదరుబోతు వ్యాసకర్తలు వ్యాసములు ముద్రించారు. వ్యాసములు ఉచితముగా పంచారు.

జ.

1. మేము కష్టపడి చదువు కుంటున్నాము. మేము ఎక్కువ మార్కులు పొందుతాము.

జ.

2. నేను ఘటకేశ్వరంలో పుట్టాను. నేను ఘటకేశ్వరంలో పెరిగాను.

జ.

3. బొండు మల్లెలు వేసింది తానే. పెంచింది తానే. డబ్బు చేసింది తానే.

జ.

4. రాము కడపకు వెళ్ళినాడు. రాము సినిమా చూసినాడు.

జ.

5. పార్వతీశం చైన్ లాగినాడు. పార్వతీశం రైలు ఆపినాడు.

జ.

6. లక్ష్మీబాయి గుంటూరు వచ్చింది. లక్ష్మీబాయి శారదానికేతనంలో చేరింది.

జ.

7. జరిత అగ్ని జ్వాలలు చూసెను. జరిత శోకించెను.

జ.

8. వాడు వ్యాయామం చేశాడు. వాడు స్నానం చేశాడు.

జ.

9. నా మల్లెలు ఎంతో మంది యువతులు ధరించారు. ఆనందించారు.

జ.

10. మంచి రచనలు వ్రాయండి. మంచి మెప్పు పొందండి.

జ.

11. వింకిల్ పట్టణ విహారం చేసాడు. ఐస్‌క్రీం చవిచూశాడు.

జ.

12. తాత బొండుమల్లెలు కోశాడు. తాత వాటిని అమ్మి డబ్బు తెచ్చాడు.

జ.

13. ఎందరో దేశభక్తులు తమ ధనమాన ప్రాణాలను కోల్పోయారు. దేశానికి స్వాతంత్ర్యం తెచ్చారు.

జ.

14. గీత బాగా నృత్యం నేర్చుకొంది. గీత బాగా నృత్యం చేసింది.

జ.

15. పిల్లలు సముద్ర తీరాన ఆడుకుంటున్నారు. ఇసుకతో ఇల్లు కట్టుకొన్నారు.

జ.

## సామాన్య వాక్యాలను సంయుక్త వాక్యాలుగా మార్చుట

1. అతను బాగా అనుభవమున్న డాక్టరు. ఇంజక్షను చెయ్యడం రాదు.

జ.

2. కవిత పాటలు బాగా పాడింది. ఆమెకు బహుమతి రాలేదు.

జ.

3. వేసవికాలం వచ్చింది. మామిడిపండ్లు రాలేదు.

జ.

4. ఆయన సత్యకాలంవాడు. పరమ సాత్త్వికుడు.

జ.

5. కృష్ణుడున్న త్రాసు పైకి లేవలేదు. జనం ఘొల్లున నవ్వుతున్నారు.

జ.

6. బొండుమల్లెలు వేసింది తాతే. పెంచింది తాతే.

జ.

7. మా టీచరుకు నాపై ఎనలేని ప్రేమ ఉండేది. మా టీచరుకు నాపై ఎనలేని సానుభూతి ఉండేది.

జ.

8. ఈ సంవత్సరం వర్షాలు బాగా కురిశాయి. పంటలు బాగా పండాయి.

జ.

9. నాకు రాజనీతి నేర్పింది ఈయనే. నాకు మానవతను నేర్పింది ఈయనే.

జ.

10. తాత బలహీనంగా ఉన్నాడు. తాతను కుదుర్చుకోవడం శుద్ధదండగ అని రచయిత అనుకొన్నాడు.

జ.

11. వీరు పొమ్మనువారు కారు వీరు పొగబెట్టువారు.

జ.

12. ఆ పెద్దమనిషి హాస్యప్రియుడు. ఆ పెద్దమనిషి సూక్ష్మగ్రాహి.

జ.

13. పార్వతీశం రైలు ఎక్కినాడు. గార్డు పార్వతీశాన్ని క్రిందకు దింపినాడు.

జ.

14. గార్డు పచ్చజెండా ఊపాడు. రైలు కదిలింది.

జ.

15. ఏ మనిషీ ప్రేమకు అతీతుడుకాదు. ఏ మనిషీ ద్వేషానికి అతీతుడు కాదు.

జ.

16. చేనేత పరిశ్రమల అంకెలు తెలిశాయి. చేనేత పరిశ్రమల వివరాలు తెలిశాయి.

జ.

17. నాలో చురుకుదనము ఉంది. నాలో జిజ్ఞాస ఉంది.

జ.

18. పశుబలంతో నాయకత్వాన్ని సంపాదించవచ్చు. పశుబలంతోనే నాయకత్వాన్ని నిలబెట్టుకోవాలి.

జ.

19. అంబేద్కర్ కార్యవాది. అంబేద్కర్ క్రియాశీలి.

జ.

1. గుఱ్ఱాన్ని చెరువు దగ్గరకు తీసుకువెళ్లవచ్చు. గుఱ్ఱాన్ని నీరు త్రాగించలేము.

జ.

2. వేసవి వచ్చింది. మామిడి పండ్లురాలేదు.

జ.

3. కవిత పాటలు పాడింది. ఆమెకు బహుమతి రాలేదు.

జ.

4. గీత పాటలు రాస్తుంది. గీత పాటలు పాడుతుంది.

జ.

5. పార్వతీశం రైలు ఎక్కినాడు. గార్డు పార్వతీశాన్ని కిందకు దింపినాడు.

జ.

6. కృష్ణుడున్న త్రాసు పైకి లేవలేదు. జనం ఘొల్లున నవ్వుతున్నారు.

జ.

7. గార్డు పచ్చజెండా చూపాడు, రైలు కదిలింది.

జ.

8. నా సైకిల్ దొరికింది. దొంగ దొరకలేదు.

జ.

9. బిళ్వమంగళుడు బహు నీతిమంతుడు. అతడు వేశ్యాలోలుడైనాడు.

జ

10. మాటల అలికిడికి చిట్టి మెల్కొన్నది. చిట్టి కళ్ళు తెరవలేదు.

జ.

11. వీరు పొమ్మనువారుకారు. పొగబెట్టువారు.

జ.

12. ఈ సంవత్సరం వర్షాలు బాగా పడ్డాయి. ఈ సంవత్సరం పంటలు పండలేదు.

జ.

13. పశుబలంతో నాయకత్వాన్ని సాధించవచ్చు పశుబలంతో నాయకత్వాన్ని నిలబెట్టుకోలేము.

జ.

14. నాలో చురుకుతనం ఉంది. నాలో జిజ్ఞాస ఉంది.

జ.

## జాతీయాల వివరణ

1. <u>పొట్టవెన్నుకంటుకుపోవు</u> :- ప్రకృతి వైపరీత్యముల వలన, అనారోగ్యం వలన, సరియైన ఆహారం లభించనప్పుడు బక్కచిక్కి బలహీనంగా తయారవుతారు. వారిని గురించి వివరించేటప్పుడు ఈ జాతీయం ఉపయోగిస్తారు.
2. <u>కళ్ళల్లో వత్తులు వేసుకొను</u> :- వ్యక్తుల గురించికాని, ఫలితము గురించి గాని నిద్రపోకుండా ఎదురుచూసే సందర్భంలో ఈ జాతీయాన్ని ఉపయోగిస్తారు.
3. <u>మూడుపువ్వులు ఆరుకాయలు</u> :- మనం చేసే పని ఫలితము ఊహించిన దానికన్నా అధికలాభం ఇచ్చినపుడు ఈ జాతీయం ఉపయోగిస్తారు.

4. ప్రాథేయపడు :- పని పూర్తి అగుట కొరకు ఇతరులను వినయంగా బ్రతిమిలాడి అడిగే సందర్భంలో ఈ జాతీయం ఉపయోగిస్తారు.

5. ఉనికిపట్టు :- ఏదైనా వస్తువులకు, విషయములకు ప్రసిద్ధి చెందిన స్థలములను తెలియచేయు సందర్భంలో ఈ జాతీయం వాడతారు.

6. పదేపదే :- చెప్పిన విషయములనే పలు పర్యాయములు చెప్పినపుడు ఈ జాతీయం వాడతారు.

7. కంకణం కట్టుకొను :- ఏదేని ఒక పని యొక్క ఫలితమును సాధిస్తామని పట్టుదలగా పని చేసినపుడు ఈ జాతీయం వాడతారు.

8. కుందేటికొమ్ము :- కుందేలుకు కొమ్ములుండవు. దేనినైనా సాధించలేము అని తెలియచేయు సందర్భములో ఈ జాతీయం వాడతారు.

9. నిమ్మకు నీరెత్తినట్లు :- ఎంతటి ప్రమాదము జరిగినా ఆందోళన చెందకుండా బెంగ లేకుండ నిశ్చలంగా ఉండేవారిని గురించి తెలియచేసేటప్పుడు ఈ జాతీయం వాడతారు.

10. కాలికి బుద్ధిచెప్పు :- భయపడి పారిపోయే వారి గురించి ఈ జాతీయం వాడతారు.

11. అందెవేసిన చేయి :- ఏదేని ఒక రంగములో నిష్ణాతుడై ప్రతిభ చూపు వారి గురించి తెలియ చేసేటప్పుడు ఈ జాతీయం వాడతారు.

12. పగటికలలు :- ఏవైనా జరగని పనుల గురించి కూడా జరుగుతాయి అని ఊహలలో విహరిస్తూ కష్టపడి ప్రయత్నించని వారిని గురించి తెలియచేసేటప్పుడు ఈ జాతీయం ఉపయోగిస్తారు.

13. భగీరథ ప్రయత్నం :- ఒక పని పూర్తి చేయడానికి మిక్కిలిగా కష్టపడి ప్రయత్నించి సాధించిన సందర్భంలో ఈ జాతీయం వాడతారు.

14. గొడ్డలిపెట్టు :- జరుగుచున్న అభివృద్ధికి ఏ కారణం చేతనైనా ఆటంకం కలిగినపుడు ఈ జాతీయం ఉపయోగిస్తారు.

15. పుస్తకాల పురుగు :- అదే పనిగా నిరంతరం ఎక్కువ పుస్తకములు చదివే వారి గురించి తెలియచేసే సందర్భంలో ఈ జాతీయం వాడతారు.

16. ఆరునూరగు :- ఆరు నూరు అగుట జరగదు. ఈ పని జరుగుట అసంభవం అను సందర్భంలో ఈ జాతీయం వాడతారు.

17. అట్టుడికినట్లు :- ఏవైనా ఉద్యమాలు తీవ్రతరమై ఆందోళనలు, అల్లర్లు ఎక్కువైన సందర్భంలో ఈ జాతీయం ఉపయోగిస్తారు.

18. నోరుకదుపు :- బలవంతంగా, తప్పనిసరిగా మాట్లాడవలసివచ్చిన సందర్భంలో ఈ జాతీయం వాడతారు.

19. ఎవరికి వారే యమునా తీరే :- ఒకరికొకరికి పనులతో, ఆలోచనలతో సంబంధం లేకుండా ఒకే చోట నివసించేవారి గురించి తెలుపు సందర్భంలో ఈ జాతీయం వాడతారు.

20. <u>మూణ్ణాళ్ళ ముచ్చట</u> :- ఎంతో అభివృద్ధి చెందుతున్న వారు అనతి కాలంలోనే ఆయా రంగాలలో నష్టపోయిన సందర్భంలో ఈ జాతీయం వాడతారు.

21. <u>అక్కున చేర్చుకొను</u> :- ప్రేమతో దగ్గరకు తీసుకొని మాట్లాడు సందర్భంలో ఈ జాతీయం వాడతారు.

22. <u>వలలు వేయుట</u> :- మోసంచేయటం కొరకు ఆకర్షణతో లోబరచుకొను వారిని గురించి తెలుపు సందర్భంలో ఈ జాతీయం ఉపయోగిస్తారు.

23. <u>ఉడుంపట్టు</u> :- ఒక పని సాధించేవరకు విడువకుండా పట్టు బిగించు సందర్భంలో ఈ జాతీయం ఉపయోగిస్తారు.

24. <u>ఆపాదమస్తకం</u> :- శరీరమంతా అనిగాని, నిలువెల్లా అని గాని, పాదమునుంచి తల వరకు అనిగాని తెలుపు సందర్భంలో ఈ జాతీయం ఉపయోగిస్తారు.

25. <u>ఆపద్ధర్మం</u> :- ఏదైనా అప్పటివరకు చేయని పనిని తప్పని సరి పరిస్థితులలో చేయవలసి వచ్చినపుడు ఈ జాతీయం వాడతారు.

26. <u>అడ్డదారిపట్టు</u> :- న్యాయమార్గం వదలి అవినీతి మార్గంలో వివిధ రంగాలలో ప్రవర్తించు వారిని గురించి తెలియచేయు సందర్భంలో ఈ జాతీయం ఉపయోగిస్తారు.

27. <u>చేజారిపోవు</u> :- పొందవలసిన ఏదేని ఒక గొప్ప అవకాశమును పోగొట్టుకున్న సందర్భంలో ఈ జాతీయం వాడుతారు.

28. <u>వీధిపాలుచేయు</u> :- అపురూపంగా చూడవలసిన వాటిని వ్యర్థంగా విడిచిపెట్టారు అను సందర్భంలో ఈ జాతీయం వాడతారు.

29. <u>గగనకుసుమం</u> :- మనకు లభించడం అసంభవం అను అంశం వివరించే సందర్భంలో ఈ జాతీయం వాడతారు.

30. <u>వేలెత్తిచూపు</u> :- ఒకరిని గురించి ఆక్షేపించడాన్ని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

1. <u>ప్రియభాషలు</u> :- 'వినటానికి ఇంపైన మాటలు' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

2. <u>అవిరామం</u> :- 'విశ్రాంతి లేకుండా కృషి చేయడం' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

3. <u>విచ్చలవిడి</u> :- 'స్వేచ్ఛగా లేదా అడ్డూ, అదుపు లేకుండా తిరుగు' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

4. <u>నలాంకొట్టు</u> :- 'వీడ్కోలు చెప్పు' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

5. <u>పాలుత్రాగు</u> :- 'బాల్యము, పసితనము' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

6. <u>చేజారిపోవు</u> :- 'ఒక విషయం తన ఆధీనం నుండి తప్పిపోవుట' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

7. <u>అపురూపం</u> :- 'ఏదైనా ఒక వస్తువుగాని, వ్యక్తినిగాని, జాగ్రత్తగా చూడటాన్ని గురించి తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

8. <u>కళ్ళల్లోవత్తులేసుకొను</u> :- 'నిద్ర, ఆహారం మాని శ్రద్ధగా ఒక విషయాన్ని గురించి అదే పనిగా ఎదురు చూచుట, అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

9. <u>పగటి కలలు</u> :- 'ఫలించడానికి వీలులేని కోరికలు' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

10. <u>తలదన్ను</u> :- 'అతిశయించు లేదా మించిపోవు' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

11. <u>భగీరథ ప్రయత్నతం</u> :- 'అమోఘమైన కార్యదీక్ష' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

12. <u>గొడ్డలిపెట్టు</u> :- 'అభివృద్ధికి ఆటంకం కలిగించు' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

13. <u>ఆపద్ధర్మం</u> :- 'మామూలు సమయంలో ధర్మం కాకపోయినా ఆపద సమయంలో ధర్మమైనది' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

14. <u>నిమ్మకు నీరెత్తినట్టు</u> :- "నిరాసక్తిగా ఉండు లేదా స్పందన లేకుండా ఉండు" అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

15. <u>పుస్తకాల పురుగు</u> :- 'ఎప్పుడు ఏదో ఒక పుస్తకం విశ్రాంతి లేకుండా చదివే వ్యక్తి' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాని వాడతారు.

16. <u>ఆరునూరగు</u> :- 'అసంభవమైన విషయం సంభవంకావచ్చు కానిప్రస్తుత విషయం జరగదు' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాని వాడతారు.

17. <u>తండోపతండాలు</u> :- లెక్కలేనన్ని అని తెలియజేయు సందర్భంలో జాతీయాని వాడతారు.

18. <u>అందెవేసిన చేయి</u> :- ఒక విషయంలో మంచి నేర్పరి (సమర్థుడు) అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

19. <u>ఆకాశకుసుమం</u> :- 'అసంభవమైనది' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

20. <u>మూణ్ణాళ్ళముచ్చట</u> :- 'తాత్కాలిక ఆనందంగా పరిణమించినది' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

21. <u>ఎవరికి వారే యమునాతీరే</u> :- 'ఎవరిదారివారిది, ఎవరిఆలోచనవారిది' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

22. <u>ఆటపట్టు</u> :- 'నివాసము లేదా నిలయము' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

23. <u>ఉడుంపట్టు</u> :- 'పట్టినపట్టు విడవకుండుట' అని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు.

## అభినందన ప్రశంసా పత్రము

### నీలహంస

స్వస్తిశ్రీ చాంద్రమాన ఖరనామ సంవత్సర 'ఉగాది' సందర్భంగా

'ఆకు'పై కవితా పోటీ లో ఆత్మఘోష కవిత కు గాను

కవితావిజేత గా నిలిచిన శ్రీమతి/శ్రీ స్ఫురిత గారికి

మా హృదయపూర్వక అభినందనలు

స్ఫురితగారి కవిత పంక్తులన్నీ.....

ఊరిస్తూ ఊహించని, మలుపులతో మంచి ముగింపు! నన్ను

బాగా ఆకట్టుకుంది.

ఆకుపై ఆప్తవాక్యాలు వాత్సల్యం తో రాసినట్టుగా నాకు తోచింది

నా ఉద్దేశ్యం లో "చదివిన తరువాత అలోచించడం

తప్పనిసరిఅయిపోవాలి " అది కవితంటే!!!

దానికి పరిపూర్ణ అర్హత సాధించిన కవిత ఇది.

వారికి నా అక్షరాభినందనలు . వందనాలు

నిర్వాహకులు

సత్య

---

## "క్విట్ ఇండియా"

అరవయ్యేళ్ళుగా మీరు, మీ తల్లిదండ్రులు కలిసి జీవిస్తున్న మీ ఇంటిని, రక్త స్వేదాలను రూపాయిలుగా మార్చి మీరు నిర్మించుకున్న "మీ" పేద్ద సౌధాన్ని, హఠాత్తుగా కొందరు కూలగొట్టాలని చూసుకొస్తుంటే ఏం చేస్తారు ??

- మా ఇంటి మీద మీకేం హక్కుందని నిలదీస్తారు.
  ప్రాణప్రదంగా కాపాడుకుంటూ వస్తున్న ఇంటిని నిలబెట్టుకునేందుకు ఎదురెళ్తారు.
  ఆవేశంతోనో, ఆలోచనతోనో పోరాటం సాగిస్తారు.

**అవునా ?!**

రెండు వందల సంవత్సరాలు... దాదాపు రెండు వందల ఏళ్ళ బానిసత్వంలో మగ్గిన భారతదేశాన్ని,

అచ్చం ఇలానే కాపాడుకోవాలని పరితపించారు

వేల మంది స్వాతంత్ర్య యోధులు !!

స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు మనకి బహుమతిగా ఇచ్చారు.

- అయితే, ఇటీవలి కాలంలో మళ్ళీ ఇటువంటి బానిసత్వమేదో మనల్ని బందీలను చేస్తోందని అనిపించడం లేదా ?
- అన్యాయాన్ని ప్రశ్నించే అధికారాన్ని, అవినీతిని తిప్పి కొట్టగల స్వాతంత్ర్యాన్ని, ప్రశాంత జీవనాన్ని, కనీస సౌకర్యాలని కోల్పోతున్నాం అన్న భావన కుంగదీయడం లేదా ?
- ఈ రాష్ట్రం మనమందరం ఆశించినట్టుగా కాక, కొందరు కోరినట్టుగా సాగుతున్నట్టు తెలిసి నిరాశ కలుగుతుందా ?

**అయితే రండి !!**

**చరిత్ర తిరగరాద్దాం !!**

**హింస, అవినీతి, అశాంతి, అన్యాయాలకి "క్విట్ ఇండియా" చెప్పేద్దాం !!**

**'ఓటు' మన ఆయుధం**

కోట్ల ప్రాణాల వేదన తొలగించేందుకు ఉరకలేస్తున్న చైతన్య రథంపై 'గెలుపు' జెండా

ఎగరేసుకునేందుకు వస్తోంది - "లోక్‌సత్తా" !

సుస్థిర పాలనే లక్ష్యంగా స్పష్టమైన ప్రణాళికతో ముందుకొస్తున్న లోక్‌సత్తా ని గెలిపిద్దాం !

**ఎప్పుడో కాదు, ఇప్పుడే,**

నిజాయితీని గెలిపిద్దాం - మనల్ని మనం కోల్పోయాక కాదు, ఇప్పుడే !

"జైహింద్".




**లోక్‌సత్తా పార్టీ**




గుర్తుకే మీ ఓటు

పోలింగ్ తేది : 23-11-2009

సమయం: ఉ. 7 గం.ల నుండి సా. 4 గం.ల వరకు

గుర్తుకే మీ ఓటు

---




## రాయలసీమ భవితవ్యం పై కవుల, రచయితల సమాలోచన

### ఆహ్వానము

వేదిక: సి.పి.బ్రౌన్ భాషా పరిశోధనా కేంద్రం, ఎర్రముక్కపల్లె, కడప.

**తేది: 6-7-2014వ తేది ఆదివారం ఉదయం 10 గం॥ నుండి సాయంత్రం 4 గం॥ల వరకు**

**నమస్కారం !**

రాష్ట్ర విభజన అనంతరం రాయలసీమ భవిష్యత్తు 1953 నాటి పరిస్థితులకంటే దయనీయంగా మారే ప్రమాదం ఏర్పడింది. నూతన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో రాజధాని ఎంపిక మొదలుకొని పునర్నిర్మాణ ఆలోచనల వరకు రాయలసీమ అభివృద్ధిని విస్మరించే వాతావరణం నెలకొంటోంది. రాయలసీమలో సాగునీటి ప్రాజెక్టుల పరిస్థితి అగమ్యగోచరమైంది. నవ్యాంధ్రప్రదేశ్‌లో చేపట్టనున్న అభివృద్ధి ప్రణాళికను మొత్తం కోస్తా ప్రాంత ప్రయోజనాలకే పరిమితమవుతున్న సూచనలు ప్రస్ఫుటమవుతున్నాయి.

ఈ పరిస్థితుల్లో రాయలసీమ కవులు, రచయితలు, పత్రికా రచయితలు, తక్షణం సమాలోచన జరపాల్సిన అవసరం ఎంతైనా ఏర్పడింది. ఈ ప్రయత్నంలో భాగంగా జూలై 6వ తేదిన ఆదివారం కడప, ఎర్రముక్కపల్లెలోని సి.పి.బ్రౌన్ భాషా పరిశోధన కేంద్రంలో సమాలోచన సదస్సు జరుగనుంది. ఉ. 10గం॥ నుండి సా॥ 4గం॥ల వరకు జరుగనున్న ఈ సదస్సులో పాల్గొని, మీ అభిప్రాయాలను వ్యక్తపరచి రాయలసీమ భవితవ్యానికి దిశా నిర్దేశం చేయవలసిందిగా సహృదయంతో ఆహ్వానిస్తున్నాం!

ఉద్యమాభినందనలతో...

| | |
|---|---|
| **తవ్వా ఓబుల్‌రెడ్డి,** | **లెక్కల వెంకట రెడ్డి,** |
| సమన్వయ కర్త. | కన్వీనర్. |
| సెల్: 94400 24471 | సెల్: 80082 71409 |

'కుందూ సాహితి' వై.యస్.ఆర్. జిల్లా.

## గుడివాడ వైభవం

(చరిత్ర–భాష–సాహిత్యం–రంగస్థలం)

క్రీ.పూ. 273 నాటి అశోకుని పాలనలో ఉన్న 30 ఆంధ్రనగరాలలో ప్రసిద్ధిచెందిన నగరం 'గుడివాడ'. పురాణ, జైన, బౌద్ధ యుగాలనుండి నేటిదాకా తెలుగుజాతి చరిత్రలో 'గుడివాడ'కు ప్రత్యేక స్థానముంది. స్వాతంత్రోద్యమాన్ని చైతన్యవంతంగా నడిపించటంలోనూ, గుడివాడను ప్రపంచానికి తెలియచేయడం లోనూ, విలక్షణ రాజకీయాలను నెరపటంలోనూ, సాంస్కృతిక వారసత్వాన్ని నిలపడంలోనూ ప్రత్యేకతను సంతరించుకుంది. గుడులవాడగా, బడులవాడగా అన్నీ ప్రత్యేకాంశాలే!

ఆంధ్రసాహిత్య, రంగస్థల, చలనచిత్ర రంగాలలో అగ్రభాగాన నిలచింది గుడివాడ. వీటన్నింటినీ స్మరించుకుంటూ భావిభారత గుడివాడ పౌరుల భవిష్యత్తుకు బంగరుబాటలు పరచాలి మనం. వ్యవసాయ, పారిశ్రామిక, విద్యా, ఆర్థిక, జలవనరుల, శాస్త్రసాంకేతిక, వైద్య, రవాణా, సామాజిక, ప్రచురణ, మహిళా చైతన్య రంగాలలో గుడివాడ పోషించిన పాత్రను పూర్తి స్థాయిలో వెలికి తీసేందుకు జరగబోయే పరిశోధక సదస్సుకు పునాదిగా, ఆయా రంగాలలో సేకరించిన సమాచారంలో కొంతభాగాన్ని, 'గుడివాడ వైభవం'– (చరిత్ర–భాష–సాహిత్యం–రంగస్థలం) పేరుతో చిరుగ్రంథాన్ని ఆవిష్కరిస్తున్నాం.

గుడివాడ ప్రాంత విద్యార్థుల పాఠ్యపుస్తకాలలో 'గుడివాడ వైభవాన్ని' 3 పేజీల ప్రత్యేక పాఠ్యాంశంగా చేసి, ప్రభుత్వ పరీక్షలలో 3 మార్కుల తప్పనిసరి ప్రశ్నగా చేర్చుటకు మేధావులు, విద్యారంగ నిపుణులు, ప్రజాప్రతినిధులు కృషి చేయాలని విజ్ఞప్తి చేస్తున్నాం. అలాగే ఎక్కడికక్కడ స్థానిక చరిత్ర పాఠ్యాంశంగా ఉండాలని భావిస్తున్నాం.

'గుడివాడ వైభవం' గ్రంథావిష్కరణకు అందరినీ ఆహ్వానిస్తూ.....

1/8 డెమ్మీ సైజు, రంగుల ముఖచిత్రం, 156 పుటలు, వెల : రు.25/–

పుస్తకం కావలసినవారు సభాప్రాంగణంలో తీసుకోవచ్చు.

సంప్రదించండి: తాతా రమేశ్‌బాబు,14/161–2, స్టేషన్‌రోడ్, గుడివాడ–521301

సెల్ : 9441518715 email: rbtata60@gmail.com

## ఆహ్వానము

### గుడివాడ వైభవం



(చరిత్ర–భాష–సాహిత్యం–రంగస్థలం)

### గ్రంథావిష్కరణ సభ

ది.20.06.2011, సోమవారం సా॥ 6 గం॥కు
గుడివాడ క్లబ్‌లో
నవయుగ వైతాళికుడు
త్రిపురనేని రామస్వామి కళావేదికపై

కార్యక్రమం

అధ్యక్షులు : శ్రీ డా.ఎర్నేని వెంకటేశ్వరరావు
గ్రంథావిష్కర్త : శ్రీ పద్మశ్రీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్
ముఖ్యఅతిథి,
గ్రంథస్వీకర్త : శ్రీ కె.ఎస్.లక్ష్మణరావు, ఎమ్.ఎల్.సి
ఆత్మీయఅతిథి : శ్రీ పి.చంద్రశేఖర ఆజాద్
(రాధామధు, లయ సీరియల్స్‌లో రాఘవయ్య, మాధవయ్యగా తెలుగు పాఠకుల ప్రేక్షకుల మనసు దోచుకున్న నటుడు, ప్రసిద్ధ కథా నవలా రచయిత)
రచయిత స్పందన : శ్రీ తాతా రమేశ్‌బాబు



తిప్పి చూడండి...

